# సుజాత

## తెలంగాణా సంచిక

15 ఆగష్టు

1951



సచిత్ర సారస్వత మాస పత్రిక

గీ॥ సకలదేశ సమాగత సుకవిజనుల, నాదరించిన గద్వాల యాంధ్రవాణి
నెంత పూజించెనో వచియింపఁగలమె! బహుళదాతలు శ్రీముష్టిపల్లి నృపులు. 22

శా॥ వాగారంభము లేమిచాలునిట, నవ్వారేని శాస్త్రజ్ఞతా
శ్రీఁగన్నన్, సుకవిత్వ వైభవ జయశ్రీ మించినన్ గాన వి
ద్యాగంధర్వ యశంబుఁ దాల్చినను విద్యానాథులై మించినన్
శ్రీ గద్వాల సభాంతరంబునకు రాకేఁ దృప్తి చేకూరెనే ? 23

గీ॥ మరియు వనపర్తి, జటప్రోలు మనుజ పతులు
సంస్కృతాంధ్రంబులను కృతుల్ సంతరించి
రాత్మకూరును గద్వాలయట్టి యశము
కొల్లఁగొనెఁ దెల్గువారల యుల్ల మలర. 24

గీ॥ త్రవ్వ కొలఁదిని రత్నాలు, తఱచుకొలఁది
వెన్నయును, గాఁచుకొలఁదియు జున్ను నగుచుఁ
దలఁపు తలఁపునఁ గ్రొత్తలు పులకరించు
రాణ వెలుఁగొందు మా తెలంగాణ లక్ష్మి. 25




శ్రీ పర్సా వెంకటేశ్వరరావు H. C. S.

వయస్సు 32 సంవత్సరములు

ఆంధ్ర ఆంగ్ల భాషలలో చక్కని అభినివేశము కలవారు. రాజకీయశాస్త్రమున ప్రామాణికులు. సహృదయులు. అనేక సారస్వతసంస్థలకు ఉదార విరాళములనొసగిన వదాన్యులు. కృష్ణదేవరాయ గ్రంథాలయములకు ఉపాధ్యక్షులై, ఆంధ్రసారస్వత పరిషత్తునకు అధ్యక్షులై భాషాసేవ చేయుచున్నారు-ప్రభుత్వమువారి స్టాటిస్టిక్సు శాఖకు అధ్యక్షులుగా నున్నారు.

రచనలు:- (ముద్రి) మన రాజ్యాంగము.


శ్రీమల్లంపల్లి సోమశేఖరశర్మ.

వయస్సు 60 సంవత్సరములు.

ఆంధ్ర ఆంగ్ల, గీర్వాణ, తమిళ, కర్ణాటక భాషలలో పండితులు. సుప్రసిద్ధ ప్రామాణిక ఆంధ్రచరిత్ర పరిశోధకులు. అనేక శాసనసంస్కర్తలు. "కవి, విమర్శకుడు, కృతికర్త, కృతిభర్త, కథకుడు, చారిత్రకపరిశోధకుడు. నిరాడంబరుడు, సహృదయుడు" అని సమకాలిక పండితులచే కీర్తింపబడినారు.

ఆంధ్ర విజ్ఞాన సర్వస్వకార్యములో ముఖ్యపాత్ర వహించినారు. భారతికి సంపాదకులుగా, ఆంధ్ర విశ్వ విద్యాలయములో చరిత్ర పరిశోధకులుగానుండిరి. ప్రస్తుతము మదరాసుప్రభుత్వమువారి తెలుగుభాషా సమితిలో పనిచేయుచున్నారు.

రచనలు.-(ముద్రి) 1 ఆంధ్రమహాసామ్రాజ్యము. 2 దేశోద్ధారకులు. 3 రెడ్డిరాజ్యచరిత్ర (ఆంగ్లము). 4 ఆంధ్రచరిత్రలోవిస్మృతాధ్యాయము(ఆంగ్లము). ఆంధ్రదేశచరిత్ర సంగ్రహము. 6 చారిత్రక వ్యాసములు. 7 కొన్నివందల చారిత్రిక, భాషావిషయిక వ్యాసములు.


శ్రీ దూపాటి వెంకటరమణాచార్యులు

వయస్సు 60 సంవత్సరములు

సంస్కృతాంధ్ర సాహిత్యములలో చక్కని పాండిత్యము కలవారు. శతావధానులు, సుప్రసిద్ధ శేషాద్రి రమణకవులలో నొకరు. తెలంగాణాకు తమ జీవితము నర్పించి సేవచేయుచున్న చరిత్ర పరిశోధకులు. అనేక తెలంగాణా శాసనములను వెలికిదీసినారు. వావిళ్ళకంపెనీ వారికి భాగవతము, శతకసంపుటములు మొదలైన అనేక గ్రంథములను పరిష్కరించి విలువగల పీఠికలను వ్రాసి ఇచ్చినారు. ఆంధ్రోపాధ్యాయులై విరమించి ప్రస్తుతము హైదారాబాదు ప్రభుత్వ ఆర్కియాలజీ శాఖలో శాసనశోధకులుగా పనిచేయుచున్నారు.

రచనలు:- (ముద్రి) నిజాం రాష్ట్రాంధ్ర ప్రశంస 2 విక్రమోర్వశీయ కావ్యము. 3 ఆంధ్రమంత్రులు 4 దానబోధ. ఇంకను కొన్ని నాటకములు, నవలలు, శతకములనుగూడ ప్రకటించినారు.

వయస్సు 66 సంవత్సరములు.

ఆంధ్ర ఆంగ్ల, ఉరుదూ, పారసీకభాషలలో పాండిత్యము, మహారాష్ట్ర, హిందీ భాషలయందు మంచి పరిచయముగలవారు. మధురకవులు. ఉత్తమ కథానికా రచయితలు, చక్కని అనువాదకులు, పత్రికారచయితలు, వక్తలు.

తెలంగాణములోని అనేక గ్రంథాలయములకు, జాతీయపాఠశాలలకు, సారస్వతసంస్థలకు, రాజకీయోద్యమములకు, జనకులు, నిర్వాహకులు, సహాయకులునైన ఆంధ్రపితామహులు. ప్రస్తుతము హైదారాబాదునగర కార్పొరేషన్ మేయరుగా సేవచేయుచున్నారు.

రచనలు:- (ముద్రి) 1 ఛాత్రకాలపు హిందూర్యులు 2 మల్లికాగుచ్ఛము, 3 ఆంధ్రోద్యమచరిత్ర రెండు భాగములు.

(అ.ము) ఆనందమఠ, గ్యారిబాల్డి జీవితము, గోమక సామ్రాజ్యచరిత్రము, మహాభారతసమీక్షణము, ఫిర్దౌసీ పద్యానువాదము.


శ్రీ మాడపాటి హనుమంతరావుపంతులు

వయస్సు 55 సంవత్సరములు.

సంస్కృతాంధ్ర ఆంగ్ల ఉరుదూ పారశీక భాషలలో వైదుష్యముకలవారు. ఉత్తమచరిత్ర పరిశోధకులు, నిర్భయవిమర్శకులు, గొప్పవక్తలు. ప్రఖ్యాత పత్రికాధిపతులు, సరసహాస్య కథానికా రచయితలు.

తెలంగాణమునందలి అన్ని రాజకీయ, సాంఘిక, సాంస్కృతికోద్యమములతో సన్నిహితసంబంధము కలవారు. ఆంధ్రపితామహులకు అన్ని కార్యములలో దక్షిణ భుజముగా పనిచేసినవారు. ఆంధ్రసారస్వతపరిషత్తు, విజ్ఞానవర్ధనీ పరిషత్తు స్థాపకులలో నొకరుగా నిర్వాహకులుగా సేవచేయుచున్నారు. గోలకొండపత్రికను ప్రారంభించి 23 సంవత్సరములు సమర్థతతో నడపినారు. త్వరలో ప్రజావాణి ద్వారా క్లిష్టకాలములో తెలంగాణము నుద్బోధింపనున్నారు.

రచనలు:-(ముద్రి) 1 హిందువుల పండుగలు. 2 హైందవధర్మవీరులు. 3 ప్రతాపరెడ్డి కథలు. 4 రామాయణ విశేషములు. 5 ఆంధ్రులసాంఘికచరిత్ర. 6 ప్రజాధికారములు. 7 వెంకటరామారెడ్డి జీవితచరిత్ర.

(అ. ము.) తుకారాం (నాటకము), ఖండకావ్యాలు, శుద్ధాంత కాంత.



శ్రీ సురవరము ప్రతాపరెడ్డి బి. ఏ. బి. ఎల్.



(శ్రీ దేవులపల్లి రామానుజరావు
బి. ఏ. ఎల్. ఎల్. బి.

వయసు 35 సంవత్సరములు.

ఆంధ్ర, ఆంగ్ల, ఉరుదూభాషలలో దిట్టమైనసాహిత్యపటిమగలవారు. జీవితమును ఆంధ్రభారతీ ఆరాధనకు వినియోగించుచున్న భాషాసేవకులు, ఆంధ్రసాహిత్యవిమర్శకులలో అగ్రశ్రేణికి చెందినవారు. సరళశైలిలో వచన రచన చేయుటయందు సిద్ధహస్తులు. మొగమాట మెరుగని ఉత్తమ పత్రికారచయితలు.

సాధనసమితి, దక్షిణభారత సంసద్, నాట్యకళా పరిషత్తు మొదలైన సాంస్కృతికసంస్థల నిర్వహణలో భాగస్వాములు. 'శోభ' అను మాసపత్రికకుసంపాదకులు, గోలకొండపత్రికకు సహాయసంపాదకులు; ఆంధ్ర సారస్వతపరిషత్తుఉపాధ్యక్షులై ఉదాత్తకృషిచేయుచున్నారు.

రచనలు:-(ముద్రి) నవ్యకవితా నీరాజనము.

(అ.ము.) ఏకవీర, పచ్చతోరణము.

వయస్సు 42 సంవత్సరములు.

సంస్కృతాంధ్ర, ఆంగ్ల, తమిళ, కర్నాటక భాషలలో విద్వాంసులు. యం. ఏ. పట్టభద్రులై ఇంగ్లాండుకు వెళ్ళి లండన్ విశ్వవిద్యాలయములో చరిత్ర పరిశోధనముచేసి P. H. D. బిరుదమునుపొందినారు. వీరి ఉత్తమ రచనలన్నియు విశేషముగా ఇంగ్లీషుభాషలోనున్నవి. హిందూసంస్కృతి, భారతీయ శిల్పకళ, వాస్తుశాస్త్రములలో ప్రత్యేకపరిశ్రమచేసిన ప్రామాణిక పండితులు. హైదరాబాదుప్రభుత్వమువారి ఆర్కియాలజీ శాఖకు తెలంగాణాలోని కొన్ని శాసనములను పరిష్కరించి యిచ్చినారు. విజయవాడకళాశాలాధ్యక్షులుగా చాలకాలము పనిచేసి బర్మాకు విశ్వవిద్యాలయాచార్యులుగావెళ్ళి, ప్రస్తుతము హైదరాబాదుప్రభుత్వ ఆర్కియాలజీ శాఖలో డైరెక్టరుగా పనిచేయుచున్నారు.

రచనలు:-(ముద్రి)ప్రాచీనాంధ్ర చిత్రకళాఖండములు.

(అ.ము.) కాకతీయ, విజయనగరచరిత్రలపై ఇచ్చిన మహోపన్యాసములు.



శ్రీ పుట్టపర్తి శ్రీనివాసాచార్యులు
యం. ఏ., పి. హెచ్. డి.


శ్రీ కొమ్మవరపు సుబ్బారావు.

వయస్సు 50 సంవత్సరములు.

ఆంధ్ర, ఆంగ్లములలో చక్కని ప్రవేశము కలవారు. ఆంధ్ర పితామహుల అనుయాయులై గ్రంథాలయోద్యమమున కృషిచేసినవారు. వేమనాంధ్రగ్రంథాలయస్థాపకులై నిర్వాహకులై అపారసేవ చేయుచున్నారు. హైదరాబాదుప్రభుత్వ వ్యవసాయశాఖనుండి విశ్రాంతి తీసికొని గోలకొండపత్రికకు మేనేజరుగా పనిచేయుచున్నారు.



# మహారాజపోషకులు

| | | |
|---|---|---|
| శ్రీయుత | దుంపలి రామిరెడ్డిగారు | ఉండవెల్లి |
| ,, | జలగం వెంకటస్వామిగారు | ,, |
| ,, | బచ్చు వెంకటేశ్వర గుప్తగారు | లంగనవాయి |
| ,, | సింగసాని నారాయణరెడ్డిగారు | ,, |
| ,, | శివారెడ్డిగారి నారాయణరెడ్డి గారు | జల్లాపురం |
| ,, | కానాపురం యల్లారెడ్డిగారు | తక్కసిల |
| ,, | పాడువు పుల్లారెడ్డిగారు | ,, |
| ,, | చల్లా సూరారెడ్డిగారు | ,, |
| ,, | పర్సా వెంకటేశ్వర రావుగారు | హైదరాబాదు |
| ,, | ఆకుతోట శేషయ్య సెట్టిగారు | మారామునగాల |

# రాజపోషకులు

| | | |
|---|---|---|
| ,, | సత్యనారాయణ జిన్నింగ్ ఫ్యాక్టరీవారు | అలంపూరు |
| ,, | కొత్తింటి హనుమంత రెడ్డిగారు | చెన్నిపాడు |
| ,, | కొత్తింటి శివారెడ్డిగారు | ,, |
| ,, | పో॥ ప॥ నారాయణరెడ్డిగారు | ,, |
| ,, | ఇల్లూరు వెంకయ్య సెట్టిగారు | లంగనవాయి |
| ,, | పారెడ్డి ఉసేన్‌రెడ్డిగారు | ,, |
| ,, | బి. జయరామరెడ్డిగారు | చింతకాయమంద |
| ,, | టి. రాజశేఖరరెడ్డిగారు | అలంపూరు |
| ,, | కె. వెంకట రామరెడ్డిగారు | ఉప్పలపాడు |
| ,, | పో॥ ప॥ సంజీవరెడ్డిగారు | ,, |
| ,, | వడ్ల రామస్వామిగారు | తక్కసిల |
| ,, | నారాయణ శ్రేష్ఠిగారు | ,, |
| ,, | బి॥ నారాయణ ప్రసాదుగారు | ,, |
| ,, | పో॥ ప॥ వెంకటరెడ్డిగారు | ,, |
| ,, | మా॥ ప॥ వేమారెడ్డిగారు | ,, |
| ,, | బి॥ గంగిరెడ్డిగారు | పెద్ద పోతలపాడు |
| ,, | బి॥ వెంకట రామారెడ్డిగారు | ,, |
| ,, | వెంకట రెడ్డిగారు | బసవాపురం |
| ,, | శేషిరెడ్డిగారు | ,, |
| ,, | చిన్న సోమిరెడ్డిగారు | ,, |
| ,, | కె. రామారెడ్డిగారు | మారామునగాల |
| ,, | దుంపలి చిన్న తిరుపతిరెడ్డిగారు | ఉండవెల్లి |
| ,, | మా॥ బసిరెడ్డిగారు | ,, |
| ,, | య॥ ఉక్కారెడ్డిగారు | ,, |
| ,, | మి॥ మద్దిలేటిగారు | ,, |

| | | |
|---|---|---|
| ,, | దుంపలి పెద్ద బాలిరెడ్డిగారు | ఉండవెల్లి |
| ,, | చల్లా లక్ష్మిరెడ్డిగారు | ,, |
| ,, | దుంపలి గట్టారెడ్డిగారు | ,, |

# సహాయకులు

| | | |
|---|---|---|
| ,, | గొందిమళ్ళ వీరయ్యశెట్టిగారు | అలంపూరు |
| ,, | గ॥ రామేశ్వరరావుగారు | ,, |
| ,, | సి॥ నాగిరెడ్డిగారు | చెన్నిపాడు |
| ,, | ఆ॥ పుల్లయ్య శెట్టిగారు | ,, |
| ,, | బు॥ నాగిరెడ్డిగారు | ,, |
| ,, | గుంతా సుబ్బయ్యగారు | ,, |
| ,, | టి. సోమిరెడ్డిగారు | ,, |
| ,, | కిరోడ్డిం నారాయణరెడ్డిగారు | ,, |
| ,, | రేకింతల శేషయ్యగారు | చిన్న పోతలపాడు |
| ,, | ములుకూరు బసప్పగారు | గద్వాల |
| ,, | మా॥ ప॥ తిమ్మారెడ్డిగారు | ,, |
| ,, | మహానందీశ్వర ఆయిల్ మిల్సు | ,, |
| ,, | టి. నాగప్పగారు వకీలు | ,, |
| ,, | లక్ష్మీ కేశవరెడ్డి అండ్ బ్రదర్సు | ,, |
| ,, | బాణాల వెంగన్న శ్రేష్ఠిగారు | ,, |
| ,, | బి. సుబ్బారావు అండుకో | ,, |
| ,, | బాణాల నాగయ్య శ్రేష్ఠిగారు | ,, |
| ,, | వి. చోళప్పగారు | ,, |
| ,, | డి. అన్నపూర్ణా దేవిగారు | హైదరాబాదు |
| ,, | కె॥ కృష్ణారెడ్డిగారు | ఉప్పలపాడు |
| ,, | కరణం శ్రీనివాసరావుగారు | కూడవెల్లి |
| ,, | పో॥ ప॥ లింగారెడ్డిగారు | ,, |
| ,, | కె. జి. లక్ష్మిరెడ్డిగారు | తాండ్రపాడు |
| ,, | న॥ పుల్లయ్యశెట్టిగారు | లంగనవాయి |
| ,, | యం॥ నరసింహులుగారు | ,, |
| ,, | గాండ్ల రామయ్యగారు | బైరాపురం |
| ,, | అ॥ రామిరెడ్డిగారు | తక్కసిల |
| ,, | బి॥ దేవీసింగుగారు | ,, |
| ,, | జి. తిప్పారెడ్డిగారు | ,, |
| ,, | యే॥ కొండారెడ్డిగారు | పెద్దపోతలపాడు |
| ,, | యే॥ శేఖరరెడ్డిగారు | ,, |
| ,, | కృష్ణారెడ్డిగారు | బసవాపురం |
| ,, | బి॥ శరభయ్యగారు | ,, |
| ,, | చిన్న వెంకటయ్యగారు | ,, |

| | | |
|---|---|---|
| ,, | కృష్ణ రంగస్వామిగారు | బసవాపురం |
| ,, | కె॥ రంగారెడ్డిగారు | ,, |
| ,, | జి. వీరయ్యగారు | ,, |
| ,, | గా॥ లక్ష్మన్నగారు | ,, |
| ,, | ఈదన్నగారు | ,, |
| ,, | త॥ పెద్ద శేషన్నగారు | ,, |
| ,, | త॥ చిన్న శేషన్నగారు | ,, |
| ,, | గా॥ అల్బూరయ్యగారు | ,, |
| ,, | సు॥ రాఘవరెడ్డిగారు | ఇటికాలపాడు |
| ,, | మున్నూరుకాపు పరిశోధకమండలి | హైదరాబాదు |
| ,, | క॥ రామసుబ్బారావుగారు | ఉండవెల్లి |
| ,, | డా॥ నారాయణస్వామిగారు | ,, |
| ,, | న॥ పెద్ద వెంగన్న శ్రేష్ఠిగారు | ,, |
| ,, | సంకి. బాలిరెడ్డిగారు | ,, |
| ,, | డా॥ లక్ష్మయ్యగారు | ,, |



పటము ౨

# తెలంగాణ శిల్పములు



పానుగల్లు ఆలయ స్తంభములు

# ఖర నామ సంవత్సరము — శ్రావణము ఆగష్టు సెప్టెంబరు 1951

| | శుక్లపక్షము | | | కృష్ణపక్షము | | |
|---|---|---|---|---|---|---|
| ఆది | | ౩ 5 | ౧౦ 12 | | ౩ 19 | ౯ 26 |
| సోమ | | ౩-౪ 6 | ౧౧ 13 | | ౪ 20 | ౧౦ 27 |
| మంగళ | ● | ౫ 7 | ౧౨ 14 | ● | ౫ 21 | ౧౧ 28 |
| బుధ | | ౬ 8 | ౧౩ 15 | | ౬ 22 | ౧౨ 29 |
| గురు | | ౭ 9 | ౧౪ 16 | | ౭ 23 | ౧౩ 30 |
| శుక్ర | ౧ 3 ఆగష్టు | ౮ 10 | పూర్ణిమ 17 | ★ | ౮ 24 | ౧౪ 31 |
| శని | ౨ 4 | ౯ 11 | ★ | ౧-౨ 18 | ౯ 25 | ● అమావాస్య సెప్టెంబరు 1 |

పర్వములు
శ్రా శు ౧౫
శ్రా బ ౮ కృష్ణాష్టమి

ప్రభుత్వ సెలవులు
ఆగష్టు 15 స్వాతంత్ర్యదినము
ఆగష్టు 17 రాఖీపూర్ణిమ
ఆగష్టు 24 కృష్ణాష్టమి

బ్యాంకు సెలవులు
ఆగష్టు 15 తేది
17 ,,
24 ,,

★

Edited and Published by Gadiyaram Ramakrishna Sarma, Ramakote, Sultan Bazar,
Printed at Padmashali Printing Press Rajmohalla, Hyderabad-Dn.

# తెలంగాణము


## శ్రీ ఆదిరాజు వీరభద్రరావు




ఆసఫ్‌జాహీ రాజన్యులు పరిపాలనా సౌకర్యము కొరకు గోలకొండసీమను భాషామూలకముగ మూడు విభాగములుగ జేసిరి. తెలుగువారుండు ప్రాంతము తెలంగాణము. మహారాష్ట్రులుండు ప్రాంతము మరాట్వాడా. కన్నడులుండు ప్రాంతము కర్ణాటకము. ఈ మూడు ప్రాంతములలోను తెలంగాణము కడమ రెండింటిలోకన్న గొప్పది. మనకు సంబంధించినది కావున తెలంగాణమునుగూర్చి యీ వ్యాసమునందు ముచ్చటించెదను.

తెలంగాణపు ప్రాంతములో వరంగల్ సుబా, మెదకుసుబా అను రెండు సుబాలుగలవు. వరంగల్ సుబాయందు 1 వరంగల్, * 2 కరీంనగరు, 3 ఆదిలాబాదు, 4 నిజామాబాదు అను జిల్లాలుగలవు. మెదకు సుబాయందు 1 మెదకు, 2 హైద్రాబాదు, 3 మహబూబునగరు, 4 నల్లగొండ అను జిల్లాలుగలవు. రాజధానియగు హైద్రాబాదునగరము సుబాలలో చేరని ఒక జిల్లాగా భావించవలెను. ఈ విధముగా మొత్తము ఖమ్మముమెట్టుతోసహా 10 జిల్లాలగును. ఈ పదిజిల్లాలు పక్కా తెలుగుసీమ. ఇదిగాక రాయచూరుజిల్లాలోని అలంపూరుతాలూకా, గద్వాలతాలూకా, ఆంధ్ర ప్రాంతములే. గుల్బర్గాజిల్లాలోని తూర్పుప్రాంతము ఆంధ్రప్రాంతమే. ముఖ్యముగా కొడంగల్, గుర్మిటుకాల్ అను తాలూకాప్రదేశాలు తెలుగువారి నివాస భూమి. మెదకునానుకొని పశ్చిమముననున్న బిదరు జల్లాలోను, నిజామాబాదు నానుకొని పశ్చిమముననున్న నాందేడుజిల్లాలోను కొలదిగా తెలుగుప్రాంతములు గలవు. ఇట్లు తెలంగాణేతర భాగములలో ఒకజిల్లాకు సరిపోవు ప్రాంతముకలదు. ఈ లెఖ్ఖప్రకారము హైదరాబాదు రాష్ట్రములో 11 జిల్లాలు తెలుగుప్రాంతముగా నున్నట్లు తేలగలదు. సర్కారు వారి లెక్కలప్రకారము రాష్ట్రములో 16 జిల్లాలున్నట్లుగలదు. హైదరాబాదునగరము ప్రత్యేక వ్యవస్థ కలిగియున్నను హైదరాబాదుజిల్లాలో చేర్చియుండుటచేతను, ఖమ్మముమెట్టు జిల్లావిషయము ముద్రితమయినరికార్డులలో చేరనందునను, ఈ రెండును గణనకు రాలేదు. వాటికి ప్రత్యేకత్వము లభించినప్పుడు 18 జిల్లాలగును. అప్పుడు రాయచూరు, గుల్బర్గా, బిదరు, ఉస్మానాబాదు, బీడు, అవురంగాబాదు, పర్భిణి, నాందేడుఅను ఎనిమిదిజిల్లాలు ఆంధ్రేతర ప్రాంతములుగా రాష్ట్రములో నుండగలవు.

తెలంగాణా ప్రాంతముయొక్క వైశాల్యము, జనసంఖ్య ఈక్రింద నీయబడుచున్నది. (1951 జనాభా లెక్కలప్రకారము ):—

| జిల్లాలు. | వైశాల్యము చ. మై. | జనసంఖ్య |
|---|---|---|
| 1. హైద్రాబాదు నగరము | 79 | 10,[illegible]5,074 |
| 2. హైదరాబాదు జిల్లా | 2287 | 4,25,478 |
| 3. వరంగల్లు (ఖమ్మంసహా) | 7944 | 15,81,292 |
| 4. కరీంనగరము | 5722 | 15,81,319 |
| 5. నల్లగొండ | 6049 | 15,44,301 |
| 6. మహబూబు నగరము | 5326 | 11,[illegible]5,539 |
| 7. మెదకు | 3198 | 10,27,648 |
| 8. నిజామాబాదు | 3265 | 7,73,077 |
| 9. ఆదిలాబాదు | 7294 | 9,02,469 |
| 10. రాయచూరు | 1687 | 2,87,900 |
| 11. గుల్బర్గా | 1744 | 2,89,600 |

రాయచూరు జిల్లాలో నాల్గవభాగము, గుల్బర్గా జిల్లాలో అయిదవభాగము, ఆంధ్ర ప్రాంతమని సర్కారు లెక్కలలో నున్నందున ఆ రెండుజిల్లాలకు ఇచ్చట ఆ ప్రకారము లెక్కకట్టి అంకెలు ఈయబడినవి. సరియైన యంకెలు ఇవియేయని భావించకూడదు.

---

* ఇటీవల వరంగల్ జిల్లాను రెండు భాగములు చేసినారు. రెండవభాగమునకు ఖమ్మముమెట్టు ముఖ్యపట్టణముగా నున్నది. ఈ వ్యాసమునందు వరంగల్ జిల్లా అనగా వరంగల్, ఖమ్మముమెట్టు జిల్లాలని గ్రహించవలెను.

హైదరాబాదు నగరములో 4 తాలూకాలు, హైదరాబాదు జిల్లాలో 5, వరంగల్ జిలాలో 9, కరీంనగరము జిల్లాలో ౭, నల్లగొండ జిల్లాలో 8, మహబూబునగరు జిల్లాలో 10, మెదకు జిల్లాలో 7, నిజామాబాదు జిల్లాలో 6, ఆదిలాబాదుజిల్లాలో 11, రాయచూరు జిల్లాలో 2, గుల్బర్గా జిల్లాలో 2, మొత్తం 72 తాలూకాలు తెలంగాణ సీమలో గలవు.

హైదరాబాదు నగరములో 4 తాలూకాలు

1. హైద్రాబాదు 2. సికింద్రాబాదు 3. బొలారం 4. తిరుమలగిరి

(౧) హైద్రాబాదు జిల్లాలో 5 తాలూకా లున్నవి.

1. హైద్రాబాదు ( పడమట )
2. ,, ( తూర్పు )
3. షాబాద
4. మేడిచల్
5. ఇబ్రహీం పట్నం

(౨) మహబూబ్ నగరం జిల్లా 10 తాలూకాలు

1. మహబూబ్ నగరం
2. వనపర్తి
3. ఆత్మకూరు
4. మఖ్తల్
5. పరిగి
6. షాద్ నగర్
7. కల్వకుర్తి
౭. అచ్చంపేట
9. నాగర కర్నూలు
10. కొల్లాపురం

(3) ఆదిలాబాదు జిల్లా 11 తాలూకాలు

1. ఆదిలాబాదు
2. ఉట్నూరు
3. ఖానాపూరు
4. నిర్మల
5. బోదు
6. కిన్వట్
7. రాజూరా
8. సిరిపూరు
9. చిన్నూరు
10. లక్సెట్టిపేట
11. ఆసిఫాబాదు

(౪) నిజామాబాదు జిల్లా 6 తాలూకాలు

1. నిజామాబాదు
2. కామారెడ్డి
3. బాన్సువాడా
4. బోధన
5. ఆరుమూరు
6. యల్లారెడ్డి

(౫) మెదక్ జిలా 7తాలూకాలు

1. సంగారెడ్డి
2. వికారాబాదు
3. ఆందోలు
4. మెదక్
5. సిద్దిపేట
6. గజవేలు
7. నరసాపురము

(౬) కరీం నగరం 8 తాలూకాలు

1. కరీంనగరం
2. సిరిసిల్ల
3. మెట్టుపల్లి
4. జగత్యాల
5. సుల్తానాబాదు
6. మహదేవ పురం ( మంథని )
7. పరకాల
8. హుజూరాబాదు

(౭) వరంగలు జిల్లా 9 తాలూకాలు

1. వరంగల్లు
2. పాకాల
3. ములుగు
4. బూర్గంపాడు
5. పాలవంచ
6. మధిర
7. ఇల్లందు
8. ఖమ్మంమెట్టు
9. మానుకోట ( మహబూబాబాద్ )

(౮) నల్లగొండ జిల్లా 8 తాలూకాలు

1. నల్లగొండ
2. మిరియాలగూడెం
3. దేవరకొండ
4. రామన్నపేట
5. భువనగిరి
6. జనగామ
7. సూర్యాపేట
8. హుజూరు నగరం

(౯) రాయచూరు జిల్లాలో 2 తాలూకాలు

1. గద్వాల
2. అలంపూరు

(౧౦) గుల్బర్గా జిల్లాలో 2 తాలూకాలు

1. కొడంగల్లు
2. తాండూరు.

రాష్ట్ర వైశాల్యము 83,698 చదరపు మైళ్లు. ఇందు దాదాపుగా 45, 374 చదరపు మైళ్లు ఆంధ్ర ప్రాంతము. రాష్ట్ర జనసంఖ్య 1951 జనాభా ప్రకారము 1,86,65,253. ఇందు 1,01,06,197 జనులు తెలంగాణా జిల్లాలలో నున్నారు. ఆంధ్రేతర ప్రాంతములలోని సరియైన అంకెలు దొరకలేదు. కాబట్టి ఇందు చేర్చలేదు. అయినను 100 కి 54 మంది చొప్పున ఆంధ్రులున్నారని చెప్పవచ్చును. తెలంగాణ సీమలోని జనులలో 51,26,593 పురుషులును, 49,79,604 స్త్రీలును ఉన్నారు. ఒక్క నిజామాబాదు జిల్లాలో మాత్రము పురుషుల సంఖ్యకంటె స్త్రీల సంఖ్య ఎక్కువ. అచ్చట 1000 మంది పురుషులకు 1014 స్త్రీల చొప్పుననున్నారు. 1941 జనాభా కంటె ఈ దశాబ్దములో 100 కి 17 గురు చొప్పున తెలంగాణములో జనసంఖ్య పెరిగినది. రాష్ట్రపు మొత్తమున 100 కి 14.24 చొప్పున జనసంఖ్య పెరిగినది.

తెలంగాణములో 63 పురములు ( Towns ) 10,375 గ్రామములు కలవు. నగర ( city ) నామ గౌరవమును పొందినవి రాష్ట్రములో రెండే గలవు. ఈ రెండును తెలంగాణము నందే కలవు. 1. హైద్రాబాదు నగరము, 2. వరంగల్ నగరము. ఈ నగరములందు జనసంఖ్య లక్షకుమించి ఈ క్రింది విధముగా నున్నవి :—( 1951 )

| | |
|---|---|
| 1. హైద్రాబాదు కార్పరేషను. | 8,02,464 |
| 2. హైద్రాబాదు కంటోన్మెంటు. | 57,483 |
| 3. సికింద్రాబాదు కార్పరేషన్. | 161,405 |
| 4. సికింద్రాబాదు కంటోన్మెంటు. | 63,722 |
| | 10,85,074 |

2 వరంగల్ నగరము— 1,30,080

రాష్ట్ర రాజధానియగు హైదరాబాదు నగరము తెలంగాణము మధ్యనేయున్నది. రాష్ట్రములోనే గాక విశాలాంధ్ర దేశమునందును ఇంత గొప్పనగరము మరియొకటిలేదు. ఇది ఆంధ్ర నగరముగనే యుండునా లేక హిందీనగరముగ మారునాయని ఆంధ్రులు సంశయాందోళనములను చెందుటకు ప్రస్తుతపు రాజకీయ పరిస్థితులు, రాజనీతి అవకాశము లిచ్చుచున్నవి. వరంగల్ నగరము రాష్ట్రములో హైదరాబాదు తరువాత ద్వితీయనగరముగా అభివృద్ధి చెందుచున్నది. రాష్ట్రములో లక్ష జనసంఖ్యకు తక్కువగానున్న 6 పురములలో (Towns) నిజామాబాదు పురము అయిదవ స్థానము ఆక్రమించి 55,202 జనసంఖ్య కలిగియున్నది. వరంగల్, కరీంనగరు, నల్గొండజిల్లాలు జనసంఖ్యయందు పోటీపడుచున్నవి. రాష్ట్రములోని యేయితర జిల్లాయందును 15 లక్షలకు మించిన జనసంఖ్యలేదు. కరీంనగరుజిల్లా జనసంఖ్యయందు రాష్ట్రములో ప్రథమస్థానము వహించియున్నది.

తెలంగాణభూమిలో చాలలోతున అగ్నితత్వము గల రాళ్లున్నవి. వాటియందలి అగ్నితత్వము క్రమక్రమముగా చల్లారును. అంతవిపదో భూచలనమున పైకివచ్చును. ఇట్టిరాళ్లు ( Granite ) తెలంగాణము నందంతటను గలవు. ఇవి ముఖ్యముగా నిజామాబాదు, మెదకు, నల్లగొండ, మహబూబునగరు, కరీంనగరు, వరంగల్ జిల్లాలలో మిక్కుటము. ఆదిలాబాదు జిల్లాలో తూర్పుదిశయందును ఈరాళ్ళు కనబడును.

సహ్యాద్రి పర్వతభాగములు, నిర్మల పర్వతశ్రేణి, కందికల్లు గుట్టలవరుస, రాఖీ గుట్టలవరుస ఆదిలాబాదు జిల్లాలో నున్నవి. కందికల్లుగుట్టలు వరంగల్లు వరకు వ్యాపించును (50 మైళ్లు). కందికల్లు గుట్టలకు సిర్నపల్లి గుట్టలనియు పేరుగలదు. రాఖీగుట్టలు కరీంనగరు వరకును వ్యాపించును. దక్షిణ బాలాఘాటు గుట్టలవరుస హైదరాబాదు, మహబూబునగరు, నల్లగొండ జిల్లాలవరకును వ్యాపించును. ఈ వరుస నే

తూర్పుభాగమునకు అనంతగిరి గుట్టలనియు, పశ్చిమ భాగమునకు రాచకొండ గుట్టలనియు అందురు. ఇవి గోదావరి, కృష్ణానదుల జలప్రవాహ మార్గములుగా నున్నవి.

తెలంగాణము దక్షిణ పీఠభూమిలో నెలకొని యున్నది. నేలమట్టము తూర్పునుండి పశ్చిమమునకు ఎత్తగుచుండును. ఈ ప్రాంతపు గుట్టలలో చెట్లుచేమ లుండవు. కాని సమప్రదేశములందు పెక్కువిధము లయిన చెట్లుచేమలుండును. గోపురాకారపు గుట్టలు, విడ్డూరపు శిలాఖండములు, పెక్కుచోట్ల కనబడుచుండును. భూతత్త్వ పరిణామమునుబట్టి ఇచ్చటినేల యిసుకమయము. అందుచే తడి నిలువదు. కావున ఎండకాలములో నదు లెండిపోవుచుండును. ఈ కారణమున జలాశయములను నిర్మించుట విధిగా నవసరమయ్యెను. తెలంగాణము నందున్నన్ని చెఱువులు ఇతరప్రాంతములందు లేవు. భూమివంపు ఆగ్నేయ దిశగానుండుటచే నీటిపారుదల యటువైపేయున్నది.

కృష్ణ, గోదావరి అను మహానదులు రెండును తెలంగాణమునకు కుడి, యెడమ భుజములుగానున్నవి. తుంగభద్ర, మంజీర, మానేరు, కొంత ప్రసిద్ధిచెందిన నదులు. మూసి, దండి, మునేరు, కిన్నెరసాని మొదలగునవి చిన్ననదులు.

గోదావరినది ఔరంగాబాదు, పర్భిణి, నాందేడు అను మహారాష్ట్ర జిల్లాలనువీడి, నిజామాబాదు, ఆదిలాబాదు జిల్లాలను తడుపుచువచ్చి కరీంనగరు (ఎల్గందల్) జిల్లా యీశాన్యమున తన ప్రవాహమార్గమును మగిల్చి, ఆగ్నేయదిశగా 170 మైళ్ళునడచి వరంగల్ జిల్లాకు సరిహద్దుగా నేర్పడుచు, వరంగల్ జిల్లాలోని పగంతపల్లివద్ద మద్రాసు రాజధానిలోని గోదావరిజిల్లాలో ప్రవేశించును. దీని యుపనదియగు మంజీర మెదకు, నిజామాబాదు జిల్లాలగుండ ప్రవహించి గోదావరిలో సంగమించును.

కృష్ణానది మహబూబునగరు, నల్లగొండ, వరంగల్ జిల్లాలకును, ఈ రాష్ట్రమునకును దక్షిణ సరిహద్దుగా ప్రవహించుచుండెను. దీని ప్రఖ్యాత యుపనది తుంగభద్రానది. పెనుగంగానది ఆదిలాబాదుకు ఉత్తర సరిహద్దుగానుండి బరారు దక్షిణ ప్రాంతమును వేరు చేయును. ఇది రాజూరాతాలూకా ఉత్తరభాగమున వార్ధానదిలో పడును.

తెలంగాణములో ప్రకృతిసిద్ధములైన తటాకములు లేవు. మానవ నిర్మితములయిన గొప్ప తటాకములు మెండుగాగలవు. ఇవన్నియు లోయలగుండ ప్రవహించునదుల కానకట్టలుకట్టి ప్రవాహమును బంధించి వానకాలములో నీరు నిలువచేసిన జలాశయములు. ఈ నీటిని వ్యవసాయమున కుపయోగించుదురు. తెలంగాణములో ఇట్టి జలాశయములు వేలకొలది కలవు. పురాతన జలాశయములలో పేరెన్నికగన్నది పాఖాలచెఱువు. ఇది వరంగల్ జిల్లా నరసంపేట తాలూకాలో నున్నది. దీని కట్టపొడవు 2000 గజములు. ఇది పాఖాల నదీప్రవాహమును నిలుపును. దీనివైశాల్యము 13 చదరపు మైళ్ళు, దీనిపొడవు 8000 గజములు, వెడల్పు 6000 గజములు.

ఇచ్చటి భూతత్త్వము బ్రహ్మాండాకారపు శిలామయము. ఇది ముఖ్యముగా హైదరాబాదు చుట్టును విజృంభించి, తూర్పుగా ఖమ్మముమెట్టును దాటి, ఈ రాజ్యపు తూర్పుకొనవరకును వ్యాపించి యున్నది. ఇచ్చట భూతత్త్వముమారి అభ్రకము, సున్నపురాలు, వివిధవర్ణపు రేకులరాళ్ళు, సూదంటురాయి పొరలు మొదలగు శిలారూపములు తేల్చును. కృష్ణానదికి ఉత్తరభాగము "కడపరాళ్ళు" అను శిలాతలము. "కడపరాళ్లను పోలెడు కర్నూలురాళ్ళు" కూడకలవు. ఈ రాళ్ళనుబట్టియే దక్షిణభారతములో ఈభూభాగము వజ్రలగుణ తత్త్వముగల యిసుకరేణువుల ప్రదేశముగా ప్రసిద్ధికెక్కినది. "కర్నూలురాళ్ళ" గనుల యంతర్భాగముననే రత్నాలు గలవు. ఈ కడప, కర్నూలు శిలాతత్త్వ ప్రాంతము జగ్గయ్యపేటకడ నంత మొందును. కడప శిలాతత్త్వము గోదావరీనది నైఋతి తీరము పొడుగునను పోవును. ముఖ్యప్రాంతముతోగల దీని పూర్వసంబంధము భూగర్భమునందలి పొరలను బట్టి మనము గ్రహింపవచ్చును. వీటిలో గొప్పగని ఖమ్మముమెట్టునకు తూర్పుదిశ యందున్నది.

ఖనిజసంపత్తిలో తెలంగాణము ముఖ్యస్థానమునే యాక్రమించును. వరంగల్ జిల్లా విశాలములగు నేల బొగ్గుగనులకు విఖ్యాతిచెందియున్నది. 1872లో డాక్టరు కింగ్ అనునాతడు సింగరేణిలోని నేలబొగ్గురంగమును కనిపెట్టెను. 1886 లో ఈ గనిని త్రవ్వుట ప్రారంభమయ్యెను. నేలబొగ్గుగనులలో లాభసాటిగానున్న గని [illegible]. సింగరేణిక్షేత్రములో నాలుగంతరములు కనబడి [illegible]. మొదటిది 30 నుండి 50 అడుగుల లోతున నుండును. రెండవది మొదటిదానికి సుమారు 100అడుగుల క్రిందనుండును. మూడవది రెండవదానికి సుమారు 30, 40 అడుగుల క్రిందనుండును. నాల్గవది

మూడవఅంతరము క్రిందనున్నది. ఈ నాల్గు అంతరములలో బొగ్గుగుణము వేర్వేరుగా నుండును. నాల్గవ అంతరము నందుండునది అన్నింటిలోనికి శ్రేష్ఠమయినదని తెలియుచున్నది. ఈ శ్రేష్ఠమైన బొగ్గునకు 'కింగ్' అని దానిని కనిపెట్టిన డాక్టరుకింగుపేరు పెట్టినారు. దీనివైశాల్యము 9 చదరపుమైళ్లు. ఈ నాల్గవగనిలో 4,75,00,000 టన్నుల బొగ్గుకలదని లెక్కవేయ బడినది. ఈ బొగ్గుగనులు గోదావరి, ప్రాణహితనదుల మాగాణములవరకు వ్యాపించియున్నవి. ఇప్పుడు సింగరేణి, కొత్తగూడెము, తాండూరు, శాస్త్రి, పమోని (ఆసిఫాబాదు) గనులలో ఖననకార్యము జరుగుచున్నట్లు తెలియుచున్నది. చెన్నూరు, ఆలపల్లి, శివేశ్వరం, మాధవరం, సారంగపల్లి, పాలవంచ, ఉత్తర గోదావరి ఆలోచనలోనున్న బొగ్గుగనుల స్థావరములు.

ఇనుముగనులు పలు ప్రదేశములందు వివిధశిలములు గలవి పెక్కుగలవు. గోదావరి లోయలోను, కృష్ణా తుంగభద్రానదుల మధ్యప్రదేశమందును ఎక్కువ ప్రమాణములో దొరకును. ఆదిలాబాదుజిల్లా చెన్నూరు తాలూకాలో మట్టితో మిశ్రితమైన ఇనుము శుద్ధ చేయుట సాగుచున్నది. జగిత్యాల, నిర్మల, వరంగల్, యెలగర్తి మొదలగుప్రదేశములు ఉక్కుపరికరాల నిర్మాణములో ప్రసిద్ధికెక్కినవి. ఈ పరికరాలు దూరప్రాంతములకును ఎగుమతియగుచుండును.

కృష్ణానది సమీపమందలి పరిటేలలో వజ్రాల గనులపని పురాతనకాలమునుండియే సాగుచుండెను. ఏటివరదకు తావలములయిన నందుభూమిలో వజ్రాలగను లుండుటగలదు అందుచే పరిటేలలోనేగాక అట్టి భూసారముగల కృష్ణాతీర ప్రదేశములగు నితరచోట్లయందును వజ్రాలగనులు గలవు. నల్లగొండ, మహబూబునగరుజిల్లాలు అట్టిప్రాంతములే. పరిటేలలో చేసినప్రయత్నము అంత లాభకరముగా కనుపించనందున విరమింపబడినది.

ఇతర ఖనిజములలో ఖమ్మముమెట్టు ప్రాంతమున అభ్రకము, పాలవంచలో కురువెంద, కెంపువంటి ఎఱ్ఱరాయి, హసనాబాదులో నల్లసీసము, నల్లగొండజిల్లా చిత్రాలలో రాగిగని ముఖ్యముగా పేర్కొనదగినవి.

రాష్ట్రములో ముఖ్యమయిన అరణ్యప్రాంతములు తెలంగాణములోనే యున్నవి. రాష్ట్రములో మొత్తము 60, 2,864 ఎకరములు అరణ్యప్రాంతము కలదు. అందు 53,82,976 ఎకరములు తెలంగాణములోనీ క్రిందివిధముగా నున్నవి.

1. వరంగల్ డివిజన్- 13,74,845 ఎకరములు.
2. కరీంనగరు ,, 6,18,563 ,,
3. నిజామాబాదు ,, 2,15,638 ,,
4. ఆదిలాబాదు ,, 20,78,561 ,,
5. మెదకు ,, 2,11,399 ,,
6. నల్లగొండ ,, 2,68,939 ,,
7. మహబూబునగరు,, 6,15,031 ,,

మొత్తము. 53,82,976 ఎకరములు.

అస్పృశ్యము (Reserved) రక్షితము (Protected), పేరులేని (Unclassed) అని యరణ్యములు మూడువిధములుగా విభజింపబడినవి. ఈ యరణ్యములనుండే కలప, వంటచెఱకు, వెదురు, గడ్డి, పుల్లరి, ఆకులు, బెరడులు, మొదలగువానివల్లను, ఇతరఫలసాయములవల్లను సర్కారుకు సాలీనా రాష్ట్రాదాయము 14,01,230 రూపాయలుండగా తెలంగాణములోనే రు 12,02,426 లు లభించుచున్నవి. (1940). ఆదిలాబాదు అత్యంత సాంద్రారణ్యము. దాని తరువాత పేర్కొనదగినవి వరంగల్, మహబూబునగరు అరణ్యములు. ఈ అరణ్యములలో వెదురు గుజ్జునుండియే కాగితము తయారు చేయబడుచున్నది. బొమ్మలు మొదలగు చేతిపనులకవసరములగు ముడిపదార్థములు అరణ్యములనుండియే లభించుచున్నవి. టేకు, చందనం, భండారు, ఇప్ప, చిన్నంగి, కొడిశ, నల్లమద్ది, వెదురు, దేవదారు, తుమికి, చండ్ర, తుమ్మ, మామిడి, చింత, తంగేడు మొదలగు వృక్షజాతులు కలవు.

పెద్దపులులు, చిఱుతపులులు అన్నిచోట్లను గలవు. కారెనుము, అప్పుడప్పుడు ఏనుగులు పాఖాల అడవులలో కనబడుట కలదు. పీఠభూమి ప్రదేశములో మచ్చజింకలు. నీలగై, సాంబరు చతుశ్శృంగములగు దుప్పులు, అడవిపందులు, సివంగులు, తోడేళ్ళు, ఎలుగుబంట్లు, కుందేళ్లు, నక్కలు- ఇవి కొల్లలుగా నున్నవి. వివిధములయిన పక్షిజాతులు కలవు. మృగపక్షి సముదాయ కలిమియందు ఒక్క మైసూరుప్రాంతమును విడిచినచో ఇండియాలో తెలంగాణమునే పేర్కొనవలయును. ఎచ్చటనుఇన్ని తీరులమృగపక్షులు కనబడవు.

పురాతత్వ పరిశోధకులను, చరిత్రకారులను, ఆకర్షించు పెక్కు ప్రదేశములు తెలంగాణములోనున్నవి. ప్రతి మండలము నందును చిన్నవి, పెద్దవి పెక్కు

కోటలున్నవి. వరంగల్, భోనగిరి, గోలకొండ, పానుగల్లు, వేల్పుగొండ, రాచకొండ, ఖమ్మముమెట్టు, మెదకు, ఎల్గందల, మలంగూరు, బజాగూరు, జగత్యాల, మహదేవపురం, రామగిరి కోటలు సుప్రసిద్ధములయినవి.

వివిధమతములకు చెందిన పూజామందిరములు తెలంగాణములో 1931 జనాభా లెక్కలప్రకారము 10,061 కలవు. యాత్రాస్థలములు 839 కలవు. వరంగల్ జిల్లాలో ఐయినవోలు, కొరివి, భద్రాచలం- కరీంనగరు జిల్లాలో ధర్మపురి, వేములవాడ- ఆదిలాబాదుజిల్లాలో బాసరపూరు- మెదకుజిల్లాలో అనంతగిరిగుట్ట, గంగాపురం, శిరసనగండ్ల, ఆమాపూరు- నల్లగొండజిల్లాలో పానుగల్లు, నాదపల్లి, జీడికల్లు జాతరులు మహా ఘనమయినవి. పురాతన దేవాలయములలో హనుమకొండలోని వేయి స్తంభాలగుడి, పాలంపేటలోని రామప్ప గుడి, పానుగల్లులోని ఛాయా సోమేశ్వరాలయము మొదలగునవి శిల్పచాతుర్యమునకు ప్రసిద్ధిచెందినవి. ఛాయా సోమేశ్వరాలయము నందలి లింగముపయి దీర్ఘముగు నల్లని నీడయొకటి పగలంతయు నొకేచోట కదలక కానవచ్చుచుండును. ఈ నీడ సూర్యోదయమునుండి సూర్యాస్తమయము వరకు ఎంతమాత్రము చలింపక యొకేచోటనే గానుపించుట వింతయైన విషయము గదా ! చిత్రాతిచిత్రమయిన యీ ఛాయా రహస్యమును తెలిసికొనజాలక యున్నారు. ఆదియా మహాశిల్పికే మాత్రమే తెలియును. తెలంగాణములో పూర్వకాలమున కాకతీయ శిల్పమను పేరితో ప్రత్యేక శిల్పకళ ప్రారంభమయి ప్రచారములోనికి వచ్చినది.

1941 లెక్కల ప్రకారము హైదరాబాదు నగరములో చదరపు మైలుకు 9356 మంది జనులు నివసించుచున్నారు. జనసమ్మర్దము నందు మెదకు జిల్లా అగ్రస్థానము వహించియున్నది. ఈ జిల్లాలో చదరపు మైలుకు 24[illegible] చొప్పున జనులు నివసించుచున్నారు. అన్ని జిల్లాలకంటె తక్కువ జనసమ్మర్దము కలది ఆదిలాబాదు జిల్లా. ఈ జిల్లాలో 113 మంది మాత్రమే గలరు.

తెలంగాణము నందు 16,478 చదరపు మైళ్ల భూభాగము వ్యవసాయమున కుపయోగింపబడుచున్నది. నల్లగొండ జిల్లాలో ఎక్కువ భూమి సాగు అగుచున్నది. ( 3176 చ. మై. ) తరువాత వరంగల్, ఆదిలాబాదు, కరీంనగరు, మహబూబునగరు, హైద్రాబాదు, నిజామాబాదు, మెదకు, ( 1057 చ. మై. ) జిలాలు వ్యవసాయభూమి విస్తీర్ణము నందు పూర్వాపూర్వములు, ఘనములు. వ్యవసాయ ప్రాంత భూనివాసులు మెదకు జిల్లాలో చదరపుమైలుకు 717 చొప్పున నున్నారు. తరువాత నిజామాబాదు, కరీంనగరు, వరంగల్, హైద్రాబాదు, మహబూబునగరు, నల్లగొండ, ఆదిలాబాదు ( 335 ) జిల్లాలు పూర్వాపూర్వములు, ఘనసంఖ్య గలవి.

హైద్రాబాదు జిల్లాలో ఉస్మాన్ సాగరు, హిమాయతు సాగరు, హుస్సేన్ సాగరు, మీరాలం చెరువు, ఇబ్రహీం కత్వా— వరంగల్ జిల్లాలో పాఖాల, రామప్ప, లక్నారం, నాగారము, సింగభూపాలం, పాలేరు, వైరా— కరీంనగరు జిల్లాలో మంథనకాలువ, శనిగారం, మానేరు— ఆదిలాబాదు జిల్లాలో లక్ష్మణచందా, పెనుగంగ, కద్దల, సోన్, సకత్— నిజామాబాదు జిల్లాలో నిజాం సాగరు, అలీసాగరు, మంచప్పా— మెదకుజిల్లాలో మహబూబు నహరు, ఫతేనహరు, పోచారం, రాయనపల్లి, గంగాకత్వా— మహబూబునగరు జిల్లాలో బండారుపల్లివాగు, డిండి— నల్లగొండజిల్లాలో పెండిపాకల, ఆసఫ్‌నహరు, అలగడప, రాయన పాలెం, శానిగారారం, ఘ్రాటుకూరు, మగపల్లి, వేములకొండ, పర్వతరావు చెఱువు, హైతి, సామలచెఱువు, దిగువ కృష్ణ మొదలగు జలాశయములు సుప్రసిద్ధి చెందినవి.

తెలంగాణములో 5119 పెద్దచెరువులు, 14746 చిన్న చెరువులు, 82,200 బావులు, 628మైళ్ళ కాలువలు గలవు. అనగా రాష్ట్రములోని చెరువులలో 91%, కాలువల మైళ్ళలో 74%, బావులలో 49% ఇతర నీటి వనరులలో 84% దరిదాపుగా తెలంగాణములో నున్నవి. (1940 లెక్కలప్రకారము). నూలుబట్టల నేత అన్ని ప్రాంతములందును విరివిగా సాగుచున్నది. ధోవతులు, చీరలు, ముతకగుడ్డలు, రుమాళ్ళు, చేతిమీద తయారగుచుండును. నల్లగొండ, మహబూబునగరు, నిజామాబాదు, కరీంనగరు, జిల్లాలలో తయారగు పట్టువస్త్రములు గట్టివి, అందమైనవి. వరంగల్ మటెవాడ, హసన్‌పర్తి, నారాయణపేట, కోసిగి-ఇవి టస్సరు పట్టుగుడ్డలకు ప్రసిద్ధి. టస్సరు పట్టుపురుగులు పాఖాలచెరువు ప్రాంతపు టరణ్యములలో మెండుగానున్నవి. అయితే శ్రేష్ఠమయిన టస్సరుపట్టు నారాయణపేటలో, మహదేవపురములో సిద్ధమగుచున్నది.

వరంగల్ ఉన్ని తివాచీలకు ప్రసిద్ధి వహించియున్నది. ఈ తివాచీలు యూరోపు ఖండములకు కూడ ఎగుమతి యగుచుండెను. కృత్రిమపురంగునకు

వాడుకలోనికి వచ్చినతరువాత ఈ వ్యాపారము దెబ్బ తిన్నది. ఈ రంగులు వెలిసిపోవును. వరంగల్ జైలులలో చక్కని ఛత్రంజీలు తయారగును. కరీంనగరులో చక్కని, సున్నితమయినతీగతో అల్లికపని జరుగును.

హైదరాబాదు, వనపర్తి, గద్వాల, కొల్లాపురం, జగదేవపురం మొదలగు ప్రదేశాలలో చక్కనికత్తులు తయారగును. కాని యీ పరిశ్రమ క్షీణదశలోనున్నది. హైదరాబాదులో తుపాకులు తయారగుచుండెను. ఇవన్నియునిర్మలలోని ఉక్కునుండి సిద్ధమగుచుండెను.

విద్యుత్ ఉత్పాదక యంత్రాగారము, టంకసాల, బట్టల యంత్రాగారములు, పట్టుఫ్యాక్టరీలు, గుండీల ఫ్యాక్టరీలు, ఎనామిల్ ఫ్యాక్టరి, బిస్కత్తు ఫ్యాక్టరీలు, సారాదింపుఫ్యాక్టరీలు, బక్కెట్లు, మంచుగడ్డ, సోడా వాటరు, సిగరెట్లు, బీడీలు, వడ్లమరలు, చక్కెర ఫ్యాక్టరీ, ఎముకలఫ్యాక్టరీలు, అగ్గిపెట్టెలు, నూనెమరలు, సబ్బులు, ఇటుకలు, చక్కసామాను, చందనపు పనితనము, గ్లాసు, చలువరాయి, తోలు, ప్రత్తి మొదలగువానిని గూర్చిన కర్మాగారములు పెక్కుగలవు. రాష్ట్రములోని 1211 వివిధ కర్మాగారములలో తెలంగాణమునందు 596 గలవు. ఫ్యాక్టరీల ఆక్టునియమాల ననుసరించి పనిచేయుచున్న రాష్ట్రములోని 610 ఫ్యాక్టరీలలో 243 తెలంగాణము నందున్నవి.

తెలంగాణములో 25 మండీలు, 18 గంజులు కలవు. మొత్తము 43. రాష్ట్రపు మొత్తము 103.

తెలంగాణములో గద్వాల, అమరచింత, వనపర్తి, జటప్రోలు, పాలవంచ, గోపాలపేట, నారాయణపురం, ఆనగొంది, గురుగుంట, మొదలగు ఆంధ్ర సంస్థానము లున్నవి. ఈ సంస్థానములన్నియు దీవానీలో చేరిపోయినవి.

ఉస్మానియా విశ్వవిద్యాలయము, తత్సంబంధ కళాశాలలు హైదరాబాదు నగరములోనే యున్నవి. కావున తెలంగాణమునకు చెందినవే. ఇదికాక హైదరాబాదులో 4, సికందరాబాదులో 1, వరంగల్లులో 1, మొత్తము 6 కళాశాలలు తెలంగాణలో నున్నవి.

తెలంగాణము ఆంధ్రులచరిత్రకు కాణాచి. ఈ భూఖండమునందలి ప్రతియంగుళపు భూమి చరిత్రకందని కాలమువరకు అనగా మూడు నాలుగువేల సంవత్సరములవరకు ఆంధ్రుల పాండిత్య ప్రకర్షాదులను, క్రీడా విహారములను, ఆచార వ్యవహారములను, ధర్మాభిరతిని, శిల్పకళా నైపుణ్యమును, చిత్రకళా విన్యాసములను, సంప్రదాయములను, నడవడులను, అందచందములను, సభ్యతను జాటుచుండును. ఆదిమకాలపు టాంధ్రుల సమాధులు ( కెయిరనులు ) తెలంగాణమునందే యున్నవి. శాతవాహన, కాకతీయ, చాళుక్య, రాష్ట్రకూట, యాదవాది రాజవంశములు తెలంగాణమునందే ప్రతిభను జాటియున్నవి. రుద్రదేవుడు, గణపతిదేవుడు, రుద్రమదేవి, ప్రతాపరుద్రుడు, సర్వజ్ఞసింగభూపాలుడు మున్నగు ఆంధ్రరాజన్యులు ప్రసిద్ధచారిత్రక పురుషులు ఇచ్చటివారే. బమ్మెర పోతనామాత్యుడు, పాలకురికి సోమనాథకవి, విద్యానాథకవి, మల్లినాథసూరి మొదలగు మహాకవుల, మహావిద్వాంసుల పవిత్రవాణి ప్రతిధ్వనించిన దిచ్చటనే. అక్కన సినాని, మాదన్నమంత్రి, భక్తరామదాసు మున్నగు దండనాథుల, అమాత్యపుంగవుల, భక్తవరుల కాలవాలమయినదీ తెలంగాణము. వరంగల్లు, రాచకొండ, గోలకొండ, ఆనగొంది మున్నగు నగరములు ఆంధ్రరాజధానులుగా విలసిల్లినవి. కొలనుపాక, కొండాపురము, భోనగిరి, పానగల్లు, పిల్లలమఱ్ఱి, ఖమ్మముమెట్టు మున్నగునవి సుప్రసిద్ధ చారిత్రక ప్రదేశములు. తెలంగాణమునందలి చెట్టు, పుట్ట, రాయి, రప్ప, గుట్ట, మిట్ట ఆంధ్రచరిత్రోదంతమును వెదలగ్రక్కుచుండును. ఆంధ్రజనానికి పవిత్రభూమి, ఆవేశమిచ్చు ప్రదేశము తెలంగాణము.



# తెలంగాణము - ప్రకృతిసంపద

శ్రీ పర్సా వెంకటేశ్వరరావు H. C. S.

మామిడిచెక్క నేల, ఉసిక రేగళ్ళు, కొలది ప్రదేశములలో కాటుక రేగళ్లు, గలిగి, గుండ్రాళ్ళతోగూడిన, తిప్పలు, కొండలు గలిగి, వర్షాకాలములో ఆర్భాటముతో ప్రవహించు వాగులు, బుగ్గలు, యేళ్ళతో గూడుకొని, దుర్గమారణ్య పర్వత ప్రదేశములగుండా ప్రవహించు గోదావరీ, కృష్ణా, తుంగభద్రా మంజీరా స్రవంతులచే పునితమొనర్పబడిన తెలంగాణము, ప్రకృతి రామణీయకత కాటపట్టయిన సుందర దేశమయినప్పటికి, సారవంతము, సస్యశ్యామలమని చెప్ప వీలులేదు. చాళుక్యరాజుల పరిపాలనములోబడి విజయనగర సామ్రాజ్యాధీశులచే జయించబడిన, హైదరాబాదు రాష్ట్ర భూభాగము మరత్వాడా యను పేరుతో వెలుగొందుచు, నల్లకాటుక రేగళ్ళతో అధిక సారవంతము; సస్యశ్యామలమునై, బంగారమునకు పుట్టినిల్లయి, ఒకానొకప్పుడు ఆంధ్ర సామ్రాజ్యాంతర్భాగమైనప్పటికి, నేడు తెలంగాణమునకు బాహిరమున నున్నందున, అచ్చటి ప్రకృతిసంపదయొక్క విమర్శ మన కప్రస్తుతము.

## అడవులు

తెలంగాణమున, శోభాయమానమైన అడవులు, నదీనదములు, విశేషముగ గలవు. మాగాణి పైరులలోవరి, చెఱకు, మెట్టపైరులలో, జొన్న, సజ్జ, కంది, పెసర, శనగ, మినుముల వంటి పప్పు ధాన్యములు వేరు శనగ, నువ్వు, కుసుమ ఆముదాలవంటి నూనె గింజల పంట, మిరపకాయలు, ఓము, ధనియాలు, కొద్దిగా ప్రత్తి పంట చెప్పుకోదగినవి. కృష్ణా, గోదావరీ తీర ప్రాంతారణ్యములలో, టేకు, చంద్ర, నల్లమద్ది, జిట్రేగు, కలప, కొడిశె, వెదురు వాసములు, సమృద్ధము. నిజామాబాదు జిల్లాలో, మంచప్ప, గంధారీప్రాంతాటవులుగూడ, ఆటవిక సంపదకు ఆటపట్టు. కాజీపేట బలార్షా, కాజీపేట, ఇల్లందు కొత్తగూడెం, రైలు మార్గముపైగల ప్రతి, స్టేషను నుంచి చక్కటి కలప విరివిగా యెగుమతి చేయబడును. విజయవాడ, రాజమండ్రీ, హైదరాబాదు పట్టణములకు, యీ కలప ముఖ్యముగా పంపబడు చున్నది. కరీంనగరు జిల్లాలోని మహాదేవపురం అడవులనుంచి విలువగల కలప, గోదావరి ప్రవాహములో వేయబడి, రాజమండ్రీ చేరుచున్నది.

కలపతో సమానమగు విలువగల పంట వెదురు, అయిదు లక్షల టన్నులు సుమారు. ఉపయోగ పడుచున్నది. వరంగల్లు, ఆదిలాబాదు జిల్లాలలో వెదురు విరివిగా లభించును తడికెలు అల్లుటకై, వెదురు బొంగులు, హైదరాబాదు, వరంగల్లు, నిజామాబాదు, ఔరంగాబాదు, నగరములలో 80, 000 000

సుమారు సంఖ్యలో ఉపయోగించబడుచున్నవి. వెదురు, యితర ప్రాంతములకు యెగుమతి చేయబడదు.

తునికిఆకు వర్తకము, తెలంగాణములో ముఖ్యమైనది. బీదజనులు పొగత్రాగుట కుపయోగించు బీడీలు, యీ ఆకుతో చుట్టబడును. తునికి ఆకు అన్ని జిల్లాలలోను లభించును. గాని, ఆదిలాబాదు, కరీంనగరు, వరంగల్లు, నిజామాబాదులో యివి సమృద్ధము.

## పాడి పంటలు

తెలంగాణములో వ్యవసాయమునకు ముఖ్యముగ వరిపంటకు చెరువులు ఆధారము. రామప్ప, లక్నావరం, పాఖాల చెరువుల వంటివి, ఆంధ్రరాజులకాలములో నిర్మించబడినవి. ఆధునికముగా, వైరా, పాలేరు, నిజాంసాగరువంటి, సువిశాలజలాశయములు నిర్మింపబడినవి. గోదావరికి కడం అను ప్రదేశమువద్ద తుంగభద్రకు, ఆనకట్టలునిర్మించి, కొన్ని లక్షల యెకరములను మాగాణిసేద్యమున కనుకూలముజేయు ప్రయత్నములు సాగుచున్నవి. పై స్కీములు ఫలించిన, మాగాణములతో పాటు, విరివిగా విద్యుచ్ఛక్తి లభించగలదు. వాటి అంచనా క్రింద ఉదహరించనైనది.

| | మాగాణి సేద్యము యెకరములలో | కిలోవాట్ల విద్యుచ్ఛక్తి ప్రసారము. |
|---|---|---|
| గోదావరి జలాశయము | 12,50,000 | 55,000 |
| తుంగభద్ర ,, | 6,25,000 | 37,000 |
| నిజాంసాగర్ ,, | 2,75,000 | 14,000 |

ప్రకృతి సంపదలో పాడిపంటలను, చేర్చవలసియున్నది. 1949-50 సంవత్సరపు లెక్కల ప్రకారము మన దేశములోని పశుసంపద, పంటలు వివరములను క్రింద చూపించనైనది. చూ. (1) అనుబంధము.

పశుగణన వివరములు, విడిగా చూపించబడినవి. చూ. (2) అనుబంధము.

తెలంగాణా, ఇతరఆహారపంటలలో స్వయం సమృద్ధమైనప్పటికి, వరి పంటలోలోటు కనిపించుచున్నది. పూర్వమునుంచి ఒక లక్ష బస్తాల ధాన్యము కృష్ణాజిల్లా నుండి దిగుమతి యగుచుండెడిది. మానేరు, గోదావరీ, తుంగభద్రా ప్రాజెక్టులు, పూర్తియగుచో ఈ లోటు పూర్తియగుటేగాక, పంట మిగుల గలదు. ప్రత్తిపంట తెలంగాణములో చాల వరకు తగ్గిపోయినది. వరంగల్లులో, ఒక్క బట్టల మిల్లు మాత్రమే గలదు. ఆదిలాబాదు జిల్లా, ఉత్తర ప్రాంతములో, భూమి, ప్రత్తి పంటకు చాలా అనుకూలమైనది. నాందేడు జిల్లాలోని దెగ్లూరు, భైంసా, ధర్మాబాదులు తెలుగు ప్రాంతములైనప్పటికి, ధర్మాబాదు, నాందేడులలోని వర్తక కేంద్రములద్వారా, ప్రత్తిపంట, బొంబాయికి చేరవేయబడుచున్నది. కొంత నాందేడు బట్టల మిల్లులో ఖర్చు అగుచున్నది. తెలంగాణములో మంచి ర్యాలవద్ద, ఇంకొక బట్టలమిల్లు స్థాపించి, ఆదిలాబాదు, నాందేడు జిల్లాలలోని ప్రత్తి పంటను, ఉపయోగించుకొన వచ్చును.

## విద్యుచ్ఛక్తి

ప్రకృతి నుండి లభించు శక్తులలో విద్యుచ్ఛక్తి అత్యంత ఉపయోగకరమైనది. తుంగభద్రవద్ద లభించు శక్తిని, ఉపయోగించి, ఆలంపూరు, గద్వాల, మహబూబు నగరం జిల్లాలో అనేక ప్రాంతములలో పరిశ్రమలను స్థాపించ వచ్చును. ముఖ్యముగా నూనె పరిశ్రమలకు మహబూబునగరం జిల్లా, కేం

ద్రిము. అందు జెడచర్ల (బాదేపల్లి) అతి ముఖ్య వర్తక స్థానము. నిజాం సాగర ప ప్రాజెక్టునుంచి లభించు, విద్యుచ్ఛక్తిద్వారా, నిజామాబాదు. మెదకు జిల్లాలను పారిశ్రామిక కేంద్రములుగ మార్చవచ్చును. కడెం వద్ద నిర్మింపబడు గోదావరి పవర్‌స్కీం అన్నిటికంటె గొప్పది. అచ్చటినుంచి విద్యుచ్ఛక్తి నాల్గుజిల్లాలకు, విరివిగా సరఫరా చేయవచ్చును. ఆదిలాబాదు, కరీంనగరం, వరంగల్లు, నల్లగొండ జిల్లాలు, విద్యుచ్ఛక్తి సహాయముతో, ఇంగ్లాండులోని, మాంచెస్టరు, బర్మింగఘాం, లంకిషైర్, స్టాఫర్డ్ జిల్లాలవలె, అభివృద్ధి పొందుటకు చక్కని అవకాశముగలదు. వెయ్యి సంవత్సరముల వరకు సరిపోవు నేల బొగ్గు, పరిశ్రమలకు అనువగు ఇనుము. గోదావరీ తీరప్రాంతమున లభించుచున్నది.

## లోహములు

బంగారు, వెండి, పెట్రోలియం, తప్ప మిగతా ఖనిజములు, తెలంగాణములో లభించును. ఇనుము. లక్సెట్టిపేట, జగత్యాల, ఇల్లెందు తాలూకాలలో గలదు. 4 కోట్ల టన్నుల ఇనుపమట్టి (Iron Ore) నూటికి 35.4 వంతుల ఇనుముగలిగినట్టిది లభించగలదని పరిశోధకుల నిర్ణయము. నేలబొగ్గు, కొత్తగూడెం, ఇల్లెందు, తాండూరు, శాస్త్రుల వద్ద త్రవ్వబడుచున్నది. 100 కోట్లటన్నుల బొగ్గు లభించగలదని అంచనా. ప్రస్తుతము, సంవత్సరమునకు 10 లక్షలటన్నులుమాత్రమే సేకరించబడుచున్నది. ఈ విధముగ వెయ్యి సంవత్సరములకు సరిపోవుబొగ్గు తెలంగాణములోగలదు. బొగ్గునుండి, నూనెను,రంగులు, వంటకు, దీపముల కుపయోగించు గ్యాస్, తయారుచేయవచ్చును. ఇచ్చటిబొగ్గు ముఖ్యముగ రైల్వే ఇంజనులలో ఉపయోగించబడుచున్నది. దీనిని, బాయిలర్లలో ఉపయోగించి, విద్యుచ్ఛక్తిని ఉత్పన్నము చేయవచ్చును.

రాగి; గద్వాల, మక్తల, పాలవంచ, తాలూకాలలోను, నల్లగొండజిల్లాలో చింత్రియాలవద్ద లభించును. సీసము దేవరకొండ వద్ద లభించును. కాని ఇవి తగినంత స్వచ్ఛతతో విశేషముగ లేవందును, రాగిని, సీసమును కరగించు పరిశ్రమ లభివృద్ధిజెందలేదు. గంధకముతో కూడుకొనిన ఇనుపమట్టి, బొగ్గు గనులలో లభించుచున్నది. పరిశ్రమలలో నుపయోగింపబడు గంధక ద్రావకము దీని నుండి తయారుచేయుదురు. 25 టన్నుల సుమారు క్రోమియం, మధిరవద్ద ఇదివరలో సేకరించబడినది. వరంగల్లుజిల్లాలో కల్లూరు వద్ద అభ్రకపుగనులు కలవు. నెల్లూరుప్రాంతములో లభించు అభ్రకమునకు దీనికి తేడా లేదు. అభ్రకమునుండి విద్యుచ్ఛక్తి ప్రసారము పరికట్టు, వస్తుసముదాయము జేయవచ్చును.

## ఇతరధాతువులు

పెన్సిలు పరిశ్రమకు ఉపయోగించు గ్రాఫైటు పాలవంచ తాలూకాలో లభించును. కొవ్వూరులోని, గనుల కంపెనీ, ఇచ్చటి గ్రాఫైటును, గోదావరిలో పడవలపై గొనిపోయి, శుభ్రపరచి, ఎగుమతి చేయుచున్నది. విద్యుచ్ఛక్తి నివారక పరికరముల చేయుట యందును గ్రాఫైటు మిక్కిలి ఉపయోగకారి.

(Talc or Steatite) టాల్క్ లేక స్టియటైటు అనునది, ఫేసుపౌడర్లు, సబ్బులు టూత్ పేస్టులు,తయారుచేయుటలో ఉపయో

గించువది, కరీంనగరు, నిజామాబాదు జిల్లాలలో లభించుచున్నది. ఇచ్చట లభించు సబ్బురాళ్ళతో (Soap Stone) రాచ్చిప్పలు చేయుదురు. రాచ్చిప్పలు ఆంధ్రుల వంటపరికరములలో చాల ముఖ్యమైనవి. పులుసు, చారు కాచుకొనుటకు, పచ్చళ్ళు భద్రపరచుకొనుటకు, ఉప్పు, ఊరుగాయలు వేసికొనుటకు, అక్కరకువచ్చునవి, మడికి పనికివచ్చునవి; మన నాయనమ్మలకు వీటిపై ప్రీతి.

గంగ సింధూరము (Red - ochre) వికారాబాదు వద్ద సుమారు 50, 000 టన్నులు లభించగలదు. 50 లేక 100 అడుగులు ఎత్తుగల పలుగురాతి కొండలు (Quartz) నూటికి 99 వంతులు స్వచ్ఛమైన సిలికా(Silica) గలవి. హైదరాబాదు పట్టణ సమీపముననూ, మెదకు, మహబూబునగరం. నల్లగొండ జిల్లాలలో గలవు. ఈ పలుగురాళ్ళను పొడిచేసి కరగించి గాజును తయారుచేయుదురు. గాజువస్తువులు తయారుజేయు రెండు కర్మాగారములు హైదరాబాదు పట్టణ పరిసరములలో గలవు.

కప్పులు, సాసర్లు తయారుచేయు తెల్లమట్టి (China - clay) కృష్ణానది యొడ్డున, వాడపల్లి రేవువద్ద గలదు. బీదరుజిల్లాలోని తెలుగు ప్రాంతములో బొట్టునకుపయోగించు నామము (సుద్ద) విశేషముగ లభించును. నామమును నీళ్ళలో కరిగించి జనులు వెల్ల వేయుటకు ఉపయోగించుచున్నారు. దీనితో తెల్లమట్టి (పింగాణి) పాత్రలు చేయించినచో యెక్కువ లాభదాయకము కాగలదు.

వేడికి తట్టుకొనజాలు ఇటుకలు తయారుచేయుమట్టి (Fire - clay), 80,000 టన్నులు సుమారు ఆదిలాబాదు జిల్లాలో, ఆసిఫాబాదు, రాజూరాలవద్ద లభించగలదు.

పసుపు, ఎరుపు, కావిరంగుమట్టి, రంగు రంగుల వెల్లవేయుట కుపయోగించునది (Distempers) వికారాబాదువద్ద విరివిగా లభించును.

## వజ్రములు

పుష్యరాగములు, ఇల్లందువద్ద గరీబుపేట లో గోదావరీతీర ప్రదేశములందు లభించును. పూర్వము గోలకొండ వజ్రములకు ప్రసిద్ధిగాంచియుండెను గాని వజ్రములుగోలకొండవద్ద దొరుకవు. కృష్ణానదీ తీరమున ముఖ్యముగా పరిటాలవద్ద పూర్వపు వజ్రపు గనులుండెను. కోహినూరు వజ్రము, కృష్ణాతీరమందు లభించినదని ప్రతీతి. తుంగభద్రాతీరమందు పలుమారులు వజ్రములు లభించినవి. అందు కొన్ని పూర్వరాజులు పోగొట్టుకొనినవి కావచ్చును.

## రాళ్ళు

వివిధ రంగుల పాలరాళ్ళు (Marbles)' ఇల్లెందు తాలుకాలో జాస్తిపల్లి వద్ద గలవు' వీటినిత్రవ్వి యెగుమతిచేయు కంపెనీ యేర్పడియున్నది.

సేడం, చీతాపూర్, వాడీ, షాబాదుల వద్ద పలకరాళ్ళ గనులు గలవు. వీటిని నేలపై పరుచుటకు, ఇల్లకప్పులకు ఉపయోగింతురు. మన దేశములో షాబాదరాళ్ళను అందరు ఉపయోగించువారే. ఈ రాళ్ళలో నూటికి 93 పాళ్ళు సున్నముగలదు. ఈ రాళ్ళను పొడిజేసి, సిమెంటు తయారుజేయు పెద్ద కార్ఖానా షాబాదులో గలదు. షాబాదు రాళ్ళవలె, షాబాదు సిమెంటు గూడ చాలా

సుప్రసిద్ధము. మెట్టూరు ఆనకట్టు కట్టుటకు పాబాదు సిమెంటు ప్రత్యేకముగ వాడినారు.

ఇండ్లు కట్టుట కుపయోగించు ఇసుకరాళ్లు, దేశములో ప్రతిచోట దొరకును. తీరుపులు దిద్ది, నగిషీలుచెక్కి, అద్దమువలె మిలమిల మెరయునట్లుజేసి మైనమువలె మలచి నృత్త భంగిమములు నెరపించు భువనైక మోహనా కారముల నిర్మించిన ఆంధ్రశిల్పుల కళా చాతుర్యమునకు సాక్షీభూతములగు రామప్ప, సహస్ర స్తంభ దేవాలయములు నల్లరాయిలో (Gramite) కట్టబడినవి. ఇట్టి గ్రానైటు, నల్ల రాళ్లు, తెలంగాణములో విరివిగా లభించును. మాతృ భూమిలోని నల్లరాళ్లుగూడ మనకు ప్రియమైనవే.

ఆధునిక పారిశ్రామిక యుగములో విస్తృత జలాశయములు, విద్యుచ్ఛక్తి, బొగ్గు, ఇనుము సున్నపురాళ్ళు, ప్రకృతి సంపదలో ముఖ్యాతి ముఖ్యమైనవి. ఇవి లభించుచోట పరిశ్రమలు అభివృద్ధిజెందును. జర్మనీ, చెకోసలోవేకియా, ఫ్రాన్సు, అమెరికా, ఇంగ్లాండు, రష్యాలు, ఈ ముడి పదార్థములవల్లనే ప్రపంచ ప్రాముఖ్యములోనికి వచ్చినవి. ఈ వస్తువుల సాధన కొఱకే, జపాను, మంచూరియాను ఆక్రమించినది. ఇరువదియవ శతాబ్దపు నాగరికత, యీ ముడి పదార్థములపై ఆధారపడి యున్నది. తెలంగాణములో ఇట్టి ముఖ్య ప్రకృతి సంపద సహజముగ నున్నందున. తెలంగాణము భారత దేశములో ముఖ్య పారిశ్రామిక కేంద్రమగు నవకాశము గలదు. తెలంగాణమునకు భవిష్యత్ భారత చరిత్రలో మహోజ్వల స్థానము లభించగలదని ఆశించుచున్నాను.

---

(1) అనుబంధము.

పంటలు 1949-50 సం. టన్నుల పరిమాణములో

| తెలంగాణము | వరి | జొన్న | గోధుమ | కంది | సెనగ | పెసర | ఉలవ | నువ్వులు | వేరుసెనగ |
|---|---|---|---|---|---|---|---|---|---|
| ,, | 318270 | 203229 | 1115 | 14443 | 14857 | 42405 | 20583 | 23888 | 142351 |

(2) అనుబంధము.

పశుసంపద 1949-50 సంవత్సరములు

| తెలంగాణము | దూడలు | ఎద్దులు | ఆవులు | దూడలు | దున్నలు | ఎనుములు | గొఱ్ఱెలు | మేకలు | గుఱ్ఱములు |
|---|---|---|---|---|---|---|---|---|---|
| ,, | 757450 | 1577530 | 1529111 | 347114 | 293724 | 552262 | 5433778 | 1090339 | 17210 |

# తెలంగానా చరిత్ర



శ్రీ మల్లంపల్లి సోమశేఖరశర్మ

తెలంగానా అను పేరు హైదరాబాదు రాజ్యములోని తెనుగుభాష మాటాడు ప్రాంతమునకు వర్తించునన్న విషయము అందరకును దెలిసినదే. ఈ ప్రదేశమంతయు వరంగల్లు, నలగొండ, కరీమ్‌నగరము, మహబూబునగరము, ఆదిలాబాదు, నిజామాబాదు, మెదకు, హైదరాబాదులని ఎనిమిది జిల్లాలుగా విభక్తమయినది. ఈ ప్రాంతము వైశాల్యము హైదరాబాదు రాజ్యములోని రెండవ పెద్ద విభాగమగు మరాట్వాడా అను మహారాష్ట్రభాష మాటాడు ప్రాంతము వైశాల్యముకంటె పెద్దది. పైనిచెప్పిన ఎనిమిది జిల్లాలలోను వరంగల్లు అనునది ఓరుగల్లు అనుదాని వికృతి. నలగొండ, మెదక, వరంగల్లులు ప్రాచీనకాలమునుంచి ఇప్పటివరకు ఏమాత్రము మార్పుచెందకుండ నిలిచియున్న పేరులు. కరీమ్‌నగరము మహబూబునగరము, ఆదిలాబాదు, నిజామాబాదు, హైదరాబాదు అను పేళ్లు ఆ జిల్లాలకు ఇటీవల ముస్లిం పరిపాలనలో వచ్చినవి. ముస్లిం సుల్తానులు అదివఱకున్న జిల్లాల తాలూకాల పేళ్లుమార్చి క్రొత్తగా తురకపేరులు పెట్టినారు. ఆదిలాబాదుకు సిరిపురం-తాండూరని, నిజామాబాదుకు ఇందూరని, కరీంనగరమునకు వెలిగందల అని, మహబూబునగరమునకు పాలమూరని పూర్వపుపేళ్లు. తెనుగుతనమును బోగొట్టి ముసల్మానులు తమ రాజ్యమను భావన కలిగించుటకు విజయదర్ప సూచకముగ పైవాటికిమాత్రమే కాక తెలంగానాలోని చాలపురములకు గ్రామములకు ముస్లిముపేరులు పెట్టిరి. కొన్నికొన్ని తెలుగు గ్రామముల పేళ్లను ముసల్మాను ఉచ్చారణపద్ధతి ననుసరించి ఉచ్చరించి వాటికి వికృతరూపము కల్పించిరి. వారి ఉచ్చారణపద్ధతిలో వెలిగందల యెల్గందల్ అయినది; కొల్లిపాక కుల్పాల్ అయినది. ఇట్లెన్ని యుదాహరణములనయిన నీయవచ్చును. ఈ విధమున గ్రామాదికముల పేళ్లు ఎంతగమారినను తెలంగానా తెలుగు సీమయే; అది తెనుగువారి కాణాచి.

తెలంగాణా అన్నది ఇటీవల వ్యవహారములోనికి వచ్చిన రూపము. అది ఈ దేశము అసలుపేరుకాదు. దీనికి ప్రాచీన కాలమునుండియున్న పేరు తిలింగదేశము. తిలింగదేశవాసులు తైలింగులు. తిలింగమే ప్రాచీనరూపము. త్రిలింగము అర్వాచీనరూపము. ఇది ఈ దేశమున శైవము ముమ్మరముగ వ్యాపించిననాడు వచ్చినది. స్థూలదృష్టిని చూచినచో, ఇది మంథెన కాళేశ్వరము, శ్రీశైలము, దాక్షారామము అను మూడు ప్రసిద్ధ శైవక్షేత్రములకు నడుమ నుండిన కారణమున దీనికి త్రిలింగదేశమని వ్యవహారము కలిగినదని తెలియును. తిలింగదేశమన్నను త్రిలింగదేశమన్నను ఆదిలో తెనుగు మాతృభాషగా గలవారు నివసించు ప్రదేశమున కంతకును, అనగా నేడు విశాలాంధ్రమని వ్యవహరింపబడు దేశమునకంతకును వర్తించుచుండెను. ముసల్మాను చరిత్రకారులు దీనిని తిలింగ్ అనియె వ్యవహరించిరి. శాసనములలో గూడ దీనికి తిలింగమనియే పేరు. ఈ దేశమునకు తిలింగదేశమని, తిలింగాణెమని వ్యవహారనామములు. ఆణెము దేశము అనునవి పర్యాయపదములు. జనవ్యవహారములో ఆణెము ఆణమయి తిలింగాణ మయినది. తిలింగాణమే, కాలక్రమున లోకవ్యవహారమున తిలింగానా తెలంగానాలుగా మారినది. తిలింగదేశమన్నను తిలింగానాయన్నను తెలంగానాయన్నను ఒక్కటే-తెనుగుదేశము క్రీ. శ. 1766 లో ఉత్తరసర్కారులను సముద్రతీరస్థ ఆంధ్రదేశమును, 1800 లలో రాయలసీమను ఆసఫ్‌జాహీ వంశజుడయిన నిజాంఅలీఖాన్ అను నిజాముల్ ముల్కు బ్రిటిష్‌వారికిచ్చివేసి నప్పటినుంచి తెలుగుదేశము నిజాముల్ ముల్కు పరిపాలితదేశమని, బ్రిటీషు పరిపాలితదేశమని రెండువిభాగములై తెనుగువారిలో తెనుగువారికి మధ్య రాజకీయముగ అడ్డుగోడ లేర్పడి అంతవఱకు ఏక కుటుంబముగా నుండిన తెనుగువారు రెండు చీలికలైరి. నాటినుంచి నిజాము పరిపాలనక్రింద నుండిన తెనుగుదేశమునకే తెలంగానా అను పేరు రూఢమయి

నది. తెనుగుబాస మాటాడువారందఱు రాజకీయముగా రెండు విడిరాజ్యములందు పడి విడిపోవుట ఇటీవల జరిగిన సంఘటనే కాని ఆదినుకాలంనుంచి ఇట్లు లేదన్న విషయము మనము జ్ఞాపక ముంచుకొనుట అవసరము. అదవఱకు తెనుగుదేశము వేఱువేఱు రాజ్యములుగ విడిపోయినను అవియన్నియు హిందూరాజ్యములే; తదధిపతులు ఆంధ్రులే. అసఫ్‌జాహీ వంశము వారి కాలములో నిజామాంధ్రదేశము నుండి బ్రిటిష్ ఆంధ్రదేశమెట్లు విడిపోయినదో అదేవిధముగా తెలంగానాలో బహమనీ రాజ్యస్థాపన మయినతరువాతను, అటుపిదప కుతుబ్‌శాహి సుల్తానులు ఇచటి తమ యధికారమును నెలకొల్పిన యనంతరమునను హిందూ ఆంధ్రమని, ముస్లిమ్ ఆంధ్రమని ఆంధ్రదేశము రెండు విభాగములైనది. ఈ విషయముల ననుసరించి చూచినచో తెలంగానాలో ముస్లిము అధికారము సుస్థాపితమయిన తరువాతినుంచే ఆంధ్రదేశము రెండు విభాగము లయినదని విశదము కాగలదు. అంతమాత్రమున తెలంగానా ఆంధ్రులువేఱు, ఇతరాంధ్రులు వేఱు అనుకొనుట పొరపాటు. ఆంధ్రులందఱు ఒకటే; వారు ఏకైకజాతివారు; వారిది ఆంధ్రజాతి. ఇది అత్యంత ప్రాచీనమైనది.

## ఆంధ్రులు - వారి ప్రాచీనత

భారతఖండములోని అతిపురాతనమైన జాతుల వారిలో ఆంధ్రులొకరు. ఆంధ్రశబ్దము ఐతరేయ బ్రాహ్మణములో మొట్టమొదటిమాఱు కానవచ్చుట వలన ఆంధ్రులు బ్రాహ్మణకాలము నుంచి యున్నట్లు చరిత్రకారులు చెప్పెదరు; కాని వారినిగురించిన విశేషములంతగా తెలియవు. మౌర్యవంశజులు క్రీస్తుపూర్వము నాలుగవ శతాబ్దిలో పాటలీపుత్రము రాజధానిగా మగధరాజ్యమును పాలించుచుండిన కాలముననే ఆంధ్రులు దక్షిణాపథమున రాజ్యమునుస్థాపించి పరిపాలనము నెఱపుచుండినట్లు తెలియుచున్నది. ఆకాలమున మౌర్య సామ్రాజ్యమునకు పిదప ఆంధ్రులదే బలప్రాభవములు కలిగినరాజ్యము. ఆంధ్రరాజ్యమున అనేక గ్రామములును, గోపుర ప్రాకార పరిరక్షితములైనముప్పదినగరములును ఉండెను. ఆంధ్రులకానాడు లక్ష పదాతిబలమును, రెండువేల గుఱ్ఱపుదళమును, వేఱు ఏనుగులు నుండెను. మన కిన్ని విషయములు తెలిసినను అప్పటి పరిపాలన విధానమును గురించి కాని, రాజవంశమును గురించికాని ఏమియు తెలియదు.

## మౌర్యుల ఆంధ్రరాజ్య విజయము

తరువాత ఆంధ్రరాజ్యమును మౌర్యవంశపురాజులు జయించి తమ మగధ సామ్రాజ్యములో చేర్చుకొనిరి. మౌర్య చంద్రగుప్త చక్రవర్తికుమారుడు బిందుసారుడే ఆంధ్రరాజ్య విజేతయని చరిత్రకారులు భావించుచున్నారు. బిందుసారుని కొడుకు అశోకవర్ధన చక్రవర్తి క్రీస్తుపూర్వము 273 లో సింహాసనమెక్కెను కాని ఏ కారణముననో ఇతని పట్టాభిషేకము నాలుగేండ్ల అనంతరము 269లో కాని జరగలేదు. ఈతడు సింహాసన మెక్కినపిదప 'దేవానాంపియ' (దేవానాం ప్రియ), 'పియదసి' (ప్రియదర్శి) అను బిరుదములు వహించెను. అశోకుడు వేయించిన ధర్మలిపులు (శాసనములు) అనేకములు బయలుపడినను వాటి అన్నిటిలోను 'దేవానాంపియ', 'పియదసి' అని యున్నదికాని అశోకుని పేరులేదు. అందువలన ఈ బిరుదములు గలరాజు నిజముగా అశోకు డగునా కాదా యని చరిత్రపరిశోధకులు సంశయించుచుండ వారి సందేహమును దీర్చి యా బిరుదములుగల రాజు అశోకుడే యని నిర్ధారణమొనర్చినది హైదరాబాదు రాజ్యమునందలి రాయచూరుజిల్లా మాస్కిలోని అశోక ధర్మలిపి. ఈ శాసనము 'దేవానాంపియస అశోకస' అని యారంభమగును. అశోకుని రాజ్యకాలములో జరిగిన ముఖ్యవిషయము కళింగవిజయము. కళింగవిజయముతో ఆంధ్రదేశమంతయు అశోకునిఅధికారము క్రిందికి వచ్చెను. కళింగదేశమునకు ఓఢ్రదేశమునందలి పూరీజిల్లాలోనున్న తోసలి (ఇప్పటిధౌలి) రాజధానికాగా తెలంగానా మొదలైన మగధసామ్రాజ్య దక్షిణ ప్రాంతమునకు సువర్ణగిరి రాజధానియైనది. తోసలి, సువర్ణగిరులు ముఖ్యరాజ్యములగుటచేత అశోకచక్రవర్తికి రాజబంధువులైన రాజకుమారులే వాటికధిపతులుగా నియుక్తులగుచుండిరి. ఈ సువర్ణగిరి కర్నూలు జిల్లాలోని (గుత్తికి సమీపముననున్న) ఎఱ్ఱగుడి దగ్గటి జొన్నగిరియే (స్వర్ణగిరి-సొన్నగిరి-జొన్నగిరి) యని కీ. శే. చిలుకూరి నారాయణరావుగారు నిర్ధారణ చేసియున్నారు. ఈజొన్నగిరిలో కొన్ని సంవత్సరములకు పూర్వము అశోకుని ధర్మలిపులు బయలుపడుటచేతను, ఇచటి కొండకు స్వర్ణగిరికి ప్రాకృతరూపమైన సొన్నగిరి- జొన్నగిరి యని పేరుండుటచేతను శ్రీ నారాయణరావుగారు చేసినసూచన యుక్తియుక్తమైనది, సహేతుకమైనది అని విశ్వసింపదగినదిగా ఉన్నది.

## ఆంధ్ర సాతవాహనులు

ప్రాయికముగా అశోకచక్రవర్తి మృతినొందిన కొద్దికాలమునకే, క్రీస్తుకు పూర్వము దక్షిణాపథమున నివసించిన జాతులవారందఱిలో ఆంధ్రులు మున్ముందు నడుములు బిగించి శ్రీముఖుడనువాని నాయకత్వమున పారతంత్ర్యమునుండి దేశమును విడిపించి స్వతంత్ర రాజ్యమును స్థాపించిరి. శ్రీముఖుడు ఆంధ్రజాతిలోని సాతవాహన కులమునకు చెందినవాడు. ఈ కారణమున శ్రీముఖుని సంతతివారికే చరిత్రలో ఆంధ్రరాజులని సాతవాహన నృపతులని వ్యవహారమున్నది. దక్షిణాపథమనబడు దక్కనులో వెలసిన మొట్టమొదటి గొప్పరాజ్యము ఆంధ్రులది. పురాణముల ననుసరించి ఆంధ్రరాజ్యము నేలిన ధరణీశ్వరులు ముప్పదిమంది. వీరందఱును గలిసి మొత్తముమీద నాలుగునందల యేబది సంవత్సరముల కాలము భూమిని పాలించిరి. ఈ ముప్పది మందిలోను ఏ పదిమందవో మాత్రమే శాసనములు దొరికినవి. తక్కిన ఇరువదిమందివి పేర్లు తెలియును కాని వారినిగూర్చిన యితర విశేషము లేవియు దెలియవు. శాసనములు దొరకలేదు కాని యీ సాతవాహన కులజుల నాణెములు మాత్రము పందలకొద్ది దొరకినవి. ఆంధ్ర రాజ్య స్థాపనము క్రీస్తుకు పూర్వము మూడవ శతాబ్దిలో జరిగినట్లు ఊహింప దగియుండుట చేత ఇంచుమించుగా క్రీస్తుశకము 220 ప్రాంతమువఱకు ఆంధ్ర సాతవాహనులు రాజ్యము చేసిరని చెప్పవలసి యుండును.

ఆంధ్రరాజ్యమును స్థిరముగా స్థాపించి దానిని తూర్పున బంగాళాఖాతము నుండి పడమట పడమటి కనుమల వఱకు వ్యాపింపజేసిన కీర్తి శ్రీముఖుని సోదరుడు కృష్ణభూవరునిదియు, శ్రీముఖుని కుమారుడు శ్రీసాతకర్ణిదియును. సాతవాహన నరపతులలో మూడవవాడయిన శ్రీసాతకర్ణికి వైదికమతాభినిరతి మెండు. ఇతడు తన యధికారమును ఉత్తర, దక్షిణ దిశల నింకను వ్యాపింపజేసిన కారణముననేమో తద్విజయ సూచకముగ రెండశ్వమేధ యాగములను రాజసూయ యాగమును జేయుటయే కాక ఇతర క్రతువు లనేకములు చేసెను. పూర్వోక్త నృపతుల కార్యదీక్ష వలన రూపొందిన ఆంధ్రరాజ్యము కాలక్రమమున విస్తరించి దక్షిణదేశములోనే కాక ఉత్తరమున మగధవఱకు వ్యాపించినది. ఆంధ్రభూమీశ్వరులు ఉత్తర హిందూదేశమునుగూడ జయించి మగధకేలికలై యా రాజ్యమునకు రాజధానియైన పాటలీపుత్రము కోటలో పాగావేసిరి. ఈ మగధ విజయము సత్యమే యయినను మగధను జయించిన ఆంధ్ర సాతవాహన రాజెవ్వరో, ఆంధ్రు లెంతకాలము మగధను పరిపాలించిరో, మగధాధిపత్య మేకారణముల వలన ఏ పరిస్థితులలో ఎప్పుడు చేయిజారి పోయినదో ఇప్పటికి తేలని చారిత్రిక విషమ సమస్యలు.

సాతవాహన భూవరులలో పదునేడవ రాజు హాలుడు సాహిత్యప్రియుడై కవి పండితుల కిచ్చిన ఆదరణమువలన భారత వాఙ్మయ చరిత్రలో చాల ప్రసిద్ధినందెను. ఆతని కొలువుకూటము ప్రాకృత భాషా కవీశ్వరులతో కిటకిటలాడుచుండెను. తాను తన పూర్వులు తన యాస్థానమునకు వచ్చుచుండునట్టి, ఆస్థానములో నున్నయట్టి ప్రాకృత భాషాకవులు చెప్పిన పద్యములలోనుండి ఏడువందల నేరి హాలమహారాజు సంకలితము చేసెను. అందువలన ఆతడు సంకలితముచేసిన యాగ్రంథమునకు గాథా సప్తశతి (సత్తసయి) అని పేరు. భారతీయ వాఙ్మయ పరిణామ చరిత్రములోనే హాలమహారాజు రాజ్యపరిపాలనకాలము ఒక చిరస్మరణీయమయిన ఘట్టము. ఈ మహారాజు కాలమునుంచియే దక్షిణాపథమున ప్రాకృతభాష కాదరముతగ్గి సంస్కృతమున కాదర మెక్కువయినది. శర్వవర్మ గుణాఢ్యులు హాలుని మంత్రులు. శర్వవర్మ కాతంత్రియను సంస్కృత వ్యాకరణమును, గుణాఢ్యుడు బృహత్కథ యను ప్రాకృతభాషా కథాకోశమును రచియించిరి. కాతంత్రవ్యాకరణమున కిప్పటికి కాశ్మీరము మొదలైన చోట్ల ప్రచారమున్నది. బృహత్కథలో చాలభాగము నష్టమయినది; మిగిలినది సంస్కృతానువాదము రూపమున నున్నది.

హాలుని తరువాత సాతవాహనులలో ప్రసిద్ధుడయిన మహారాజు ఇరువదిమూడవ వాడయిన గౌతమీపుత్ర సాతకర్ణి. ఇప్పటివఱకు తెలిసిన వృత్తాంతము ననుసరించి సాతవాహన భూపతులందఱిలో ఇతడు చాల గొప్పవాడు. ఇతని కాలమునాటికి యవనులు, శకులు, పహ్లవులు అను జాతులవారు పశ్చిమమున పారసీకము (పెర్షియా) గుండా ఉత్తరమున పంజాబుకు వచ్చి, అక్కడినుండి తండోపతండములుగా పశ్చిమ సముద్ర తీరముననే వ్యాపించి దక్షిణాపథములోని ఆంధ్ర రాజ్యమున కుపద్రవకారులయిరి. పశ్చిమ సముద్ర తీరమున శక, పహ్లవ రాజ్యములు స్థాపితములైనవి.

ఈ యవన, శక, పహ్లవ విజృంభణమువలన ఆంధ్ర రాజ్యమునకు గొప్ప దెబ్బతగిలినది. వర్ణవ్యవస్థ చెడి వర్ణసంకర మధికమయినది. ఆంధ్రరాజ్య మనేకవిధముల నష్టముపాలయినది. సరిగా ఈ సమయముననే రాజ్యమునకు వచ్చినాడు గౌతమీ పుత్ర శ్రీశాతకర్ణి. ఇతడు క్షత్రియుడై ఆ విపత్కరసమయమున యవనశక పహ్లవాద విజృంభణము నరికట్టి వారి నోడించి యంధ్రరాజ్యమును ఆంధ్రజాతిని కాపాడెను. నష్టమయిన రాజ్యవిభాగమును మరల సంపాదించుటయే కాక పరరాజ్యములనుగూడ ఆక్రమించుకొని ఆంధ్రమును గొప్ప సామ్రాజ్యము కావించిన జాతీయ శిరోమణి, వర్ణసంకరమునాపి సంఘవ్యవస్థను పరిరక్షించిన ధర్మరతుడు గౌతమీపుత్ర శ్రీశాతకర్ణి. ఇతనికాలమున ఆంధ్రసామ్రాజ్యమునకు ఉత్తరమున రాజపుత్రస్థానమును దక్షిణమున మైసూరును తూర్పున బంగాళాఖాతమును పశ్చిమమున అరాబియాసముద్రమును సరిహద్దులయినవి. ఇతనికుమారుడు వాసిష్ఠీపుత్ర శ్రీ పులుమావి కాలములో శకభూపతులు మరల విక్రమించి తాము గోల్పోయినరాజ్యమును సంపాదించుకొనుటయేగాక ఆంధ్రసామ్రాజ్యములోని పశ్చిమోత్తర ప్రాంతములను కొన్నిటి నాక్రమించుకొనిరి.

ఈ వంశములోని ఇరువదియేడవ రాజగు గౌతమీపుత్ర శ్రీ యజ్ఞశాతకర్ణి ఆంధ్రసామ్రాజ్యమును పూర్వపుస్థితికి తీసికొనివచ్చుటకు ప్రయత్నించి కొంతవరకు కృతకృత్యుడయ్యెను కాని పూర్తిగా సఫలీకృత మనోరథుడు కాలేకపోయెను. అప్పటికే యంధ్ర రాజ్యవైభవ ప్రాభవములు వసంతశోభ దిగజారినట్లు దిగజారిపోయినవి. తరువాతి శాతవాహన మహీపతులకు మిగిలినదియెల్ల దక్కను ప్రాగ్భాగమునందలి రాజ్యమే. పశ్చిమదిశను వారు తమరాజ్యమును గోల్పోయినను అంతకు చాలకాలమునకు పూర్వము నుంచియున్న పూర్వ సముద్రాధిపత్యమునుమాత్రము గోల్పోలేదు. హిందూదేశమంతటిలో సముద్రాధిపత్యము వహించిన ధరణీశ్వరులు ఆంధ్ర శాతవాహనులే. ఓడ ముద్రగల వీరి నాణెములు వీరి సముద్రాధిపత్యమునకు సూచకమయినవి చాల దొరికినవి. వీటిలో యజ్ఞశాతకర్ణి వధికము. ఇతని తరువాత ఇద్దఱుముగ్గురు పరిపాలించిరి. కాని అప్పటికే యంధ్రసామ్రాజ్యము క్షీణదశ యారంభమయినది. కడపటి శాతవాహన భూవరుడు మూడవ పులుమావికాలములో క్రీ. శ. 220 ప్రాంతమున అది పూర్తిగా భగ్నమయినది. అంతటి దీర్ఘకాలము రాజ్యాధికారమును హస్తగతము చేసికొన్న ఆంధ్ర శాతవాహనుల రాజ్య మెందువలన నెట్లు భగ్నమయినదో తెలియదు.

ఆంధ్రులు దక్కనులో మొదటి గొప్పసామ్రాజ్యమును వెలయించి దాక్షిణాత్య సంస్కృతిపటమునకు తంతువులు వేసిరి. వారు వేసిన పునాదుల మీదనే దాక్షిణాత్యజాతులు తరువాతి కాలములో తమతమ సంస్కృతులను పెంపొందించుకొనిరి. శాతవాహనులు కళలను ప్రోత్సాహమిచ్చి యాదరించిరి. భోపాలు సంస్థానములోని సాంచీస్తూప ప్రాకారపు ద్వార తోరణములును, నాసిక, కన్హేరి, కార్లా మొదలైన చోట్లనున్న గుహాలయ చైత్యాలయములును వారి ప్రోత్సాహమున నిర్మితము లైనవే. ఇవి వారి కాలమున శిల్పమును, గుహాలయ భవననిర్మాణ కళయు ఎట్టి యభివృద్ధి దశలో నుండెనో తెలియజేయగలవు. వారు వైదిక మతావలంబకు లైనను బౌద్ధ జైనములకు, అందును ముఖ్యముగా బౌద్ధమునకు అనికాదరాభిమానములు చూపి పోషించిరి. పూర్వోక్తములైన గుహాలయములు వర్షకాలము నాలుగునెలలును గడపుటకు బౌద్ధ భిక్షువుల నిమిత్తము నిర్మించినవి. ఈ కాలపు బౌద్ధనిర్మాణములలో స్తూపము ప్రధాన్యము వహించిన దగుటచేత ఆంధ్రదేశమున చాలప్రాంతముల బౌద్ధసంఘారామములలో స్తూపములు వెలసినవి. రాజుకొండ, నాగార్జునునికొండ, ధనకటకము, భట్టిప్రోలు, ఘణిగిరి మొదలైనవానాటి ప్రసిద్ధ బౌద్ధక్షేత్రములు. శాతవాహనుల కాలమున తూర్పుపడమటి దేశములతో వర్తకవ్యాపారము విరివిగా సాగుచుండెను. పడమట రోముదేశముతో సన్నని మల్లుసెల్లాలు మొదలైన వాటితో గొప్ప వర్తకము సాగినకారణమున రోమను చక్రవరుల బంగారు నాణెములు మన యంధ్రదేశమున చాలచోట్ల దొరికినవి. తెలంగాణాలోని కొండాపురము ఆంధ్ర శాతవాహనుల టంకశాల నగరము. ఈ రాజుల కాలముననే వేఱువేఱు దినుసుల వ్యాపారముచేయువారు వేఱువేఱు వ్యాపారసంఘములుగ గూడి వ్యాపారాభివృద్ధి చేయుచుండిరి. ఈ వ్యాపార సంఘమించుమించుగ ఇప్పటి ట్రేడ్ యూనియనుల వంటివి. బౌద్ధ సంఘారామములు ప్రఖ్యాత విద్యాసంస్థలై విద్యార్థులకు విద్యాప్రదానము కావించుచుండెను. ఈ విధమున ఆంధ్రశాతవాహనుల కాలమున దేశ మన్నివిధము

లనభివృద్ధినొందెను. అంతవరకు చెల్లాచెదరైయున్న సాంఘికశక్తుల నన్నిటిని సమీకరించి ఆంధ్రసంఘమునకొక సువ్యవస్థ చేకూర్చినవారు ఆంధ్రసాతవాహన భూపతులు.

## అజ్ఞాతయుగము

ఆంధ్రసామ్రాజ్యము భగ్నమయిన పిదప దానికి తూర్పు, పడమటి, దక్షిణపు కొనలనుండు దేశములలో వేఱువేఱు వంశములలోనుంచి పరాక్రమవంతులైన నాయకులు బయలుదేఱి వేఱువేఱు స్వతంత్రరాజ్యములను మఱచుకొని పరిపాలనముసాగించిరి. కాని దాని మధ్య ప్రాంతమగు ఇప్పటి హైదరాబాదు రాజ్యమును గుఱించి మాత్రము మనకేమియు దెలియదు. క్రీస్తుశకము మూడవ శతాబ్ది మొదలు రెండు మూడు వందల సంవత్సరముల కాలము ఈ ప్రాంతపు చరిత్ర అందుచు తెలంగానా చరిత్ర బొత్తుగా తెలియదు. ఈ ప్రాంతముల నివసించుచుండిన నలులు, రాష్ట్రకూటులు మొదలైన జాతులవారు ఒకవేళ ఈ కాలమున చిన్న సంస్థానములు కట్టుకొని పాలించుచుండిరేమో. వాతాపియనబడు విజాపురము జిల్లాలోని ఇప్పటి బాదామిని రాజధాని జేసికొని చాళుక్యవంశజులు రాజ్యాధికారము చిక్కబట్టువఱకు మనకు తెలంగానా చరిత్ర అజ్ఞాతయుగమనియే చెప్పవలెను.

## వాతాపి చాళుక్యులు

అజ్ఞాత యుగమునకు పిదప తెలంగానా చరిత్ర మఱల క్రీ. శ. ఆఱవ శతాబ్దిలో చాళుక్యులతో ఆరంభమగుచున్నది. వీరి ఉనికి మనకు మొదటిమారు నాగార్జునుని కొండ శాసనముల వలన దెలియుచున్నది. ఆశాసనములలో ఈ వంశముపేరు చలికియని కలదు. చలికి, సలుక్కి, చలుక్య, చళుక్య, పదములన్నియు ఈ చాళుక్యవంశము పేరు రూపాంతరములే. ఈవిషయము కీ. శే. శ్రీ కొమఱ్ఱాజు లక్ష్మణరావుగారు రచించిన చాళుక్యులు దాక్షిణాత్యులే యను వ్యాసము వలన దెలియగలదు. ఈ వంశము పేరు నాగార్జునుని కొండ శాసనములలో కనబడుటవలన వీరు ప్రాయికముగ తెలుగువారగుదురేమోయని యొక యూహ. కాని వారి రాజధాని వాతాపి కన్నడ దేశములో నుండుటవల్లను, శాసనములందు వారు కన్నడభాషనే యుపయోగించుచు వచ్చియుండుటవలనను మొదటవారు తెలుగుదేశములోని వారయినను కాలక్రమమున పశ్చిమదిశ కరిగి కన్నడ దేశమునందే స్థిరపడి కన్నడులైరని యెంచవచ్చును.

రాజ్యాధికారము వహించి ఈ వంశమునకు ప్రతిష్ఠ తెచ్చిన మొట్టమొదటి చారిత్రిక పురుషుడు మొదటి పులకేశి. ఇరుగు పొరుగులనున్న రాజులను జయించి అశ్వమేధయాగముచేసి రాజకీయముగ ఈ వంశమునకు కీర్తి తెచ్చిన మొదటి భూపతి యితడు. ఇతని కుమారులు కీర్తివర్మ, మంగళేశ మహీపతులు సమర్థులేయైనను ఇతని మనుమడును, కీర్తివర్మకుమారుడును అయిన రెండవ పులకేశియే చాళుక్య సంస్థానమును పూర్వపశ్చిమ సముద్రముల వఱకు విస్తరింపజేసి దక్షిణహిందూదేశమున ప్రధానమయిన గొప్ప రాజ్యముగ చక్కదిద్దెను. దిగ్విజయానంతర మితడు, సత్యాశ్రయ పృథ్వీవల్లభ బిరుదమును దాల్చిన పరమమాహేశ్వరుడు. ఉత్తరాపథేశ్వరుడయిన హర్షుని కితడు సమకాలికుడు. హర్షచక్రవర్తి దక్షిణాపథమును జయింపవలెనని సేనాసమేతుడయి దండెత్తిరాగా రెండవ పులకేశి మహారాజు ఆతని నోడించి యాతని బిరుద లాంఛనములను ఒడిచికొని యాతనిని తఱుమ గొట్టెను. ఆకాలములో కళింగమునకు దక్షిణముననున్న సముద్రతీరస్థ ఆంధ్రదేశమునకు వేంగియని పేరు. కళింగమును వేంగిని జయించిన పిదప రెండవ పులకేశి మహారాజు యువరాజుగా నుండిన తన సోదరుడు విష్ణువర్ధనుని ఆదేశములకు తన ప్రతినిధిగా నియమించెను. కొంతకాలమయిన పిదప విష్ణువర్ధనుడు స్వతంత్రుడై వేంగీకళింగములను పరిపాలించెను. ఈతనికి గూనుండుట వలన కుబ్జవిష్ణువర్ధనుడని పేరు కలిగెను. ఈతని సంతతివారికి వేంగీ చాళుక్యులనియు, తూర్పు (పూర్వ)చాళుక్యులనియు పేరు. కుబ్జవిష్ణువర్ధనుని తరువాతనుంచి అతని సంతతివారు వేంగిదేశమున కేలికలైరి. వారికిని వాతాపి చాళుక్యులకును సంబంధమే లేకపోయెను. రెండవ పులకేశి దిగ్విజయయాత్రలో వాతాపి చాళుక్యులకు కాంచీపురపు పల్లవరాజులతో ఆరంభమైన చాళుక్య-పల్లవ సంగ్రామములు క్రమముగా అతిశయించి, కొంచెమించుమించుగ ఈ వంశ మంతరించువఱకు సాగుచునే వచ్చినవి. విజయ మెప్పుడును ఒక్క పక్షముననే నిలుకడగ నుండదయ్యెను. పులకేశి తనయుడు మొదటి విక్రమాదిత్య భూపతియు, అతని మునిమనుమడును మొదటి విజయాదిత్యుని కొడుకును అయిన రెండవ విక్రమాదిత్య రాజేంద్రుడును ఈ వంశమువారిలో రెండవ పులకేశికి పిదప చెప్పుకొనవలసిన ముఖ్య

భూవరులు. రెండవ విక్రమాదిత్యుని కొమారుడు రెండవ కీర్తివర్మ కాలములో వాతాపి చాళుక్యరాజ్య మంతరించినది. వాతాపి చాళుక్యరాజ్య పతనమునకు కారకుడు రాష్ట్రకూటవంశజుడయిన దంతిదుర్గుడు. ఇతడు రాజ్యాధికారము హస్తగతము చేసికొని రాష్ట్రకూట రాజ్యమునకు స్థాపకుడయ్యెను.

ఆంధ్ర సాతవాహనులకు పిదప తెలంగానాను పాలించినట్లు స్పష్టముగా తెలిసిన రాజవంశము వాతాపి చాళుక్యులదే. వీరి కాలములోనే బౌద్ధమతము క్షీణదశకు వచ్చినది; వైదికమత మభివృద్ధి నొందినది. వేలువేలు పేర్లతో పౌరాణిక దేవతలయిన బ్రహ్మ విష్ణు మహేశ్వరులకు దేవాలయములు నిర్మితములయినవి. వైదిక మతముతోపాటు ప్రబలిన మరియొక ధర్మము జైనము. ఇది యీ వంశము కడపటి కాలమున చాళుక్య రాజన్యులిచ్చిన యాదర ప్రోత్సాహముల వలన నభివృద్ధి చెందినది. రెండవ విక్రమాదిత్యుని పితామహుడు వినయాదిత్యుడు జైన మతాభిమాని. ఇతనికి నిరవద్య పండితుడను జైనాచార్యుడు ఆధ్యాత్మిక గురువట. రెండవ విక్రమాదిత్యుడును, ఇతని తండ్రి విజయాదిత్యుడును కూడ జైన మతాభిమానులై జినభవనములను జైనాచార్యులకు దానధర్మములు చేసినవారే. క్రీస్తుశక మేడవ శతాబ్దిని హిందూదేశమున కేతెంచిన చీనా యాత్రికుడు యువాన్‌చాంగ్ రెండవ పులకేశి కాలమున దక్షిణాపథమునకు వచ్చి తెనుగుదేశమును సందర్శించి యందలి ధాన్యకటకాది ప్రసిద్ధ బౌద్ధ సంఘారామములలో కొంతకాలము నివసించి బౌద్ధ ధర్మగ్రంథముల నధ్యయనము చేసెను. ఆనాటి మన తెలుగుదేశమును గురించి వ్రాసిన విదేశ యాత్రికులలో యువాన్‌చాంగే మొదటివాడు. వాతాపి చాళుక్యుల కాలములో దేవహర్మ్య వాస్తు, శిల్ప, చిత్రకళలు బాగుగా వర్ధిల్లినవి. పారసీకపు రాజు నొద్దనుండి రెండవ పులకేశి మహారాజు కొలువు కూటమునకు వచ్చిన రాయబారము అజంతా మొదటి గుహలో చిత్రితమయినదని కొందరి యభిప్రాయము. అజంతా బౌద్ధగుహలు శిల్పమునకు వర్ణచిత్రములకు కూడ పేరొందినవి. వాతాపి, దానికి సమీపముననున్న పట్టదకల్లు, అయ్యావళి ( Aihole ) నగరములలోని దేవాలయములు వాతాపి చాళుక్యుల కాలమునాటి దేవహర్మ్య వాస్తువున (Architecture) కుదాహరణములు.

## మాన్యకేటము రాష్ట్రకూటులు

చాళుక్యులకు పిదప తెలంగానాను పరిపాలించినవారు రాష్ట్రకూట వంశజులు. రాష్ట్రకూట రాజ్య స్థాపకుడు దంతిదుర్గరాజు జయింపగా మిగిలిన చాళుక్యరాజ్యమును ఇతని పినతండ్రి మొదటి కృష్ణరాజు తనయధికారము క్రిందికి తెచ్చుకొని రాష్ట్రకూట రాజ్యమును విస్తరింప జేసెను. ఇతని బాహు పరాక్రమమువలన దక్షిణాపథములో రాష్ట్రకూట రాజ్యము సుస్థిరముగా నేర్పడుటయే కాక అది దక్షిణ హిందూదేశములోని ప్రధాన రాజ్యములలో నొకటియైనది. తూర్పున వేంగీ చాళుక్య రాజ్యమును, దక్షిణమున కాంచీపుర పల్లవ, తలకాడు నగరపు పశ్చిమ గాంగరాజ్యములును రాష్ట్రకూట రాజ్యమునకు సమకాలికములు. తమ రాజ్యమును విస్తరింప జేసికొనుటలో రాష్ట్రకూటులకును పూర్వోక్త రాజ్యముల వారికి నెడతెగని యుద్ధములు జరిగినవి. రాష్ట్రకూటులకును వేంగీ చాళుక్యులకును, రాష్ట్రకూటరాజ్య మంతరించువరకును తెంపులేకుండ జరిగిన సంగ్రామములు మొదటి కృష్ణరాజు (క్రీ. శ. 765-790) కాలమునుంచియే మొదటి మూడవగోవింద, నృపతుంగుల కాలమునుంచి హెచ్చిపోయిన రాష్ట్రకూట-వేంగీచాళుక్య సంగ్రామములలో ఒకదానికి ద్వాదశవర్ష సంగ్రామమని పేరు. ఇది పూర్వ చాళుక్య నృపతి నరేంద్ర మృగరాజ రెండవ విజయాదిత్యుని కాలమున సాగినది. దీనివలన ఈ యుద్ధములెంత దీర్ఘకాలము ఎంతభయంకరముగ సాగుచుండెడివో తెలియగలదు. రాష్ట్రకూట వంశజులలో మొదటి కృష్ణరాజు మనుమడును, ధ్రువరాజుకుమారుడును అయిన ముమ్మడి గోవిందరాజును (క్రీ. శ. 793-815), ఇతని తనయుడు శర్వ నృపతుంగభూనాథుని ప్రపౌత్రుడు మూడవ ఇంద్రరాజును (క్రీ. శ. 912-917), అత్యంత శౌర్య పరాక్రమోపేతులు. వీరు దక్షిణ హిందూదేశములోని రాజ్యములనేకాక ఉత్తరాపథ దేశములమీదకూడ దండెత్తి విజయములను చేకొనిరి. రాష్ట్రకూట రాజులందరకు వర్షాంచితములయిన నామాంతరములున్నవి. మొదటి కృష్ణరాజునకు అకాలవర్షుడని, అతని కుమారుడు ధ్రువరాజునకు (క్రీ. శ. 780-79.) ధారావర్షుడని, ముమ్మడి గోవిందభూవరునికి ప్రభూతవర్షుడని, ఇతని కుమారుడు నృపతుంగునికి (క్రీ. శ. 815-877) అమోఘవర్షుడని ఇతని తనయుడు రెండవ కృష్ణరాజునకు (క్రీ. శ. 8-80

912) అకాలవర్షుడని, మూడవ ఇంద్రరాజునకు నిత్య వర్షుడని నామాంతరములు. ఈ రాజన్యులలో నృపతుంగ అమోఘవర్షుని కాలమునుంచి రాష్ట్రకూటరాజులకు ఇప్పుడు మాల్ ఖేడ్ అని వ్యవహరింపబడుచున్న మాన్యఖేటము రాజధానియైనది. రాష్ట్రకూటులలో కడపటి గొప్పరాజు మూడవ కృష్ణనరేంద్రుడు. మూడవ ఇంద్రరాజు సోదరునికుమారుడు. ఇతనికికూడ అకాలవర్షుడని నామాంతరము. ఇతని కాలమునాటికి కాంచీపుర పల్లవరాజ్య మంతరించి యది తంజావూరి చోళ భూనేతల వశమయినది. విజయాలయుడే చోళ వంశమునకు మూలపురుషుడు. విజయాలయ తనూజుడు మొదటి ఆదిత్యచోళరాజును, ఇతని కొడుకు మొదటి పరాంతక చోళరాజును చోళాధికారము పెంపొంది సుస్థిరముగా ప్రతిష్ఠించిన మొదటి భూవరులు. వేంగీ చాళుక్య రాజ్యమును పాలించుచుండిన రెండవ అమ్మరాజ విజయాదిత్యుడును, చోళరాజ్యాధిపతి మొదటి పరాంతక చోళుడును మూడవ కృష్ణరాజునకు సమకాలికులు. ఈతడు చోళ రాజ్యముపై దండెత్తివెళ్లి ఆరాజ్యములోని తొండ మండలము నాక్రమించుకొనెను. చివరి రాష్ట్రకూట నృపతి రెండవ కర్కరాజు. ఇతనిని క్రీ. శ. 973 లో కూలద్రోసి చాళుక్య వంశజుడైన రెండవ తైలపదేవ రాజు మఱల చాళుక్య రాజ్యమును స్థాపించెను. తైలపుని సంతతివారికీ హైదరాబాదు రాజ్యములోని కల్యాణి నగరము రాజధాని. వీరికి చరిత్రలో కల్యాణి చాళుక్యులనియు, కుంతలదేశాధిపతులగుటచేత కుంతల చాళుక్యులనియు, తూర్పుననున్న చాళుక్యులకు ప్రతిగా పడమటి రాజ్యమునుచేసిన వారగుటచేత పశ్చిమచాళుక్యులనియు వ్యవహారము కలదు.

హైదరాబాదు రాజ్యమునందలి ఏలోరా (Ellora) లోని అత్యద్భుతమైన శిలావచ్ఛిన్న కైలాసనాథాలయము రాష్ట్రకూట మొదటి కృష్ణరాజు కాలములో నిర్మించినది. విస్తృతమైన ఈ యాలయమునంతను కొండనుదొలిచి చేసినారు. ఇందలి శిల్పమును నిర్మాణ విధానమును అత్యద్భుతములైనవి. ఇది యొక్కటి తక్క రాష్ట్రకూటనృపతులు కట్టించిన ఇంతప్రసిద్ధములైన యితరాలయము లేవియు లేవు. వారు కళలకు కంటె మతమున కధికాదరప్రోత్సాహము లిచ్చిరి. వీరి యాదరాభిమానముల వర్ధిల్లిన ధర్మసంప్రదాయము జైనము. వాతాపిచాళుక్యుల చివరికాలమునుంచి రాష్ట్రకూట రాజ్యపరిపాలన కాలము చివరివఱకు నదియవిచ్ఛిన్నముగ ప్రబలినది. నృపతుంగ అమోఘవర్షుడు జైనమతావలంబకుడు. వార్ధక్యదశలో ఇతడు రాజ్యభారమును తన తనయుడు రెండవ కృష్ణరాజుపైమోపి తన జీవితావశేష కాలమును ధార్మికచింతలో గడపెను. ఇతని గురువు జినసేనాచార్యుడు. కన్నడములోని సుప్రసిద్ధమయిన కవిరాజమార్గమను ఛందోలక్షణగ్రంథమును సంస్కృతమున ప్రశ్నోత్తరరత్నమాల యను గ్రంథమును నృపతుంగ విరచితములు. నృపతుంగుడొక్కడేకాదు, రాష్ట్రకూట నృపతు లనేకులు జైనమతాభిమానులు. వీరు జినధర్మము నాదరించి జినభవనములకు జైనాచార్యులకు అనేక గ్రామములను దానముచేసిరి. క్రీస్తుశకము తొమ్మిదవ శతాబ్ది ఉత్తరార్థమునను, పదవశతాబ్దిని కన్నడదేశమున జైనము ముమ్మరముగ వ్యాపించుటకు రాష్ట్రకూట నరేశ్వరుల అభిమానౌదార్యములే కారణము. జైనులు విద్యాప్రియులు, సర్వశాస్త్ర పారంగతులు. ఈ కారణమున జైనవసతులు (బస్తీలు) ఆరామసంఘారామముల వలెనే గొప్ప విద్యాసంస్థలైనవి. కన్నడ వాఙ్మయ నిర్మాతలు జైనులు. కన్నడ వాఙ్మయమున త్రిరత్నములని వ్యవహరింపబడు పొన్న, పంప, రన్న కవులలో మొదటి యిద్దరును వేంగిదేశీయులు. పొన్నడు రాష్ట్రకూట మూడవ కృష్ణరాజ దేవుని యాస్థానము నలంకరించిన మహాకవి. సంస్కృత, కర్ణాటభాషలు రెంటను సరిసమానముగ కవిత్వము చెప్పగల నేర్పరి యగుటచేత ఇతనికి కృష్ణరాజు (క్రీ. శ. 939-968) ఉభయకవి చక్రవర్తియను బిరుద మొసంగెను. ఇతడు కన్నడమున రచించిన ఉద్గ్రంథము పదునాఱవ తీర్థంకరుని చరిత్రమైన శాంతిపురాణము. కృష్ణభూపతికి సామంతులైన వేములవాడ చాళుక్యుల యాస్థానాలంకారము పంప మహాకవి. ఆది పంప కవియనియు నితనికి నామాంతరము. ఇతని నాదరించిన, వేములవాడ చాళుక్య భూమీశుడు రెండవ అరికేసరి ఆదిపురాణ, విక్రమార్జున విజయములు పంపకవి రచియించిన గ్రంథములు. వీనిలో మొదటిది మొదటి తీర్థంకరుని చరితము. రెండవ గ్రంథమునకు పంప భారతమని నామాంతరము. మూడవ కృష్ణుని సామంతులైన వేములవాడ చాళుక్య నృపాలురు కవిపండిత పోషకులు. వీరిలో కడపటివాడును, రెండవ బద్దెన భూపతి కుమారుడును అయిన నాలుగవ అరికేసరి మహీపాలుడు సోమదేవ సూరియను నొక జైన మహాకవి నాదరిం

# సుజాత

## జన్మదిన ప్రత్యేక
## తెలంగాణా సంచిక

సంపాదకుడు:
గడియారం రామకృష్ణశర్మ

ఆగష్టు 15
1951

శా॥ శ॥ ౧౮౭౩
ఖర శ్రావణము

విడిప్రతి
1-0-0

చెను. సోమదేవ సూరి విరచయితములైన గ్రంథములలో యశస్తిలక చంపువు ప్రసిద్ధమైనది. దీని నతడు మూడవ కృష్ణభూపతి తొండమండలమున విజయయాత్ర సాగించుచుండిన కాలమున క్రీ. శ. 959 లో రచియించెను.

## కల్యాణి చాళుక్యులు

క్రీ. శ. 973 లో చాళుక్య రాజ్యమును స్థాపించిన రెండవ తైలపదేవునికిని వాతాపి చాళుక్యులలో కడపటివాడయిన రెండవ కీర్తివర్మకును ఎట్టిసంబంధమున్నది తెలియదు కాని కుదురుమాత్ర మొక్కటే. తైలపదేవుడు తిలింగాధిపతియట. రాష్ట్రకూటనృపతులకు సామంతుడై యతడు తిలింగము (తెలంగాణా) పరిపాలించి యుండవచ్చును. ఇతనికి సత్యాశ్రియ, దశవర్మలని ఇరువురు కుమారులు. సత్యాశ్రియుని కాలమునుంచి ఈ చాళుక్యులకును వేంగీ దేశాధినాథులకును వైరము పొడమి యుద్ధము ప్రారంభమయ్యెను. సత్యాశ్రియుని తమ్మునికొడుకు జయసింహుని నాటినుంచి కుంతల చాళుక్యులు జగదేకమల్ల, ఆవహామల్ల త్రైలోక్యమల్ల, భువనైకమల్ల, త్రిభువనమల్ల, భూలోకమల్లులని ఉపనామములు ధరించుచువచ్చిరి. జగదేకమల్ల జయసింహభూపతి కుమారుడయిన ఆహవమల్ల, త్రైలోక్యమల్ల బిరుదాంచితుడయిన మొదటి సోమేశ్వరరాజు క్రీ. శ. 1040 - 1069 తండ్రి తాతలు వేసిన పునాదులమీద, ఇంకను గొప్ప విజయములు సాధించి చాళుక్య రాజ్యసౌధమును విస్తరింపజేసెను. ఈ కాలముననే ఇరుగుపొరుగు రాజ్యములపై దండయాత్రలు సలిపి వాటిని జయించిరి. రాష్ట్రకూట దండయాత్రల ఫలితముగా సంకుచితమైన తంజావూరి చోళరాజ్యమును రాజరాజ చోళుడును, అతనికుమారులు రాజేంద్ర చోళ రాజాధి రాజాదులును పెంపొందించి మహా సామ్రాజ్యముగా వెలయించిరి. క్రీస్తుశకము పదవ, పదుకొండవ శతాబ్దులలో దక్షిణ హిందూదేశాధిపత్యమునకై పెనుగులాడిన రాజ్యములీరెండే - తంజావూరు చోళ, కల్యాణి చాళుక్యరాజ్యములు. సత్యాశ్రియుని నాటినుంచి ప్రారంభమైన కుంతల చాళుక్య-చోళ మహాసంగ్రామాగ్ని ఇంచుమించుగా రాజరాజాదుల చోళరాజ్య మంతరించు వఱకును ఆరిపోనేలేదు. హైదరాబాదు రాజ్యములోని నేటిరాయచూరు మహబూబునగరు నలగొండ ప్రాంతములు ఈ భయంకర చోళ-చాళుక్య సంగ్రామ రంగస్థలములు. ఈ సంగ్రామము లందలి విజయములకు ఫలితముగా ఇప్పటి రాయలసీమ ఒకప్పుడు చోళుల యధికారము క్రిందికిని మఱియొకప్పుడు చాళుక్యుల యధికారము క్రిందికిని వచ్చుచు తరచుగా చేతులుమారుచు వచ్చినది. కుంతల చాళుక్యు లందఱిలో చాలగొప్పవాడు. ఆవహామల్ల మొదటిసోమేశ్వరుని తనూజుడును, భువనైకమల్ల రెండవసోమేశ్వరుని సోదరుడును అయిన త్రిభువనమల్లవిక్రమాదిత్యమహారాజు(క్రీ.శ.1076-1127) ఇతనివంశమున ఈ పేరుగలరాజు లయిదుగురుండుట చేత ఇతనికి ఆఱవ విక్రమాదిత్యుడనియు వ్యవహారము కలదు. ఇతడు సింహాసన మెక్కినపిదప అంతకుపూర్వము వాడుకలోనుండిన శకమును దీసివేసి క్రొత్తగా తనపేర చాళుక్య విక్రమశకమనుపేర ఒక నూతనశకమును వ్యవహారమున ప్రవర్తింపజేసెను. నూతనముగ స్థాపితమైన ఈ శకములోని మొదటిసంవత్సరము క్రీ. శ. 1076కు సమానము. హొయసల బల్లాళులు, ఓరుగంటి కాకతీయులు- ఈ కుంతల చాళుక్యుల సామంతులే. పశ్చిమ చాళుక్యసామ్రాజ్యము ఈ యాఱవ విక్రమాదిత్యుని కాలములోనే చాల విస్తరించినది. ఈతనియాస్థానము నలంకరించిన సంస్కృతభాషామహాకవి బిల్హణుడు. ఇతడు తన పోషకుడైన విక్రమాదిత్యుని చరితమును విక్రమాంకదేవ చరితమనుపేర కావ్యముగ వెలయించెను. మితాక్షరయనుపేర ధర్మశాస్త్ర గ్రంథమును రచించిన విజ్ఞానేశ్వరుడును ఈ విక్రమాదిత్యుని కాలమువాడే. ఆఱవ విక్రమాదిత్యుని కాలమునాటికి చోళుల యధికార మడుగంటిపోయినది. వారి సామ్రాజ్యము వేంగిచాళుక్యనృపతి రాజరాజనరేంద్రుని కొడుకు మొదటి కులోత్తుంగ చోళదేవుని యధికారముక్రిందికి వచ్చెను. ఇతడు వేంగీ, చోళరాజ్యములు రెంటికి నేలికయై చోళరాజధాని గంగైకొండ చోళపురమునుండి వాటిని పరిపాలించెను. కాని కాలక్రమమున కాంచీపురము రాజ్యమున ప్రధాననగరమయినది. కులోత్తుంగ చోడదేవుని సంతతివారికి చరిత్రలో చాళుక్యచోళులని వ్యవహారము. వీరు వేంగిని సామంతమండలికుల యధీనముకావించి చోళదేశమునుండియే పరిపాలనము సాగించిరి. వేంగిని స్వాధీనము చేసికొనుటకు సత్యాశ్రయుని నాటినుంచి చాళుక్యులు చేసినప్రయత్నములు విక్రమాదిత్య త్రిభువనమల్లుని రాజ్యపాలనకాలము చివరి సంవత్సరములలో ఫలించి వేంగిదేశము కొంతకాలము కుంతల చాళుక్యుల యధికారము క్రిందికి వచ్చెను. కాని రాయలసీమ వలెనే అది యెంతకాల

మో వారిక్రింద నుండలేదు. విక్రమాదిత్య తనయుడు భూలోకమల్ల మూడవ సోమేశ్వరుడు. క్రీ. శ. 1127-1138 మధ్య వేంగిపై దండెత్తి దానిని స్వాధీనము చేసికొనెను. కాని అదియు తాత్కాలికమే యైనది. తండ్రివలెనే ఈ మూడవ సోమేశ్వరుడు కూడ చాళుక్య విక్రమ శకమును దీసివేసి తనపేర భూలోకమల్ల శకమని మరొక నూతన శకమును స్థాపించెను. కాని యిది కూడ చాళుక్య విక్రమ శకమువలెనే ఇతనితోనే యంతరించెను. ఈ మహారాజు సంస్కృత విద్యావిశారదుడు; అభిలషితార్థచింతామణియను పేరుగల ఒక విజ్ఞానసర్వస్వమును రచియించెను. ఈ గ్రంథమునకే మానసోల్లాసమనియు పేరు. ఇది యొక గొప్ప శాస్త్రగ్రంథము. తెనిగింప దగినది. భూలోకమల్లుని కాలము నాటికే దక్షిణమున ద్వారసముద్రపు హొయిసల బల్లాళులును, ఓరుగంటి కాకతీయులును ప్రబలులై స్వతంత్ర పరిపాలనము సాగించుచుండిరి. భూలోకమల్లునికి తరువాత వచ్చిన వారందరు బలహీనులు, అసమర్థులు. నష్టమయిన రాజ్యము పోగా మిగిలినది కాపాడుకొనుటకే వారికి చేతకాకపోయినది. తుదకు శేవుణులను నామాంతరముగల యాదవవంశ నృపతులు సయితము భిల్లమదేవుని నాయకత్వమున కుంతల చాళుక్యాధికారమును త్రోసిపుచ్చి ఇప్పుడు దౌలతాబాదనబడు దేవగిరిని రాజధాని చేసికొని స్వతంత్రులైరి. రాజ్యమునందలి రాజకీయ పరిస్థితుల పరిణామము నుపలక్షించి భూలోకమల్ల పుత్రుడయిన మూడవ తైలప దేవుని దగ్గర దండనాయకుడుగ నుండిన కళచురి వంశజుడు బిజ్జలుడు కొందఱితర సామంతుల సాయముతో, తన ప్రభువుపై తిరుగబాటు కావించి కల్యాణినగరము నాక్రమించుకొని కళచురరాజ్య స్థాపకుడయ్యెను. బసవేశ్వరుడు ఈ కళచురి బిజ్జలునికి మంత్రియు దండనాయకుడును. కడపటి కల్యాణి చాళుక్యక్షితీశ్వరులు చిన్న సంస్థానముల కధిపతులై కాలక్రమమున నామమాత్రావశిష్టులైరి.

కుంతల చాళుక్యులు మొదట జైనమతము నభిమానించి యాదరించినను తరువాత వారు శైవమతపక్షపాతులై ఆమతమునభివృద్ధికి చాలతోడ్పడిరి. రాష్ట్రకూట జననాథుల కాలమున దక్షిణహిందూదేశమున వ్యాపించిన శైవసంప్రదాయము కాలాముఖమునకు ఎక్కువ ప్రోత్సాహము నొసంగి త్రిభువనమల్ల ఆఱవ విక్రమాదిత్యులును వారి సామంతులును దానిని పోషించిరి. విక్రమాదిత్యుడు మొదట జైనమతాభిమానియే కాని తరువాత పరమమాహేశ్వరుడయ్యెను. ప్రభువు శేమతము నవలంబించిన వారి సామంతులును ఆమతము నవలంబించుట- నిర్బంధము కాదు కాని- సనాతనముగ వచ్చు నాచారము. కుంతలి చాళుక్య సామంత మండలేశ్వరులును తమ ప్రభువులవలెనే శైవమవలంబించి శివాచార్యులకును శైవమఠములకును గ్రామదానములు చేయుచు వచ్చిరి. జైనబౌద్ధములు వ్యాపించిన కాలములో వసతుల సంఘారామములవలెనే ఈనాడు శైవమఠములు విద్యాస్థానములును, 'దీనానాథజన రోగి జన రోగ భైషజ్యస్థానము'లు నైనవి. చాళుక్యులు దేవహర్మ్య నిర్మాణ (Architecture), శిల్ప, సంగీతనాట్యకళలకు చాలప్రోత్సాహమిచ్చిరి. తెలంగాణాలో కూడ కాలాముఖ శైవమున్నను కాలముగడచిన మీదట దానికంటెను ప్రబలిన శైవసంప్రదాయము పాశుపతము. చాళుక్యపరిపాలన కాలముత్తరార్ధములో పాశుపత, కాలాముఖ శైవసంప్రదాయము లమితవేగముతో వృద్ధినొందినవి. మహారాజుల ననుసరించి సామంత మండలేశ్వరులు కూడ చాల దేవాయతనములను గట్టించిరి.

## ఓరుగంటి కాకతీయులు

కాకతీయులు మొదట కుంతల చాళుక్యులకు సైన్యాధిపతులుగనుండి వారికితరులతో జరిగిన యుద్ధములలో తమ ప్రభువులకు విజయములు చేకూర్చి వారి మన్ననలకు పాత్రులైనవారు. చోళచాళుక్యాది సంగ్రామములలో వారీవిధమయిన సేవచేసెనందుకు సంతుష్టుడై ఆహవమల్ల త్రైలోక్యమల్ల మొదటి సోమేశ్వరమహారాజు మొదటి బేతరాజు కుమారుడైన మొదటి ప్రోలభూపతికి అనుమకొండ విషయమును ప్రసాదించెను. మొదటి ప్రోలరాజును, అతని కొడుకు రెండవ బేతరాజును గూడ చాళుక్యసామంతులుగనే యుండిరి. రెండవ బేతరాజు కొడుకు రెండవ ప్రోల భూపతి ఆఱవ విక్రమాదిత్యుని మరణాంతరము చాళుక్యాధికారమును ధిక్కరించి స్వతంత్రుడయ్యెను. ఇతడును ఇతని కుమారుడు రుద్రదేవరాజును చాల పరాక్రమవంతులు. తండ్రికొడుకు లిరువురును ఇరుగుపొరుగు రాజులను జయించి తమ యధికారమును విస్తరింప జేసికొనిరి. వీరు పరిపాలనము నెఱపునాటికి వేంగి యనబడు సముద్రతీరస్థ ఆంధ్రదేశము కాంచీపురపు చాళుక్య చోళులకు సామంతులుగ నుండిన మండలిక వంశజుల యధికారమున నుండెను. వేంగి దేశమును జయించుటకు కాకతి రుద్రదేవరాజు పలుమారులు ప్రయత్నించి దండ

యాత్రలు సలిపెను. కాని కార్యము లేకపోయెను. చివరికి కాకతి రాజుల యీ ప్రయత్నము క్రీ. శ. 1199 లో సింహాసన మెక్కిన రుద్రదేవరాజు తమ్ముని కుమారుడు గణపతిదేవ మహారాజు కాలములో సఫలమయి వేంగియంతయు కాకతీయాధికారము క్రిందికి వచ్చెను. అంతటితో నందు వేఱువేఱు ప్రాంతముల రాజ్యము చేయుచుండిన తెలుగు చోళరాజులందఱు గణపతిదేవునికి సామంతులైరి. వీరిలో తిక్కన సోమయాజి మహాకవిని పోషించిన నెల్లూరి ప్రభువు మనుమసిద్ధ చోళరాజొకడు. గణపతిదేవ మహారాజు రాజధాని ఏకశిలానగర మనబడు ఓరుగల్లు. గణపతిదేవుడు కాకతి రాజన్యుల యధికారము ఉత్తరమున మధ్యప్రదేశ్‌లోని గోండ్వానా వఱకును, దక్షిణమున కాంచీపురము వఱకును, తూర్పున బంగాళాఖాతము నుండి పడమట హైదరాబాదు రాజ్యములోని బీదరు వఱకును వ్యాపింపజేసెను. ఆంధ్ర శాతవాహనులకు పిదప కళింగము దక్క ఆంధ్రదేశ మంతయు మఱల ఏకైక చ్ఛత్రము క్రిందికి వచ్చినది. గణపతిదేవుని కాలములోనే. తన సామ్రాజ్యపు దక్షిణపు సరిహద్దును కాపాడుకొనుటలో గణపతిదేవ మహారాజునకు దక్షిణమున ద్వారసముద్రము రాజధానిగ పరిపాలించుచుండిన హోయిసల బల్లాళ రాజులతోను, చాళుక్య చోళుల క్షీణదశలో విక్రమించి కాంచీపురము వఱకు విజృంభించిన మధురానగరపు పాండ్య మహీపతులతోను సంఘర్షణ మేర్పడినది. పాండ్యరాజ్య మెప్పుడును పరస్పర సహకారము చేసికొనుచు రాజ్యమేలు నయిదుగురు రాజులక్రింద నుండుటచేత వారికి పంచ పాండ్యులని వ్యవహారము కలిగినది. గణపతిదేవ మహారాజు అఱువదిరెండు సంవత్సరములు మహీపాలనము చేసి క్రీ. శ. 1260లో శివలోకమున కరిగెను. ఇతనికి పిదప ప్రసిద్ధులైన కాకతి భూనాథులిద్దఱు - గణపతిదేవ మహారాజు కూతుఱు రుద్రమదేవి (క్రీ. శ. 1260-1296) ఈమె యనంతరము ఓరుగంటి సింహాసన మెక్కిన ఈమె దౌహిత్రుడు వీర రుద్రదేవుడని సంస్కృత వాఙ్మయమున విఖ్యాతుడయిన ప్రతాప రుద్రదేవ మహారాజు (క్రీ. శ. 1296-1323). రుద్రమదేవి కాలములోనే మార్కోపోలో యను వెనీషియను యాత్రికుడు తెనుగుదేశములో ఆనాడు సుప్రసిద్ధమైన రేవుపట్టణము మోటుపల్లిలో ఓడదిగి ఆంధ్రదేశమును సందర్శించెను. సాలీని దారమునకంటెను సన్నని దారముతో నేయునట్టి ఉల్లిపొరమల్లు సెల్లాలకీదేశము ప్రసిద్ధి కెక్కినదనియు, ఇచట వజ్రాలు దొరకుననియు అతడు వ్రాసినాడు. సేవుణ దేశాధిపతియైన మహాదేవరాజు ఆంధ్రదేశముపై దండెత్తిరాగా అతని నోడించి తఱిమివేయుటయే రుద్రమదేవి రాజ్యపాలన కాలమునందలి రాజకీయ విశేషము. ఈమె తరువాత సింహాసనమెక్కిన ప్రతాపరుద్రదేవ మహారాజు ఆంధ్ర సామ్రాజ్యపు దక్షిణ సీమావధి కాంచీపురము పంచపాండ్యుల వశముకాగా దానిని తిరుగ సాధించుటకు దక్షిణ దేశముపై దండెత్తివెళ్ళి వారి నోడించి తిరుచినాపల్లి వఱకు తఱుముగొట్టెను. ఈతని కాలమునుంచియే ఆంధ్రదేశముపై ముసల్మాను దండయాత్రలు ప్రారంభము.

ఆంధ్రదేశమును సామంతరాజ్యముగ జేసికొనవలెనను తలంపుతో ఢిల్లీసుల్తానులు 1303 లో ఆంధ్రదేశముపై దండెత్తివచ్చిరి. ఇటువంటి దండయాత్ర లేడు జరిగినవని, ఇన్నితడవలును ప్రతాపరుద్రదేవమహారాజు వారినోడించి తఱుముగొట్టెనని, చివరి దండయాత్రలో ఆ మహారాజు దైవ దుర్విపాకమున పరాజితుడయి శత్రువులకు బందీగ చిక్కెనని హిందూ వృత్తాంతములు చెప్పుచున్నవి. ముసల్మానులు చేసిన యన్ని దండయాత్రలయందు ప్రతాపరుద్రదేవు డోడిపోయి కప్పముకట్టెనని ముసల్మాను చరిత్రకారులందురు. వారి వృత్తాంతముల ప్రకారమే మొదటి దండయాత్రలో ముసల్మానులు పరాజితులయినను ఆ సంగతిని వారు స్పష్టముగ జెప్పరు. అయితే చివరిమాఱు జరిగిన దండయాత్రకు పూర్వపుదానిలో అపజయము ముసల్మానులదని వారు స్పష్టముగా వ్రాసియున్నారు. ఎట్లయిననేమి దాదాపుగా పాతికసంవత్సరములు పోరాటము జరిగినమీద, ఘయాజుద్దీను తుగ్లకు ఢిల్లీసుల్తానుగా నున్నకాలమున అతని కుమారుడు ఉలుఘ్‌ఖాను నాయకత్వమున క్రీ. శ. 1323 లో జరిగిన కడపటి దండయాత్రలోకాని ఆంధ్రదేశము వారికి స్వాధీనముకాలేదు. ఆ సంవత్సరమున జరిగిన ఓరుగంటి మహాసంగ్రామములో ప్రతాపరుద్రదేవు డోడిపోయి శత్రువులకు ఖైదీగ చిక్కెను. దానితో ఆంధ్ర స్వాతంత్ర్యభాను డస్తమించెను. శత్రువులు ప్రతాపరుద్రదేవుని ఢిల్లీకి గొనిపోవుచుండగా మహాభిమానధనుడయిన యాతడు నర్మదానదీతీరమున ప్రాణత్యాగము చేసికొనెను. ఓరుగంటిపతనము క్రీ.శ. 1323 లో ఆంధ్రదేశము మొదటితడవ ముస్లిము పరిపాలన

క్రిందికివచ్చెను. ఉలుఘ్‌ఖాను పరిపాలననిమిత్తము అమీరులు మలికులు మొదలయినవారిని నియమించి ఢిల్లీకివెళ్ళి రెండేండ్లయనంతరము 1325లో మహమ్మదు బిన్ తుగ్లకు అను పేరుతో ఢిల్లీసింహాసన మెక్కెను.

కాకతీయులు మొదట జైనము నభిమానించినను రెండవ ప్రోలరాజు నాటినుంచి అందఱును శైవులే. వీరు శైవమున కధిక ప్రోత్సాహము నిచ్చిరి. వీరి కాలములో విరివిగా వ్యాపించిన శైవసంప్రదాయము పాశుపతము. కాకతి రాజన్యులు శివాచార్యులకు శైవ మఠములకు శివపురములను పేర అనేక గ్రామములను దానము చేసిరి. శైవమఠము లన్నియు విద్యాస్థానములే కాక వైద్యాలయములు కూడను. శైవమత వ్యాపనముతో బౌద్ధ జైనమతములడుగంటినవి. జైనమయినను ఇంకను కొంత కొన యూపిరితో నిలిచినది కాని బౌద్ధము పూర్తిగ నంతరించినది. కాకతీయులు సముద్రవర్తక వ్యాపారమునకును కళలకును పరిశ్రమలకును చాల ప్రోత్సాహ మొసంగిరి. వీరు బహుదేవాలయ నిర్మాతలు. ఈ కాలమున నాట్య సంగీతములు అభివృద్ధిగాంచినవి. కళలను వలెనే ఈ రాజచంద్రులు విద్యలను కూడ పోషించిరి. వీరి కాలమున వీరభల్లటదేశికుడు అగస్త్యుడు మొదలైన సంస్కృత భాషా పండితులు, కవులు నుండిరి. శాకల్యమల్ల కవియు ఈ కాలము వాడని చెప్పుదురు. వీరభల్లట దేశికుడు సర్వశాస్త్ర విశారదుడట. అగస్త్యమహాకవి సంస్కృతమున బాలభారతమును, నలకీర్తికౌముదియు రచించెను. ఇతనికే విద్యానాధుడని నామాంతరమనియు, ప్రతాపరుద్రయశోభూషణమను నలంకారశాస్త్ర మీతడు రచించినదే యనియు, చెప్పుదురు. కాకతి గణపతిదేవ మహారాజు గజసాహిణి జాయపసేనాని సంస్కృతమున నృత్తరత్నావళి రచించెను. గోన బుద్ధారెడ్డి రచియించిన రంగనాథ రామాయణమును, పాల్కురికి సోమనాధకవి రచియించిన బసవపురాణ, పండితారాధ్యచరిత్రములును ఈ కాలమున తెలంగాణాలో పుట్టిన ద్విపద కావ్యములు. ఈ కాలమున బుట్టిన మఱియొక యుద్గ్రంథము భాస్కర రామాయణము. ప్రతాపరుద్రదేవుడు తెనుగున గూడ నీతి సారమును రచించినట్లు చెప్పుదురుగాని యాగ్రంథ మింతవరకు కానరాలేదు. కాకతీయుల కాలమున వాడుకలోనికి వచ్చిన క్రొత్తయాచారము వీరపూజ. దేశక్షేమముకొఱకు, రాజకుటుంబమునకు ఆపద తొలగు నిమిత్తము, గ్రామారిష్టనివారణముకొరకు శైవ వీరులు మొఱ్ఱక్కొని తమ్ము తాము చంపుకొనుచు వచ్చిరి. అట్టి వీరులకు గుడులులేచి యందు పూజా పురస్కారములు జరుగుచువచ్చినవి. ఈ యాచారము కాకతీయులకు తరువాతి కాలమున ఇంకను వర్ధిల్లినది.

## ముస్లిం పరిపాలనము

సేవుణ రాజ్యమును జయించిన పిదప దేవగిరికి దౌలతాబాదని పేరుపెట్టినట్లే విజేతలు ఓరుగంటికి సుల్తానుపూరని పేరిడిరి కాని ఈ పేరు చాలకాలము నిలవలేదు. జయించిన దక్షిణ హిందూదేశ రాజ్యమునకు దౌలతాబాదు రాజధాని. అది ఢిల్లీ సుల్తాను ప్రతినిధి నివాసస్థలము. ఓరుగంటికి ఇతర ప్రాంతములకు పాలకులుగా నుండిన వారందఱికి అధిపతి దౌలతాబాదులోని రాజప్రతినిధి. క్రొత్తగా వచ్చిన ముస్లిముల పరిపాలనము జనుల కమిత బాధాకరమయినది. అందువలన ఈ పారతంత్ర్యమునుంచి దేశమును విడిపించుటకు దేశము తురకలకు స్వాధీనమయిన మఱుసటి దినమునుంచియే ప్రయత్నములు ఆరంభమయినవి. ఓరుగంటి మహాసంగ్రామములో మహానాయకులందఱు మడియుటచేత యువజనులే నడుములు బిగించి ముందుకు వచ్చి, స్వాతంత్ర్య సంస్థాపనము కొఱకు రహస్యముగా కుట్రలు పన్నిరి. ముసునూరి ప్రోలానేడు స్వాతంత్ర్య సంపాదనోద్యమ నాయకుడు. ఇతనికి రేచెర్ల సింగమనేడు, ప్రోలయ వేమారెడ్డి మొదలైన యోధానుయోధులు బాసటయైరి. వీరిలో రేచెర్లవారు పద్మ వెలమనాయకులు. సింగమనేని పూర్వులు కాకతీయులకు సామంతులుగా నుండి కాంచీపురాది మహాసంగ్రామములలో పంచపాండ్యులను జయించి ప్రఖ్యాతి నార్జించినవారు. వేమారెడ్డి పూర్వులు కాకతీయుల కాలములో తెలుగు చోళ సామంతులుగ నున్నవారు. దేశమునకు విముక్తిసంపాదించు నిమిత్తమందఱును ప్రోలయ నాయకుని ఛత్రచ్ఛాయను చేరి యతనిని తమ నేతగ నంగీకరించి కృషిచేసిరి. తెలుగు దేశములో అడపదడప అక్కడక్కడ ముస్లింప్రభుత్వముపై తిరుగుబాటులుజరుగుచువచ్చినవి కాని ముస్లిం అధికారులు వెంటనే అణచివేయుచు వచ్చిరి. ఒకమాఱు దక్షిణదేశమున నున్న ప్రతినిధి పాలకుడే తిరుగబాటు చేసెను. ఈ తిరుగబాట్లనణచుటకు ఒకటి రెండు పర్యాయములు మహమ్మదుబిన్‌తుగ్లకే స్వయముగా దక్షిణాపథమునకు వచ్చెను. ఎట్లయిన నేమి ప్రోలయనాయకాదుల కృషివల్ల సముద్ర

తీరస్థాంధ్రము రెండు మూడేండ్లలోనే క్రీ. శ. 1325-26 లో స్వతంత్రమయినది. ప్రోలానేనికి రేకపల్లి రాజధాని. ఇది భద్రాచలము తాలూకాలోని కూనవరమునకు సమీపమున గోదావరీతీరాన నున్నది. అప్పటినుంచి తెనుగునాయకులు ఓరుగంటి రాజ్యవిముక్తికై పాటుపడిరి. ఒకమారిట్టి తిరుగబాటుల నణచుటకు దక్షిణాపథమునకు వచ్చినపుడు ఓరుగంటి పాలకుడొక్కడు త్రిలింగదేశము నదుపులోనుంచి పాలించుట కష్టమని దానిని సుల్తాను తూర్పుతెలంగాణా అని పడమటి తెలంగాణా అని పరిపాలనా సౌకర్యము నిమిత్తము రెండు విభాగములుచేసి మొదటిదానికి ఓరుగంటిని రెండవదానికి బీదరును రాజధానులు కావించి, ఈ రెండు విభాగములకును వేరువేరు పాలకులను నియమించెను. అంతఃపురరహస్యముగ ఏమి పన్నాగములు పన్నిరో స్వాతంత్ర్యోద్యమము నెట్లునడిపిరో తెలియదు కాని ప్రోలయనాయకుని పితృవ్యపుత్రుడు ముసునూరి కాపయ నాయకుడు క్రీ. శ. 1335-1336 ప్రాంతముల ముసల్మానులను జయించి ఓరుగంటి కోటను వశపరచుకొని ఆంధ్ర హిందూరాజ్యమును మరల ప్రతిష్ఠాపించెను.

### కాకతీయ యుగానంతర స్వతంత్ర రాజ్యములు

ప్రోలయనాయకుని యనంతర మతనికి సంతతి లేకపోవుటవలన కాపయనాయకుడు తీరస్థాంధ్రమునకును ఓరుగంటికిని అధిపతియయ్యెను. అతని రాజధాని ఓరుగల్లు. సరిగా ఓరుగంటిలో కాపయనాయకుని ఆధిపత్యమున హిందువులు తిరుగబాటు చేసిన కాలముననే హరిహర, బుక్కరాయాదులు స్వాతంత్ర్యము ప్రకటించి యొక స్వతంత్ర రాజ్యమునకు నిర్మాతలైరి. వీరికి తుంగభద్రా తీరముననున్న విజయనగరము రాజధాని. ఇదియే విజయనగరరాజ్యమను పేర బ్రఖ్యాతమయినది. స్వాతంత్ర్యము లభించిన తరువాత కాపయ నాయకుని సర్వాధిపత్యమున కొడంబడక తెనుగునాయకు లెవరికివారు స్వతంత్రులై ప్రత్యేక రాజ్యములు నిర్మించుకొనిరి. ఇట్టి రాజ్యములలో ప్రధానమయినవి రెండు-తీరస్థాంధ్ర దేశమున ప్రోలయ వేమారెడ్డి స్థాపించిన రెడ్డిరాజ్యము. దీనికి మొదట అద్దంకియు తరువాత కొండవీడును రాజధానులు. రెండవది రేచర్ల సింగమనేడు స్థాపించిన పద్మ వెలమరాజ్యము. దీనికి రాజుకొండ రాజధాని. ఈరీతిని స్వాతంత్ర్య సంస్థాపనానంతరము ఆంధ్రదేశమున నాలుగురాజ్యములు-ఓరుగల్లు, రాజుకొండ, కొండవీడు, విజయనగరములు-ఏర్పడినవి. ఈ రాజ్యాధిపతు లెవరికివారే తమతమరాజ్యములను పెంపు చేసికొనుటలో ఒకరితో నొకరు కలహించుచువచ్చిరి. వీరి పరస్పర సంగ్రామములతో రక్తపంకిలమైన దక్షిణాపథమును మరింత రొంపిచేసినది క్రొత్తగానుదయించిన బహ్మనీరాజ్యము. కాపయ నాయకు డోరుగంటినుండి పరిపాలించుచుండిన కాలమున దక్కనులో మహమ్మదు బిన్ తుఘ్లకు కొలువుననుండిన 'అమీరానిజద' అనుపేర బరగిన నాయక సమూహము దక్షిణాపథపు రాజకీయపరిస్థితిని, విజయవంతముగా సాగిన తిరుగుబాట్లనుగాంచి దక్కనులో ఒక స్వతంత్ర ముస్లిమురాజ్యమును స్థాపించు తలంపుతో సుల్తానుఅధికారమును ధిక్కరించి జాఫరుహాసన్ ఖాను నాయకత్వమున తిరుగుబాటు కావించెను. వీరి తిరుగుబాటు విజయవంతమయినచో ఇక సుల్తానువలని యుపద్రవము తన రాజ్యమునకుకూడ తొలగిపోవునని, వారికీసమయమున తోడ్పడినచో అవసరమయినప్పుడు వారు తనకు తోడ్పడగలరనియెంచి కాపయ నాయకుడు కొంతసైన్యమును వారి సాహాయ్యార్థము పంపెను. ఈ విప్లవములనణచుటకు మహమ్మదు బిన్ తుఘ్లకు ప్రయత్నించెను కాని ఉత్తరహిందూస్థానమున రేగిన కల్లోలముల నణచుటతోనే అతనికి సరిపోయినది. ఇంతలో ఆ సుల్తాను క్రీ. శ. 1351లో కాలధర్మము నొందెను. తిరుగుబాటుదార్లు కృతార్థులైరి. వీరి నాయకుడు హసన్ క్రీ. శ. 1347లో అలాఉద్దీన్ హసన్ గంగూబహ్మనీ అనుపేరుతో సింహాసనమెక్కి బహ్మనీ రాజ్యస్థాపకుడయ్యెను. బహ్మనీసుల్తానులకు గుల్బర్గా రాజధాని.

అల్లాఉద్దీన్ హసన్ సింహాసనమెక్కిన నాటి నుంచి, అంతకుపూర్వము మహమ్మద్ బిన్ తుఘ్లకు అధికారముక్రిందనుండిన దేశమునంతను మరల మహమ్మదీయాధికారముక్రిందికి గొనివచ్చుటకై ఇరుగుపొరుగు రాజ్యములన్నింటిపై అతడు దండయాత్రలు చేసెను. ఆపత్సమయమున సహాయపడినను అతడు కాపయనాయకుని విడిచిపెట్టలేదు. ఓరుగల్లు చివరకు బహ్మనీ రాజులకు సామంతరాజ్యమయి కప్పము చెల్లించినది. ఆటుపిదప బహ్మనీ సుల్తానుల ప్రోత్సాహముననో తనకే తోచియో రేచెర్లసింగమనేని కుమారుడు అనపోతానేడు ఓరుగంటిపై దండెత్తి, అదివరకే ముస్లిందండయాత్రలవలన చితికియున్న కాపానేని యుద్ధమున వధించి క్రీ. శ. 1369 ప్రాంతమున ఓరుగంటిరాజ్యము నాక్రమించుకొనెను. అంతటితో ముసునూరి నాయకు

పరిపాలన మంతరించినది. తెలంగాణా కంతకు రేచర్ల పద్మ వెలమనాయకులధిపతు లయిరి. రాజుకొండ వీరి రాజధాని. దేవరకొండ ఓరుగల్లులు శాఖానగరములు; రాజుకొండకు పిదప ప్రధానమయినవి.

## రాజుకొండ రేచెర్ల వెలమవంశజులు.

రేచెర్ల సింగమనేనికి అనపోతానేడు, మాదానేడు అని యిరువురు తనయులు. అనపోతానేని సంతతివారికి రాజగిరి (రాజుకొండ)యు, మాదానేని సంతతివారికి దేవరకొండయు ప్రధాన నగరములైనవి. అనపోతానేని సంతతివారిలో నితనికుమారుడైన రెండవ సింగమనేడును, మాదానేని సంతతివారిలో లింగమనేడును సుప్రసిద్ధులు. రెండవ సింగమనేనికిని, ఇతని పౌత్రుడును కుమారాన్న పోతానేని తనయుడును అయిన మూడవ సింగమనేనికిని సర్వజ్ఞ బిరుదము కలదు. ఈ రేచెర్ల వెలమవీరులకును, బహ్మనీ సుల్తానులకును చాలకాలము పోరుపులు లేకుండ జరిగిపోయెను కాని క్రీ.శ. 1397 లో బహ్మనీ సింహాసనము నెక్కిన సుల్తాన్ ఫీరూజ్ షా కాలమునాటినుంచి ఉభయులకును మైత్రి చెడినది. అప్పటినుంచి రేచెర్ల వెలమ వీరులు ఒక్కొక్కప్పుడు బహ్మనీ సుల్తానులకు విధేయులైన సామంతులుగను, వేరొకప్పుడు వారికి పరమశత్రువులుగ ఉండి హిందూరాజన్యులయిన విజయనగరాధీశ్వరులతోను కటకము గజపతులతోను చేరి సుల్తానులతో యుద్ధము చేయుచు నిత్య రాజకీయముగ ఎగుడు దిగుడులు గల జీవితమును గడపిరి. బహ్మనీ సుల్తానులకును రేచెర్ల వెలమ వీరులకును ఫీరూజ్ షాహ బిదప క్రీ.శ. 1422 లో బహ్మనీ రాజ్యమున కధిపతి యైన అహమ్మదుషా కాలములో పోరాట మధికమయినది. ఈ యహమ్మదుషా కాలములోనే రేచెర్ల వెలమనాయకులు ఓరుగల్లు రాజుకొండలను గోల్పోయిరి. అంతటితో తెలంగాణము ముసల్మానుల ప్రత్యక్ష పాలనము క్రిందికి వచ్చినది. తెలంగాణమున హిందూరాజ్య మస్తమించినది.

రాజుకొండ వెలమవీరులు అత్యంత శౌర్యపరాక్రమవంతులు; విద్యాప్రియులు, కవిపండిత పోషకులు. రెండవ సర్వజ్ఞ సింగమనేడు సంస్కృత విద్యావిశారదుడు; పండితాఖండలుడు. కుమారసింగమనేడనికూడ ఇతనికి నామాంతరము కలదు. ఇతడు సంస్కృతమున రసార్ణవ సుధాకర మనుపేర నొక యలంకార గ్రంథమును, సంగీత సుధాకరమను పేర శార్ఙ్గదేవ విరచితమయిన సంగీతరత్నాకరమునకు వ్యాఖ్యయు, కువలయావళీ నామాంతరమున బరగు రత్నపాంచాలిక యను నాటకమును విరచించెను. విశ్వేశ్వరకవియు, బొమ్మకంటి అప్పయార్యుడును ఈతని కాశ్రితులు. విశ్వేశ్వరకవి సంస్కృతమున చమత్కార చంద్రికయను పేర నొక యలంకార గ్రంథమును రచించెను. బొమ్మకంటి అప్పయార్యుడు అమరకోశ వ్యాఖ్యకు కర్త. రెండవ సింగభూపాలుడు వ్రాసిన గ్రంథము లింకనేకము లున్నను ఇప్పటికి నిలిచినవి, ప్రధానమయినవి పైనుడివినవే. రాజుకొండ వెలమనాయకుల పరిపాలన కాలము తెనుగు కవితకుకూడ వసంతకాలము వంటిది. ఈ కాలమున తెనుగు కవులనేకులు తెలంగాణమున వర్ధిల్లిరి. గౌరనకవి హరిశ్చంద్ర, నవనాథ చరిత్రములను ద్విపద కావ్యములను, లక్షణ దీపిక యను ఛందోగ్రంథమును రచియించెను. కొలని గోపరాజు సింహాసనద్వాత్రింశిక యను పద్యకావ్యమును రచియించెను. భక్తిరస బంధురమగు భాగవతము పోతనగారు రచియించినది. ఈ రాజుకొండ వెలమ నాయకుల కాలములోనే శ్రీనాథ మహాకవి రెడ్డి రాజ్యమున నుండి సర్వజ్ఞసింగ భూపాలుని కాలములో రాజుకొండకు వచ్చి యా ప్రభువరేణ్యునిచే సత్కరింపబడెను. ఈ సర్వజ్ఞ సింగభూపతి ఎవరు, రెండవసింగమనేడా మూడవ సింగమనేడా యన్న విషయమున నభిప్రాయభేదములు కలవు కాని చాలమంది మూడవ సింగమనేడే యని విశ్వసింతురు. ఈ రేచెర్ల వెలమ వీరుల రాజ్యపరిపాలనము ప్రారంభ కాలములో శైవమున కుండిన యున్నతి క్రమముగా తగ్గిపోయినది. దాని స్థానమును వైష్ణవము క్రమముగా ఆక్రమించుకొన నారంభించెను.

## బహ్మనీరాజ్యము

బహ్మనీ రాజ్యస్థాపకుడయిన అలాఉద్దీన్ తన యధికారమును దృఢముగా స్థాపించుకొనునాటికి అటు దక్షిణమున విజయనగరరాజ్యమును ఇటు తూర్పున రెడ్డిరాజ్యమును బాగుగ బలపడి ముస్లిందండయాత్రల నెదుర్కొనుటకు తగిన కట్టుదిట్టములు చేసికొన్నవి. అలాఉద్దీనుసంతతివారు గూరముననున్న తీరస్థ ఆంధ్రదేశముపై దండయాత్రలు చేసినను అపజయమే కాని వారి కందువలన లాభములేకపోయినది. బహ్మనీ సుల్తానుల మద్దతుతోనే రాజుకొండ వెలమవీరులు ఓరుగంటిపై దండెత్తి ముసునూరి కాపానేని వధించి తెలంగాణాకంతకు నేలికలైరని యనుమానించుట కవ

కాశము కలదు. బహ్మనీసుల్తానులకును రాచకొండ వెలమలకును రమారమి వంద సంవత్సరముల కాలము నిర్విఘ్నమయిన పోరపులును లేకుండ ఉభయులు నొకరి నొకరు రాజకీయముగ దోడ్పడుచు సఖ్యముగ కాలము గడిపిరి. అందువలన కాపయనాయకుని మరణానంతరమునుండి బహ్మనీసుల్తాను ఫీరూజ్ షా (క్రీ. శ. 1397-1422) కాలమునకు తెలంగాణాకు బహ్మనీ సుల్తానుల దండయాత్రాభయము లేకపోయెను. బహ్మనీ రాజ్యమునకు తూర్పున రాజుకొండ రాజ్యము సరిహద్దయినట్లే దక్షిణమున విజయనగరము సరిహద్దు రాజ్యమయినది. అలాఉద్దీను బహ్మనీరాజ్యమును స్థాపించుటకు పూర్వము విజయనగర స్థాపకుడయిన హరిహరరాయల రాజ్యము త్తరమున బిజాపురము వరకు వ్యాపించినది. అప్పటి దేశ రాజకీయపరిస్థితులను గమనించి హరిహరరాయల యాజ్ఞానుసారము క్రీ. శ. 1339 లో అతని సామంతుడైన మహానాయకాచార్య చామెయ నాయకుడు వాతాపినగరమున కోటను కట్టించెను. ఒక్క బిజాపురము వరకే కాదు, స్థానిక గాథలవల్ల విజయనగర రాజ్యము పశ్చిమోత్తరమున రత్నగిరి మండలములోని రాయగడము వరకు వ్యాపించినట్లు తెలియుచున్నది. అలాఉద్దీను ఈ ప్రాంతము నంతను జయించి తనరాజ్యములో గలుపుకొనెను. అప్పటినుంచి ఈ ప్రాంతమును, అందు ముఖ్యముగా కృష్ణా, తుంగభద్రానదుల మధ్యనున్న యంతర్వేదిని మరల దమ యధికారము క్రిందికి తెచ్చుకొనుటకు విజయనగరాధిపతులును, దానిని దమక్రింద నిలుపుకొనుటకు బహ్మని సులానులును నిరంతరము పోరాడుచు వచ్చిరి. బహ్మనీ రాజ్యస్థాపనముతో ఆరంభమైన ఈ సంగ్రామవహ్ని ఆరిపోకుండ ఎడనెడ రగిలి మండుచునే వచ్చినది. మతోద్రేకపూరితులై దక్షిణ హిందూదేశము నంతను తమ చంద్రధ్వజచ్ఛాయకు తీసికొనివచ్చి మసీదులమయము చేయవలెననుకొన్న బహ్మనీ సుల్తానులకు హరిహరరాయ స్థాపితమయిన విజయనగర సామ్రాజ్యము సైంధవునివలె అడ్డుపడి రమారమి మూడువందల సంవత్సరములు హిందూ సంస్కృతిని హిందూ నాగరికతను విలయమునొందకుండ కాపాడి కీర్తిగాంచెను.

ఇరుగుపొరుగులనున్న హిందూరాజ్యములను జయించుట కష్టమగుటచేత బహ్మనీ సుల్తానులు తమ సైనికులలో మతోద్రేకమును రెచ్చగొట్టి తమ కార్యము సాధించుకొనుటకు మతయుద్ధమును (జిహాద్) ప్రకటించుచు వచ్చిరి. ఇట్టి మతయుద్ధమును ప్రకటించిన బహ్మనీ సుల్తానులలో మొట్టమొదటివాడు అలాఉద్దీన్ హసన్ షా కుమారుడయిన మొదటి మహ్మదుషా (క్రీ. శ. 1359-1376). బహ్మనీసుల్తానుల తోడి ఈ యుద్ధములలో హరిహర బుక్క భూపతులును కాపయ నాయకుడును చేతులుకలిపి పరస్పరము సహాయపడుచుండిరి. విజయనగరాధీశులకీ సాయము కాపయ నాయకుని మృతితో అంతమయినది. సాధారణముగా బహ్మనీసుల్తాను లందఱు హిందూరాజ్యములపై జిహాద్ ప్రకటించినవారే. ఈ సుల్తానులందఱిలో హిందూరాజ్యములపై ఎక్కువ దండయాత్రలు చేసినవాడు ఫీరూజ్ షా. (క్రీ. శ. 1397-14222). ఈతడు రాజ్యముచేసిన పాతికేండ్లలోను ఇరువదిరెండు సంవత్సరములే యేటేట హిందూరాజ్యములపై దండెత్తెనట. ఈ సుల్తాన్ ఫీరోజ్ షా కాలమునుంచియే రాజుకొండ వెలమనాయకులకును, బహ్మనీ సుల్తానులకునుగల పూర్వపుమైత్రి చెడినది. నాటినుంచి రేచెర్ల వెలమ వంశజులు అవకాశము చిక్కినపుడెల్ల ఇటు విజయనగరాధీశ్వరులతోను, అటు తరువాత క్రీ. శ. 1436 లో కటకమున నూతన రాజ్యమును స్థాపించి రెడ్డిరాజ్య పతనానంతరము సముద్రతీరస్థ ఆంధ్రదేశము నాక్రమించుకొన్న కపిలేశ్వర గజపతివంశజులతోను చేరి బహ్మనీ రాజ్యమును కూలద్రోయుటకు ప్రయత్నించుచు వచ్చిరి. ఈ ప్రయత్నములవలన బహ్మనీలకు రాజుకొండ తెలంగాణా రాజ్యము ప్రక్కలోని బల్లెమగుటచేత దానిని రూపుమాపుటకు వారు కంకణము కట్టిరి. ఫీరూజ్ షా యనంతరము బహ్మనీ సింహాసన మెక్కిన అహ్మదుషావలీ (క్రీ. శ. 1422-1436) రాజధాని గుల్బర్గనుండి బీదరుకు మార్చెను. ఇంతటినుంచి బహ్మనీ సుల్తానుల కదియే రాజధాని యైనది. తెనుగు వాఙ్మయములో బీదరు నగరము బెదదకోట యని వ్యవహృతమయినది. అహ్మదుషావలీ పరస్పరము సహాయపడుచుండిన విజయనగరాధీశ్వరులతోను, రాజుకొండ వెలమనాయకులతోను అనేక సంగ్రామములు కావించెను. ఈ సుల్తానుకాలమున తఱచుగా పెనగులాడుచు వచ్చినను వెలమవీరులకు ఓరుగంటి పరగణా వారి పట్టునుండి జారిపోయి బహ్మనీ సుల్తానుల వశమయినది. అనతికాలముననే రాజుకొండకూడ సుల్తానుల యధికారముక్రిందికి వచ్చినది. తెలంగాణాపై బహ్మనీసుల్తానుల దండయాత్రలంతటితో కడముట్టలేదు. దేవరకొండ దుర్గాధిపతులింకను సుల్తానులకు

కంటకముగనే యుండిరి. క్రీ. శ. 1457 లో బహ్మనీ సింహాసనమెక్కిన హుమాయూన్‌షా దేవరకొండ రాజ్యమును సాధింప సైన్యమునంపినపుడు లింగమనేడు కపిలేశ్వర గజపతి సాయమువేడగా అతడు తన కుమారుడు హంవీరదేవుని సైన్యముల నిచ్చి క్రీ. శ. 1460లో తెలంగాణాకు పంపెను. తాత్కాలికముగా వారు జయించినను అప్పటికే రాజు కొండ బలము సన్నగిల్లినది; తెలంగాణాలో చాలభాగము బహ్మనీ సుల్తానుల వశమయినది. మహమ్మదు షాలిష్కరీ (క్రీ. శ. 1463-1482) మరణించు నాటికి తెలంగాణా యంతయు బహ్మనీ సుల్తానుల క్రిందికి వచ్చినది. బహ్మనీ రాజ్యము సుస్థాపితమైనది మొదలుకొని దాదాపు నూటపాతిక సంవత్సరముల కాలము (క్రీ. శ. 1359-1482) అదియఖండ విక్రమాటోప వైభవముల నలరినది. దాని జీవితావశేషము మిగిలిన నలువదినాలుగు సంవత్సరముల కాలము- క్రీ. శ. 1526 వఱకు దానిని పరిపాలించిన సుల్తానులు బలహీనులు, భోగపరాయణు లయిరి. అందువలన నిజమునకు రాజ్యాధికారము రాజకార్యధురంధరులైన వారి అమీరుల, తరఫ్‌దారుల, సేనానుల హస్తగతమయినది. ఈ యధికారివర్గమునవిదేశీముస్లిములు, దక్కన్ ముస్లిములు అని రెండు పక్షములుండెను. వీరిలో దక్కన్ ముస్లిములు చిరకాలము క్రిందట ఈదేశమునకువచ్చి యిచ్చట స్థిరపడిపోయి దేశీయులతో సంబంధములు కలుపుకొన్నవారును, ఇస్లాము మతమును నిర్బంధముగను ఐచ్ఛికముగను స్వీకరించిన హిందువులు. హిందూదేశమునకు చుట్టుపట్లనున్న పెర్షియా, అరాబియా మొదలైన దేశములనుంచి వచ్చి బహ్మనీల కొలువులో పెద్దపెద్దఉద్యోగములందును, సేనలో గొప్ప పదవులయందును నుండిన మొగలాయీలు, అరబ్బులు, పెర్షియనులు, తురకలు (తుర్కీవారు) మొదలైనవారు విదేశముస్లిములు. సైన్యమునకు సంబంధించిన పరిపాలన శాఖలలోను ఇతర శాఖలలోను ఉద్యోగముల విషయముననే కాక ఈయుభయపక్షములవారికి మత విషయకముగ గూడ వీరిలో వీరికి అప్పుడపుడు కలహములు పొడముచు వచ్చినవి. వీరందఱును షియా, సున్నీ, యను రెండు మత సంప్రదాయములకు చెందినవారు. దేశీయులయిన దక్కనీలు సున్నీలు, విదేశ ముస్లిము లందఱు షియా సంప్రదాయమునకు చెందినవారు కాకపోయినను అధిక సంఖ్యాకు లామత సంప్రదాయమునకు చెందినవారే. అహమ్మదుషావలీ విదేశీ ముస్లిములను దన సైన్యములో చేర్చుకొని గొప్ప అధికార పదవులకు వారిని నియమించెను. నాటినుంచి బహ్మనీ సుల్తానుల కొలువులో విదేశీ ముస్లిముల పలుకుబడి ప్రభావము హెచ్చయినది; వారు దక్కనీ ముస్లిములకు కంటకులయిరి. పదవుల కొఱకును, అధికారము కొఱకును ఉభయపక్షముల వారికి ఒకరిమీద ఒకరికి విద్వేషమధికమై కలహములు రేగినవి. రాజకీయముగ పెరిగిన ఈ వైరమునకు మతవిద్వేషము కూడ తోడ్పడినది. రాజ్య పాలనములో ఏపక్షమువారధికారము నందుండి ఎక్కువ బలుకుబడి కలిగియున్న నా పక్షమువారు రెండవ పక్షమునకు చెందినవారిని అణచివేయుచు వచ్చిరి. మహమ్మదుషా లష్కరీ కాలములో ఈ కలహములు మఱియు నతిశయించినవి. ఆ సుల్తాను ప్రధాని మహమూదు గావాన్ విదేశీ ముస్లిములకు నాయకుడు. ఉభయపక్షముల వారి యీ కలహములు మహమూదు గావాన్ హత్యకు కారణమగుటయే కాక బహ్మనీరాజ్య దౌర్బల్యమునకును, దాని వినాశనమునకును గూడ కారణమయినవి. సుల్తానుల నామకమైరి. ఉమ్రావులు, వజీరులు, సేనానులు అధికారము వహించి సుల్తానులను కీలుబొమ్మలు చేసి యాడించి తుదకెవరికి వారు సుల్తాను అధికారమును ధిక్కరించి స్వతంత్ర రాజ్యములను స్థాపించుకొనిరి. మహమ్మదుషా లష్కరీ పిదప బహ్మనీ సింహాసనము నధిష్ఠించినవాడు పండ్రెండేండ్ల వయస్సుగల అతని కుమారుడు మహమూదు (క్రీ. శ. 1482-1518). ఇతని కాలములో తెలంగాణా కధిపతి సుల్తాన్ కూలీ కుతుబ్ ఉల్ ముల్క్. ఈ బహ్మనీ సుల్తాను మహమూదు కాలములోనే బహ్మనీరాజ్యము విచ్ఛిన్నమయినది. ఈ రాజ్యము శిథిలముల మీదనే బేరారు, అహమ్మదునగరు, విజాపూరు, బీదరు, గోల్కొండ అని అయిదు ముస్లిం స్వతంత్రరాజ్యములు రూపొందినవి. వీటిలో బేరారును పాలించిన సుల్తానులకు ఇమాద్‌శాహీలని, అహ్మదునగరము పాలించివారికి నిజాంశాహీలని, విజాపురము పాలించినవారికి ఆదిల్‌శాహీలని బీదరు పాలించినవారికి బరీదుశాహీలని, గోలకొండ పాలించినవారికి కుతుబ్‌శాహీలని పేరు. గోల్కొండ తెలంగాణాకు రాజధాని. అందరికంటె ముందు క్రీ. శ. 1489లో సుల్తానుఅధికారము ధిక్కరించి స్వతంత్రరాజ్యమును స్థాపించినవాడు విజాపుర రాజ్యాధిపతి యూసఫ్ ఆదిల్‌శాహ. ఇతని సంతతి

వారిని విజాపురపు ఆదిల్‌శాహి లందురు. అందరి కంటె కట్టకడపట క్రీ. శ. 1512లో స్వతంత్రరాజ్యము స్థాపించినవాడు సుల్తాన్ కూలికుతుబ్ ఉల్‌ముల్కు.

బహ్మనీరాజ్యము స్థాపిత మయినపిదప దక్షిణ హిందూదేశమున ముస్లిములకు స్థావరమేర్పడి వారి సంఖ్య క్రమముగా వృద్ధిపొందెను. నిర్బంధముమీద కొందఱును, ఉద్యోగములకని మతముపుచ్చుకొన్నచో జీవనోపాధి దొరకునని ఇచ్ఛికముగా కొందఱును హిందువులే ఇస్లాముమతమును స్వీకరించిరి. మతము తీసికొని సుల్తానులకు విశ్వాసపాత్రులుగను విధేయులుగను నున్నవారికి పరిపాలనమున గొప్ప యుద్యోగములును గొప్పపదవులును లభించుచువచ్చినవి. క్రమముగా ముస్లిములు హిందూరాజసైన్యములోను, హిందువులు ముస్లింసుల్తానుల సైన్యములోను చేరుచువచ్చిరి. అంతియేకాదు, శత్రువులు తమపై నెత్తివచ్చినపుడు హిందూరాజులు ముస్లింసుల్తానుల సాయమును, ముస్లిం సుల్తానులు హిందూరాజుల తోడ్పాటును అర్థించుచు వచ్చిరి. ముస్లిందండయాత్రలకు ఫలముగా ఉత్తర హిందూస్థానమునకును దక్షిణ హిందూదేశమునకును రాకపోకలును, వర్తకవ్యాపారము నెక్కువయినవి. హిందూదేశమునకు పశ్చిమముననున్న దేశములతో గూడ వ్యాపార మతిశయించినది. ఆదేశములనుండి అనేకులు కవులు, ఫకీరులు, సాధువులు, శిల్పులు, వర్తకప్రముఖులు, సైనికులు మొదలయినవారు బహ్మనీ సుల్తానుల ఆశ్రయపోషణముల నాశించి వారి రాజధానీనగరములకు వచ్చుచుండిరి. ముస్లిములతోడి రాజకీయ సంబంధము హెచ్చయి హిందువు లనేకులు పారసీభాష నేర్చుకొనుచు వచ్చిరి. బహ్మనీ సుల్తానులు విద్యావ్యాపనము నిమిత్తము గ్రామములలోను పట్టణములలోను ముల్లాలను నియమించిరి; మదరసాలు (విద్యాసంస్థలు) స్థాపించిరి. ఈ బహ్మనీ సుల్తానుల కాలముననే మహారాష్ట్ర, ఉర్దూ భాషలు వృద్ధిపొంద జొచ్చినవి. ఈ కాలములోనే మహారాష్ట్రులు శీఘ్రగతిని ఒక వీరజాతిగా పెంపొందుచుండిరి. చలనము లేకుండ నాటుకొనిపోయి ఒకదానికొకటి ప్రతిస్పర్థులై చుక్కెదురుగనున్న హిందూ ముస్లిం మతముల, కులాచారముల విభేదములు పరస్పరము తీవ్రసంఘర్షణమునకు లోనై సంఘము నల్లకల్లోలపఱచి యుద్రేకించుట చేత ఈ రెండుమతముల కులాచారముల తత్వములను సమన్వయముచేసి హిందువులకు ముస్లిములకు సామరస్యము చేకూర్చుటకు ప్రయత్నించిన మహనీయులు రామానంద, కబీరు, గురునానకు, చైతన్యులును, వేమనయోగియు ఈ కాలమువారే. వేమనయోగి ఆంధ్రుడే. మిగిలినవారు దక్కను కుత్తర దేశములోనివారు. భక్తి ప్రధానముకాని రాము రహీము లొక్కటి. ఏపేర గొల్చినను సర్వేశ్వరు డొక్కడే; కులభేదములు కృత్రిమములు, మానవ కల్పితములు; మానవులందఱు సమానులు, సోదరులను నూత్నసందేశమును వారు వినిపించిరి. వారిబోధలు దక్షిణాపథమునకుకూడ వినిపించినవి. అదే తత్వమును వేమనయోగియు బోధించెను. ఆకాలమునాటి ఆంధ్రులు సుల్తానులవలెనే బహ్మనీలును సైనికోద్యోగి వర్గము సాయముతో నిరంకుశముగ ప్రజలను పాలించిరి. హిందూ ముస్లిము కళలలోను, మతాచార సంస్కృతులలోను ఒకదాని ప్రభావమున నింకొకదానిలో మార్పులు కలుగుచు వచ్చిన కాలమది.

## కుతుబ్‌శాహి పరిపాలనము

సుల్తాన్ కూలికుతుబ్ ఉల్‌ముల్కు పెర్షియాలోని హామదాన్ నివాసియైన తురక. ఇతడు క్రీ. శ. 1512లో సింహాసనమునకు వచ్చినప్పటినుంచి తన రాజ్యమును తూర్పున బంగాళాఖాతము వఱకును వ్యాపింపజేసికొన బ్రయత్నించెను. కాని యితడు స్వతంత్రుడగు నాటికి సముద్రతీరస్థ ఆంధ్రదేశమంతయు దక్షిణమున నెల్లూరి జిల్లాలోని యుదయగిరి దుర్గమువఱకు కపిలేశ్వరగజపతి కుమారుడయిన పురుషోత్తమ గజపతి యధీనమున నుండెను. ఆనాటికే ఒరిస్సాగజపతుల యీ రాజ్యము విజయనగర సామ్రాజ్యమున కుపద్రవకరముగ పరిణమించెను. పురుషోత్తమగజపతి యనంతరమున సింహాసనమెక్కిన ప్రతాపరుద్రగజపతి ఇటు సుల్తాన్ కూలికుతుబ్ ఉల్‌ముల్కునకును, అటు తుళువ వంశజుడయిన విజయనగరాధీశ్వరుడు కృష్ణదేవరాయలకును (క్రీ. శ.1510-1529) సమకాలికుడు. కృష్ణదేవరాయలు రాజ్యమునకు వచ్చిన రెండు మూడేండ్లలో గజపతిరాజ్యమును జయించుటకై తూర్పుదేశముపై దండెత్తి ప్రతాపరుద్రుని జయించి తీరస్థాంధ్రమును విజయనగర సామ్రాజ్యమున జేర్చుకొనెను. ఇంతియేకాక ఈ దండయాత్రలోనే కృష్ణదేవరాయలు తెలంగాణాలోని కోవెలకొండ గొయ్యలకొండ మున్నగు గొప్పదుర్గములనేకములను జయించెను. రాయల యీ దండయాత్ర వలన కూలీకుతుబ్ ఉల్‌ముల్కు రాజ్యము సుస్థితికే భంగముకలిగి ముందు దానిని కాపాడుకొన నవసరము కలిగెను. అందువలన తీరస్థాంధ్రమును జయించుటకు

కుతుబ్ శాహీల కింకను కొంతకాలము పట్టెను; కాని సుల్తాన్ కూలి తన రాజ్యము నుత్తరమున గోదావరినదివఱకు వ్యాపింపజేసెను. స్వతంత్రరాజ్యములను సంస్థాపించుకొన్న పిదప ఈ యైదుగురు సుల్తానులును ఎవరికి వారే దక్కను సామ్రాజ్యాధిపత్యమును స్థాపించు నాకాంక్షతో ఒకరి రాజ్యముపై నొకరు దండెత్తుచు పరస్పరము కలహించుచు వచ్చిరి. ఈ యైదు ముస్లిం రాజ్యముల చరిత్రమును ప్రధానముగ పరస్పర సంగ్రామ చరిత్రమే. తెలంగాణాను చాలవఱకు తన యధికారము క్రిందికి తెచ్చి కుతుబ్ శాహీ రాజ్యమునకు స్థిరమయిన దృఢమయిన పునాదులు వేసినవాడు సుల్తాన్ కూలి కుతుబ్ ఉల్ ముల్క్. క్రీ. శ. 1543లో ఇతడు తొంబదేండ్లప్రాయమున గొలకొండలోని పెద్ద మసీదులో నమాజు చేయుచుండగా ఇతని కుమారుడు జంషీదు ప్రేరణవలన హత్యకావింపబడెను. జంషీదు కుతుబ్ శాహ సోదరుడు ఇబ్రాహీం కుతుబ్ శాహ కుతుబ్ శాహ సుల్తానులలో చాల గొప్పవాడు. ఇతనికి మలిక్ ఇబ్రాహీం అనియు, తెనుగు వాఙ్మయములో ఇభరాముడు, మల్కిభరాముడు, అనియు పేర్లు. ఇతనియన్న జంషీదు కుతుబ్ శాహ కాలములో అతడు చంపివేయునన్న భయముతో ఇబ్రాహీం విజయనగరమునకు పారిపోయి యా మహారాజును శరణువేడెను. విజయనగరమునకు పారిపోవునప్పటికితనికి పదుమూడేండ్లు. విజయనగరమునప్పుడు కృష్ణదేవరాయల సోదరుని పుత్రుడయిన సదాశివదేవరాయలు (క్రీ. శ. 1542-1567) పాలించుచుండెను. పేరుకతడు మహారాజుగాని అధికారమంతయు కృష్ణదేవరాయల యల్లుడైన రామరాయలదే. ఇతని కళియ రామరాయ లనియు పేరు. రామరాయలు ఇబ్రాహీముకు ఒక జాగీరుకూడా నిచ్చి అతడు విజయనగరములోనున్న ఎనిమిదేండ్లును అతనిని తనకన్న బిడ్డవలె జూచుకొని యాదరించి, జంషీదు మరణానంతరము క్రీ. శ. 1550లో గోలకొండ సింహాసనము నెక్కించెను. ఇబ్రాహీం కాలములో బేరారు, అహ్మదునగరు, విజాపూరు, బెదదకోట (బీదరు) గోలకొండ, లను పాలించుచుండిన ఈయైదుగురు సుల్తానులకు ఒకరితో నొకరికి పోరాటము లధికమైనవి. బేరారు, బెదదకోటరాజ్యములు చిన్నవి. మిగిలినవిమూడును పెద్దవి. ప్రతిరెండు పెద్దరాజ్యముల వారును మూడవ పెద్దరాజ్యముపై దండెత్తుట, ఒంటరియైన మూడవ పెద్ద రాజ్యాధిపతి విజయనగరాధీశ్వరుల సాయముతీసికొనుట, మిగిలిన రెండురాజ్యములును ఏ పక్షముననో ఒక పక్షమున జేరుట ఈకాలమున, ఈ కాలముననే కాదు ఇంతకుపూర్వమును బరిపాటియైన రాజకీయవ్యవహారమయినది. ఈవిధమున అళియ రామరాయలు ఒకొక్కకప్పు డొక్కొక రాజ్యాధిపతితోగలసి మిగిలినవాటిని జయించి అన్నిటినుండి ఎప్పుడోయొకప్పుడు కప్పముగైకొనెను. ఎడతెగని యీ పరస్పర కలహములవలన ఈ ముస్లింరాజ్యములు దుర్బలములైనవి. ఈ దండయాత్రలలో ముస్లిములకు ప్రతిగా వారికంటెను హిందూసైనికు లొనర్చుచు వచ్చిన యత్యాచారములు ముస్లిములకు భీతిగొల్పినవి. ఓడిపోయినవారిని న్యూనతతోచూచి వారి నవమానించుచువచ్చుటచేత అళియరామరాయల ప్రవర్తనము మిత్రులకును శత్రులకునుగూడ దుస్సహమయినది. అతని పేరన్న సుల్తానులకు గర్భనిర్వేదకముగా నుండెను. వారిలోవారి కెంతపడకపోయినను 'విజయనగరపు'ఔన్నత్యమును తమయసహాయస్థితిని గుర్తించుకొని చివరికి సుల్తానులందరు నేకమై విజయనగరముపై దండెత్తిరి. వీరు దండెత్తివచ్చుచున్న వార్తవిని అసంఖ్యాకములైన బలమునుగూర్చుకొని అళియ రామరాయలు ఆ దండయాత్ర నెదుర్కొనబోయెను. ఉభయబలములకును రక్షసతంగడి (తలికోటదగ్గ) క్రీ. శ. 1565 లో మహాభయంకర సంగ్రామము జరిగెను. ఆ యుద్ధమున రామరాయలు హతుడయ్యెను. విజయనగర సామ్రాజ్యము విధ్వంసమయ్యెను. విజయనగరము కూలిపోయిన వెనుక వీరిలోవీరికి మఱల నెప్పటియట్లే. క్రీ శ. 1580 లో ఇబ్రహీం మృతినొందిన వెనుక రాజ్యమునకు వచ్చినవా డతనికొడుకు మొహమ్మదు కూలి కుతుబుశాహ (క్రీ. శ. 1580-1612). ఈ తండ్రికొడుకు లిరువురి పరిపాలన కాలముననే ప్రాగాంధ్ర దేశము పూర్తిగా గోలకొండ కుతుబ్ శాహీ సుల్తానుల వశమయినది. విజయనగరము మఱల దన పూర్వపు ఔన్నత్యమును పొందలేదు. విజయనగర రాజ్యము సంపూర్తిగ వినాశమగుటవలన తత్సామ్రాజ్యాధిపతులకు మొదట పెనుగొండయు ఆటుతరువాత చంద్రగిరియు రాజధాను లైనవి. ఈ కాలమున గూడ విజయనగరాధిపతులకును, కుతుబ్ శాహి సుల్తానులకును పోరాటము జరుగుచునే యుండెను. మహమ్మదు కూలి క్రీ. శ. 1589 లో గోలకొండ కోటకు సమీపమున భాగ్యనగర మనుపేర కట్టించిన నగరమే నేటి



# విషయానుక్రమణిక

పుటం



ముఖచిత్రము - పానుగల్లు శిల్పకాంత.

(శిల్పచిత్రములన్నియు హైదరాబాదు ఆర్కియాలజీ శాఖ సౌజన్యముతో)

హైదరాబాదు. ఆ సుల్తానే ఆ నగరమును గట్టించిన కొంతకాలమునకు దానికాపేరు తీసివేసి తనకొడుకు హైదరుపేర హైదరాబాదని పేరుపెట్టెను. ఇతని యనంతరము గోలకొండను పరిపాలించిన సుల్తానులు ముహ్మదు-మహమ్మదుకుతుబ్ షాహి (క్రీ. శ. 1612-1626), అబ్దుల్లా కుతుబ్‌శాహ (క్రీ. శ. 1626-1672). అబుల్ హసన్ కుతుబ్‌శాహ (క్రీ. శ. 1672-1687). అబ్దుల్లా కుతుబ్‌శాహ కాలములో రాయల సీమలోని ప్రాగ్భాగమును, మద్రాసువఱకు గల దేశమును కుతుబ్‌శాహి పరిపాల క్రిందికి వచ్చెను: ఢిల్లీ పాదుషా షాజహానుకు నిర్బంధముగా కప్పము కట్టవలసి వచ్చి, గోలకొండ మొగలాయిలకు ఇంచుమించుగ సామంతరాజ్యమయినది. చిట్టచివరి సుల్తాను అబుల్ హసన్‌కు తానాషా యని పేరు. అబుల్ హసన్ కొలువులో మాదన్నగారు ప్రధానిగాను, అక్కన్నగారు సర్వసైన్యాధిపతిగాను ఉండిరి. భద్రాచలపు రామదాసు గాథ తానాషానాటిదే. అక్కన్నమాదన్నలను దండనాయక, ప్రధానిపదవులందు నిల్పుట ద్రోహమైనది ఔరంగజేబు పాదుషాకు (క్రీ. శ. 1658-1707). ఆ ఢిల్లీ పాదుషా ఇది సాకుపెట్టుకొని క్రీ. శ. 1685 లో గోలకొండపై దండెత్తి వచ్చి రెండేండ్లు ముట్టడి యనంతరము వంచెనతో 1687 లో దానిని స్వాధీనము చేసికొనెను. పట్టువడిన తానాషా ఖైదులోనే చనిపోయెను.

గోలకొండ సుల్తానులు పరిపాలించునాటికి హిందూ ముస్లిం రాజకీయ సంబంధములలోను, సాంఘిక వ్యవహారములలోను చాలమార్పు కలిగినది. హిందువులును ముస్లిములును కలసిమెలసి సోదరులవలె వర్తించిరి. కుతుబుశాహి సుల్తానులు తెలంగాణాలోని వారి చిరకాల నివాసము వలనను, తెనుగువారితో వారికిగల చిరసంబంధము వలనను తెనుగువారేయై తెలుగుభాషను తెలుగునేలను ప్రేమించిరి, అభిమానించిరి. వారి రాజకీయ జీవితము తెలుగునాటనే ఆరంభమైనది, ఆపత్సమయములందు గోలకొండ సింహాసనము నాదుకొని కాపాడినవారు తెలుగు నాయకులును, తెనుగుదేశపు క్షత్రియులునే. కుతుబుశాహీల పరిపాలనలో హిందువుల కున్నతాధికార పదవులు లభించినవి. హిందువుల పండుగలలో ముస్లిములుకూడ పాల్గొనుచు వచ్చిరి. తెనుగుదేశములోని సంస్థానములలో చాలవఱకు గోలకొండ కుతుబుశాహీల, కాలములో నేర్పడినవే. వారి సామంతులు నాతుసైన్యాధిపతులు, మన్నెదొరలు. ఇతర నాయకులు ఎక్కువగా తెనుగువారే. మాదన్నగారు ప్రధానియు అక్కన్నగారు సర్వసైన్యాధిపతియు నయ్యెనన్న గోలకొండ సుల్తానుల సర్వసమానదృష్టి కంతకంటె నిదర్శనమేమి కావలయును? ఈ సుల్తానులు హిందువులకు పరిపాలనలో సమానావకాశము లిచ్చుట, ముస్లిములు హిందువులతో కలసిమెలసి సోదరులవలె ప్రవర్తించి వారి పండుగలలో వీరు వీరిపండుగలలో వారు పాల్గొనుట మొగలాయి పాదుషా ఔరంగజేబు దృష్టిలో సహింపరాని యపరాధములై యాతడు గోలకొండపై దండెత్తివచ్చుటకు కారణములైనవని. ముస్లిం షేకులు సయ్యదులు ఫకీరులు సాధువులు - వీరిని హిందువులు కొలుచుచు వచ్చిరి. వారి సమాధులకు మొక్కులు మొక్కుకొనుచు పూజించుచు వచ్చిరి. ముస్లిములు సంస్కృతమును హిందువులు అరబ్బీ ఫారసీభాషలను అభ్యసించుచువచ్చిరి. అంతే కాదు ముస్లిములు సంస్కృతములోను హిందువులు ఫారసీభాషలోను రచించిన గ్రంథములుకూడ గలవు. గోలకొండ కుతుబుశాహి సుల్తానుల యాదరణను కళలు వర్ధిల్లినవి. పదకవితా సామ్రాజ్య పట్టభద్రుడు క్షేత్రయ్య అబుల్ హసన్ యాస్థానమునకువచ్చి యచ్చటి తులసిమూర్తియను విద్వద్వర్యునితో వాదించి పదునొకండు వందలపదముల జెప్పి సుల్తాను మన్ననలందెనట. గోలకొండ కుతుబుశాహి సుల్తానులలో మలిక్ ఇబ్రాహీం చాల గొప్పవాడు. ఇతడు విజయనగరములో నివసించిన కాలములో తెలుగును సంస్కృతమును అభ్యసించెనేమో, వాటిమీద నాతని కభిమానమెక్కువ. విజయనగరాస్థానమునందలి విద్యామండపములో జరుగు సాహిత్యగోష్ఠి నితడు తిలకించియుండును; గోలకొండను సుల్తానయిన పిదప నీనగరమునుగూడ విజయనగరమువలె తీర్చిదిద్దెను. వేదవేదాంగవిదులయిన బ్రాహ్మణులకు గోలకొండ సుల్తానులిచ్చిన అగ్రహార భూదాన పత్రములు సన్నదులు ఇప్పటికినున్నవి. గోలకొండ ఆంధ్రకవిజనాశ్రయ మయినది. ఇబ్రాహీం సుల్తాను ఆస్థానాలంకారమయిన తెనుగు కవి అద్దంకి గంగాధరుడు. ఇతడు తపతీసంవరణమను కావ్యమును తెనుగున రచియించెను. సుల్తాను తెనుగు కవుల నాదరించుటతో అతని సామంతులును వారి నాదరించి వారి వలననుండి కావ్యము లంకితము గైకొనుచు వచ్చిరి. ఈ విధముగా వచ్చిన కావ్యములలో ముఖ్యముగా చెప్పదగినది యయాతి చరిత్రము. కావ్యకర్త పొన్నికంటి తెలగనార్యుడు; దానినికుతుబ్ శాహి,

సామంతుడయిన అమీనుఖాను కంకితమిచ్చెను. ప్రత్యక్షముగ సుల్తానుల యాదరపోషణముల లేనట్టికవులును గలరు; వారు రచియించిన కావ్యములును గలవు. అట్టికవులలో పేర్కొనదగినవాడు కంసాలి రుద్రకవి. ఇతడు నిరంకుశోపాఖ్యానమను కావ్యమును రచించెను. ఇతడు సుజనమనోరంజనమను కావ్యమును రచించి మల్కిభరాముని కంకితమిచ్చినట్లు చెప్పుదురు కాని యాకావ్యమింతవరకు దొరకలేదు. ఈ గోలకొండ సుల్తానుల కాలములో వర్ధిల్లిన మఱియొక కవి—గోలకొండ కరణము సారంగు తమ్మయ్య. ఇతడు తొండరడిప్పొడి యాళ్వారని ప్రసిద్ధివహించిన విప్రనారాయణుని చరితమును రసవంతమైన కావ్యముగావిరచించెను. అబ్దుల్లా కుతుబ్‌శాహి పరిపాలించుచుండిన కాలములోనే షాహజీ కుమారుడయిన శివాజీ విజాపురపు ఆదిల్‌శాహి రాజ్యములోని కొన్నికొన్ని కోటలను బట్టుకొని మహారాష్ట్రరాజ్యమును స్థాపించి దానిని క్రమముగా వృద్ధి నొందించెను. ఈమహారాష్ట్ర రాజ్యము మొగలాయి సామ్రాజ్యమునకే కాక దక్కనులోని ముస్లిము రాజ్యములకును ప్రక్కలోని బల్లెమయినది. క్రీ. శ. 1680లో శివాజీ మృతి నొందిన వెనుక అతని కుమారుడు శంభాజీ క్రీ. శ. 1680-89 మహారాష్ట్ర రాజ్యమున కధిపతియయ్యెను. దక్షిణ హిందూదేశ రాజ్యములలో మహారాష్ట్రరాజ్యము గణనీయమయినదై ఇంతటినుంచి రాజకీయరంగమున ప్రముఖపాత్రను వహించినది.

గోలకొండ కుతుబుశాహి సుల్తానులు విద్యాగంధ సంవాసితులు, ముస్లిం విద్యావిశారదులు; వారు అరబ్బీ, ఫారసీ భాషలను చక్కగా అభ్యసించినవారు. వారిలో కొందఱు కావ్యగీతి ప్రియులు, మఱికొందఱు స్వయముగా కవులు. వారి యాస్థానము ఆశ్రయము వెదకికొనుచు వచ్చిన విదేశీయులు ఫారసీ, అరబ్బీ భాషా విద్వాంసులతోను, గొప్ప లేఖకులతోను, కవులతోను నిండియుండెడిది.

## మొగలాయి పరిపాలనము

ఔరంగజేబు పాదుషానే ఆలంగీరు పాదుషా యందురు. క్రీ. శ. 1687 లో ఇతడు గోలకొండ కోటను బట్టుకొన్న నాటినుంచి తెనుగుదేశము ఇతనికి స్వాధీనమైనట్టే కాని నిజముగా ఇతని యధీనములోనికి వచ్చినది ఒక్క గోలకొండయు తత్పరిసర ప్రాంతమునే. మిగిలిన తెలుగుదేశములోని సామంతులందఱు గోలకొండ కోట పడిపోవుటతో స్వతంత్రులై తమతమ ప్రాంతములను బరిపాలింపజొచ్చిరి. ఆలంగీరుపాదుషా దక్షిణమున కన్యాకుమారి వఱకు గల దక్షిణ హిందూదేశము నంతను మొగలాయి అధికారము క్రిందికి తీసికొని వచ్చుటకు తనని ప్రధాన సైన్యాధిపతి జుల్ఫికార్ ఖానును నియోగించెను. ఇతడు రాయలసీమయందలి ముఖ్యదుర్గములనే కాక మైసూరు తంజావూరు మధుర రాజ్యములను గూడ జయించి మొగలాయి అధికారమును దక్షిణసముద్రము వఱకు వ్యాపింపజేసెను. ఔరంగజేబు పాదుషా పరిపాలనలో దక్కనుదేశమంతయు పరిపాలన సౌకర్యము నిమిత్తము ఖాన్‌దేశ్, ఔరంగాబాదు, బీదరు (బేదర కోట), బేరారు, విజాపూరు, హైదరాబాదు అని ఆరు సూబాలుగా విభక్తమయినది. వీటిలో హైదరాబాదు సూబాలోనే తెలుగుదేశమంతయు చేరినది. ఆలంగీరు పాదుషాకు ముఅజ్జం, అజం, కాంబక్ష్ అని ముగ్గురు కుమారులు. వీరిలో కాంబక్షును ఆలంగీరు దక్కను దేశాధిపతిగా నియమించెను. ఇతనికి హైదరాబాదు నగరము రాజధాని. మొగలాయి సామ్రాజ్యమునకు కంటకముగా నున్న మహారాష్ట్ర రాజ్యమును, ఇతర హిందూరాజ్యములను అణచివేయుటకై ఎడతెగని యుద్ధములు చేయుచు చివరకి ఆలంగీరు పాదుషా 1707వ సంవత్సరమున కాలధర్మము నొందెను.

ఆలంగీరుపాదుషా మరణానంతరము ఢిల్లీ సింహాసనమునకై అతని కుమారులలో కలహము రేగినది. తుదకు ముఅజ్జం అను ఆలంగీరు జ్యేష్ఠపుత్రుడు షా ఆలమ్ అని, బహదూర్‌షా అని బిరుదులు వహించి సింహాసనమెక్కెను. ఇతడు సింహాసన మెక్కిన వెంటనే హైదరాబాదులో కాంబక్ష్ స్వతంత్రుడయ్యెను.

బహదూర్‌షా తన సోదరునిపై దండెత్తివచ్చి హైదరాబాదువద్ద క్రీ. శ. 1709లో ఓడించి హైదరాబాదును మరల ఢిల్లీయధికారము క్రిందికి దీసికొని వచ్చెను. ఇతని యనంతరము ఢిల్లీసింహాసనము నధిష్ఠించిన జహాందరుషా (క్రీ. శ. 1712-1713), ఫరూఖ్ సియారు (క్రీ. శ. 1713-1719), పాదుషాలు నిస్తేజులు, భోగపరాయణులు. ఫరూఖ్‌సియారు పరిపాలన కాలములో అధికారమంతయు వజీరు, సైన్యాధిపతి పదవులయందుండిన సయ్యదుహుస్సేన్‌ఆలీ, సయ్యదు అబ్దుల్లాఅను సయ్యదుసోదరుల చేతులలోనుండెను. వీరు షియా సాంప్రదాయమువారు, దేశీయముసల్మానులు. వీరిలో సయ్యదుహుస్సేన్‌ఆలీ దక్కను రాజ

ప్రతినిధి; సయ్యదుఅబ్దుల్లా అలాహాబాదు కధిపతి. ఆ కాలమున వీ రుభయులు తమ చెప్పుచేతలలో నున్న వానిని సింహాసనస్థుని జేయుచు, తదితరుల పదభ్రష్టుని జేయుచు సర్వాధికారులై సర్వసమర్థులై యుండిరి. వీరు హిందువులయిన మహారాష్ట్రులతోను రాజపుత్రుల తోను మైత్రికలిగి వారి సాయముతో మొగలాయి సామ్రాజ్యమును బలపఱుపవలెనని ప్రయత్నించిరి. వీరి యీ హిందూపక్షాభిమాన విధానము ఢిల్లీపాదుషాల కొలువుకూటములోని విదేశీ ముస్లిములకును అధికారవర్గమువకును కంటకమైనది. ఏ వర్గమునకావర్గమే పాదుషాను లోబఱచుకొనుటకును, ఇతరపక్షము నణచివేయుటకును కుట్రలు జరుగుచువచ్చినవి. సయ్యదులకు వ్యతిరేకపక్షమువారు తాత్కాలికముగ పాదుషాను వశపఱచుకొని సయ్యదుహుస్సేన్‌అలీని దక్కనుకు పంపించివేసిరి. అటుపిదప వారి ప్రోత్సాహమున పాదుషా మహారాష్ట్రులను హుస్సేన్‌అలీరాజ్యముపై దండెత్త ప్రేరేపించెను. మహారాష్ట్ర రాజ్యమప్పుడు పేష్వాలలో మొదటివాడును రాజ్యతంత్రజ్ఞుడును అయిన బాలాజీవిశ్వనాథుని యధికారముక్రింద నుండెను. ఢిల్లీపాదుషాఇచ్చిన ఈ సదవకాశమును దీసికొని బాలాజీ విశ్వనాథుడు మహారాష్ట్ర సైన్యమును దక్కను రాజ్యముపై నంపెను. హుస్సేన్‌అలీ మహారాష్ట్రుల ధాటికాగలేక వారితో సంధికావించుకొనెను. ఈ సంధివలన వింధ్యగిరి మొదలు కన్యాకుమారివఱకు గల దేశములోని మొగలాయి సామ్రాజ్యపు సుబాలలోను, సామంత రాజ్యములలోను చౌధాయి సర్‌దేశ్‌ముఖిరూకలు వసూలుచేసికొనుటకు మహారాష్ట్రుల కధికారము కలిగినది. హుస్సేన్‌అలీకి ఈ మహారాష్ట్ర దండయాత్ర ఢిల్లీలోని తన వ్యతిరేకపక్షమువారి ప్రోద్బలమున జరిగినదని తెలిసి యతడు మహారాష్ట్రులతో సంధిచేసికొన్న యనంతరము ఢిల్లీకి వెళ్ళి ఫరూఖ్‌షియారును పదభ్రష్టుని కావించెను. తరువాత నీసయ్యదు సోదరులు మరి యిరువురు పిన్నవయస్కులను ఢిల్లీ సింహాసనమెక్కించిరి. కాని వారు సింహాసనమెక్కిన కొద్దికాలముననే కొన్నిమాసములలోనే చనిపోయిరి. పిదప సయ్యదుసోదరులు ఢిల్లీ సింహాసనమెక్కించిన పాదుషా ముహమ్మదుషా (క్రీ. శ. 1719-1748). ఈతని పరిపాలన కాలములోగూడ నీసయ్యదు సోదరుల యధికారము నంతమొందించి వారిని కూల్చివేయుటకును, పాదుషాను వశపఱచుకొనుటకును కుట్రలధికమయినవి. ముహమ్మదుషా కూడ సయ్యదుల వద్దిలోనుంచి తప్పించికొని స్వేచ్ఛబడయుటకు తరుణమున కెదురుచూచుచుండెను. సయ్యదుల ప్రతిపక్షమునకు చిన్‌కిలిచ్‌ఖాను నాయకుడు. ఇతనికి ఆసఫ్‌జా యనియు, నిజాముల్ ముల్క్ అనియు బిరుదములు. ఇతని నాయకత్వమున ఇతని పక్షమువారికిని సయ్యదులకును కలహములు రేగినవి. ఉభయవర్గములవారికిని జరిగిన సంగ్రామములలో సయ్యదు సోదరులు హతులైరి. ముహమ్మదుషా నిజామ్‌ఉల్‌ముల్క్‌నుదక్కనురాజ్యమునకధిపతిగా నియమించెను. సయ్యదు హుస్సేన్ అలీ యనంతరము నిజామ్ ఉల్ ముల్క్ ఢిల్లీకి వజీరయ్యెను. సయ్యదులు గతించినను ఢిల్లీకొలువు కూటపు వెనుకటి వాతావరణము మాఱలేదు. కుట్రలింకను సాగుచునే వచ్చినవి. నిజామ్‌ఉల్‌ముల్క్ వజీరు పదవికే కాదు, ప్రాణమునకే మోసమువచ్చునట్లు కనిపింపగా తుదకతడు ఏదో యొక సాకుచెప్పి పాదుషా యనుమతిగైకొని దక్కనుకు క్రీ. శ. 1723 లో మరలి వచ్చెను. ఇంతలో తన యాశ్రితుల సలహామీద ముహమ్మదుషాఖాన్ దేశ పరిపాలకుడు ముబారిజ్‌ఖాన్‌ను దక్కనుకధిపతిగా నియమించి నిజామ్‌ఉల్‌ముల్క్‌పై నెత్తివెళ్ళవలసినదని యాదేశించెను. ముబారిజ్‌ఖాను సైన్యములకును నిజామ్‌ఉల్‌ముల్క్ సైన్యములకును క్రీ. శ. 1724లో శక్కరఖేడ గ్రామమునొద్ద భయంకర సంగ్రామము జరిగినది. ఆయుద్ధములో ముబారిజ్‌ఖాను హతుడయ్యెను. విజయమునొందిన ఆసఫ్‌జా నిజామ్‌ఉల్‌ముల్క్ హైదరాబాదుకు వచ్చి దానిని రాజధాని కావించుకొని ఆనాటినుంచి స్వతంత్రుడై పరిపాలించెను. ఈతనితోనే ఆసఫ్‌జాహీవంశ మారంభమయినది. ఆసఫ్‌జాహి వంశజులకు నిజామ్‌ఉల్‌ముల్క్ అను బిరుదము వంశపారంపర్యముగ వచ్చుచున్నది.

### ఆసఫ్‌జాహి వంశపరిపాలనము

ఆసఫ్‌జా నిజామ్‌ఉల్‌ముల్క్ క్రీ. శ. 1724 మొదలు 1748 వఱకు పరిపాలించెను. ఆతని మరణానంతరము దక్కను సింహాసనమునకై నాజరుజంగు ముజఫర్‌జంగులకు పోరాటము సంభవించినది. ఈ పోరాటములో ఈ దేశములో రాజ్యము సంపాదించవలెనని తలంపుగొన్న ఇంగ్లీషువారు నాజరుజంగు పక్షమును ఫ్రెంచివారు (పరాసువారు) ముజఫర్ జంగు పక్షమును వహించిరి. నాజరుజంగు ఈ పోరాటమున విజయమందెను కాని సింహాసనమెక్కిన రెండేండ్లలోనే క్రీ.శ. 1 50 లో నిహతుడయ్యెను. వెన్వెంటనే ఫ్రెంచి

వారు ముజఫరు జంగును హైదరాబాదు నవాబుగ ప్రకటించిరి. కాని యా సంవత్సరముననే యతడును హతుడయ్యెను. అటు తరువాత ఫ్రెంచివారు తరుణము పోగొట్టుకొనక సలాబత్ జంగును హైదరాబాదు సింహాసన మెక్కించిరి. ఈతని కాలమున హైదరాబాదు రాజకీయ వ్యవహారములో ఫ్రెంచివారిదే పైచేయియు, పలుకుబడియును. సలాబత్ జంగ్ క్రీ. శ. 1761 లో నిహతుడయ్యెను. ఇతని యనంతరము నిజాం అలీఖాను ఇంగ్లీషువారి సాహాయ్యముతో నవాబయి వారికి ప్రతిస్పర్ధులయిన ఫ్రెంచివారిని తన కొలువులో నుండి వెడలగొట్టెను. ఇతడు క్రీ. శ. 1803 వరకును పరిపాలించెను. ఇతడే క్రీ. శ. 1766లో ఉత్తర సర్కారులను, శ్రీరంగపట్టణపు ముట్టడిలో టీపు సుల్తాను హతుడైన వెనుక క్రీ. శ. 1800లో రాయలసీమను బ్రిటీషువారికి కొసంగెను. ఇప్పుడు రాయలసీమగా వ్యవహరింపబడుచున్న కడప, కర్నూలు, బళ్ళారి, అనంతపురము జిల్లాలు నిజాముల్ ముల్క చేత బ్రిటీషువారి కియ్యబడిన వగుటచేతనే ఇటీవల చాల కాలమువరకు అవి దత్తమండలములని వ్యవహరింప బడుచువచ్చినవి. అప్పటినుంచి రాయలసీమయు ఉత్తరసర్కారులను సముద్రతీరస్థ ఆంధ్రదేశమును బ్రిటీషు పరిపాలనములోనికి పోగా మిగిలిన ఆంధ్రదేశము నిజాముల్ ముల్క క్రిందనే యుండిపోయెను. అప్పటినుంచియే హైదరాబాదు రాజ్యములోని యాంధ్రదేశము విభాగమునకు తెలంగానా యనుపేరు రూఢమయినది.



# తెలంగాణము - ప్రాచీనాంధ్రవాఙ్మయము



## శ్రీ దూపాటి వెంకటరమణాచార్యులు

ఈ వ్యాసమునందుఁ దెలంగాణము నందు ఆంధ్ర వాఙ్మయ మేవిధముగాఁ బెంపొందెనో రాజులు ప్రజలు మాతృభాషను ఏవిధముగా సేవించి ధన్యులైరో తెలుపఁదలంచితిని. ఒక కాలమునఁ త్రిలింగదేశము తెలంగాణ మనునది యావదాంధ్ర దేశమునకుఁ బర్యాయ పదముగా నుండెను. కాలక్రమమున నిజాము రాష్ట్రములోని తెలుఁగుదేశమును తెలంగాణా అనియు తెలంగాణము అనియుఁ వ్యవహరించుట అలవాటయినది. రాజకీయముగా తెలంగాణమునకు సుబేదారును ఏర్పఱచి ఆయన పర్యవేక్షణము క్రింద తెలుఁగు జిల్లాలనుంచిరి. అందుచే నిరాష్ట్రములోని ఆంధ్ర మండలముల కన్నిటికి తెలంగాణము అను వ్యవహారము రూఢమయినది. ఈ తెలంగాణమును బూర్వము పరిపాలించిన ఆంధ్ర నృపాలరత్నములగు తూర్పుచాళుక్యులు ఆంధ్రచోడులు కాకతీయులు పాలించు కాలమున నంధ్రభాష పొందిన వికాసము శాసనములలో అజ్ఞాతకవులు గావించిన కవితారచనలు రెడ్లు వెలమ వారు ఆంధ్రభాషను పెంపొందించిన రీతులు గోలకొండ నవాబులు ఆంధ్రకవితకు దోహదమొసంగిన విధము ప్రజాయుగమున నొందిన ఆంధ్ర కవితావిజృంభణము దిఙ్మాత్రముగాఁ జర్చించుటకు తెలంగాణమునఁగల యాంధ్ర వికాసజ్యోతి యెట్లు వెల్గిచల్లారినదో తెలిపి వర్తమాన స్వాతంత్ర్య యుగమున ఆంధ్ర వాఙ్మయ తరంగిణీ తరంగములు విశాలాంధ్రదేశమున శీతలశీకరముల వెదఁజల్లిన విధము ప్రశంసించుటయే ప్రకృతవ్యాసమునఁ జర్చనీయమగు అంశము.

తూర్పు చాళుక్యులలో గుణగగణ విజయాదిత్యుఁడు విక్రమాదిత్యుఁడు ప్రఖ్యాతులు సోదరులు. విక్రమాదిత్యుఁడు రాష్ట్రకూట నృపాలుఁడగు రెండవ కృష్ణరాజుచేఁ జంపఁబడెను. ఈ విక్రమాదిత్యుని కుమారుఁడు చాళుక్యభీముఁడు. ఇతఁడు క్రీ. శ. 888 నుండి 918 వఱకు హనుమకొండ ప్రాంతమునుగూడ బాలించి యుండెను. కొఱవి శాసనమువలన నీవిషయము దెలియుచున్నది. చాళుక్యభీముఁడు కొఱవిలో స్థాపించిన శాసనము ఆంధ్రభాషలో నున్నది. శాసనకాలము నన్నయభట్టారకుని భారత రచనముకంటె దాదాపు నూటేండ్లు ముందుది. సలక్షణముగనున్న తెలుఁగువచనము శైలి కొకభాగ ముదాహరింతును.

1 శ్రీ విక్రమార్క నృపా
2 గ్రతనయుణ్డయ్య చాళుక్య
3 భీమునకు శౌచకన్దప్పర్
4 నకు వేగీశ్వరునకు రన
5 మర్ద్దాన్వయ కుల తిలకు
6 ణ్డయ్న కుసుమాయుధుణ్డుగ
7 న్నర బల్లహునికి సంప్రాప్త
8 ంబయ్న రనమర్ద్దక శ్రీమదన
9 భుజ వీర్య్య పరాక్ర
10 మంబున............

1......శ్రీ నిరవ
2 ద్యుణ్డనేక సమరసంఘ
3 ట్టణ భుజాసి భాసుర
4 ణ్డైతమ యన్న రాజశ్రీ
5 కెల్లన్దానయ ఈశుణ్డై
6 చేకొని నిల్పి భీమసలు
7 కియన్దనేక వస్తు వా
8 హ నోత్సవంబుల్పడయు
9 చు తమయన్న గాణగయ్య
10 చేసిన ధమ్మ్కర్వులు

శైలి వైఖరి చూచినచో వచనరచనము భారత రచనమున నన్నయ్యభట్టు వ్రాసిన వచనముల కంటె మిన్నగ సలక్షణముగ నిగ్గులుతీరియున్నది. గణగవిజయాదిత్యుని రాజ్యమును జూచుచు అతని ధర్మములఁ గాపాడుచున్న చాళుక్యభీముఁడు కొఱవిలో వేయించిన యీ శాసనము చివరభాగము విఱుగఁ గొట్టఁబడినది. రాజరాజ నరేంద్రునకు నూటేండ్లకుముందు ఒరంగల్లు

ప్రాంతము తూర్పుచాళుక్యుల యధీనము నుండెను. ఆ కాలమున కంభముమెట్టు ఓరుగల్లునకు మధ్యనున్న కొలని ప్రఖ్యాతినొందిన పట్టణము. వచనవాఙ్మయము కొలని ప్రాంతమున నెట్లు క్రమవికాసము నొందెనో యీ శాసనమువలనఁ దెలియును. తూర్పుచాళుక్యులు గావించిన ఆంధ్ర భాషాసేవ అపారము. ఇది గమనించేయు నన్నెచోడ మహాకవివర్యుఁడు కుమార సంభవము నందు.

కం॥ మును మార్గ కవిత లోకం
బున వెలయఁగ దేశి కవితఁబుట్టించి తెనుం
గు నిలిపిరంధ్రవిషయమున
జన సత్యాశ్రయుని దొట్టి చాళుక్యనృపుల్

అని వ్రాసినట్లు ఆంధ్ర భాషోద్ధారకులు తూర్పుచాళుక్యులనుట సత్యము. తెలంగాణమునఁ బశ్చిమ చాళుక్యులు స్థాపించిన శాసనములు పెక్కులు లభించినవిగాని యవియన్నియు సంస్కృతమున కర్ణాటమున నున్నవి. వారలాంధ్రభాషకు ఎట్టి అభ్యుదయకర ప్రయత్నములు చేసినట్లుగానరాదు. కాకతి రాజు త్రైలోక్య మల్లుని రాజకీయోద్యోగి. చరిత్రమున మొదటిప్రోలరాజని వ్యవహరింతురు. ఈయనశాసనములు కరీమునగరము జిల్లాలో సనిగవరమున కెంటిని గని పెట్టితిమి. అవియుఁగర్ణాట భాషయే. మఱి కొన్ని తావుల సంస్కృతమందుఁగలవు. మొదటి ప్రోలరాజు తరువాతనే కాకతీయులు ఆంధ్రభాషపై మక్కువఁ జూపిరని చెప్పవచ్చును. రెండవ బేత రాజ క్రీ. శ. 1060 నుండి 1115 వఱకుఁబశ్చిమ చాళుక్యరాజగు ఆఱవ విక్రమాదిత్యుకడ రాజప్రతినిధిగనుండెను. విక్రమాదిత్యుఁడు ఆంధ్రదేశము నాక్రమించుకొని కాంచీ నగరము వఱకు దండయాత్రలు సలిపెను. ఇతని విజయములు విక్రమాంక దేవ చరిత్రమున బిల్హణకవి ప్రశంసించియుండెను. ఇతని కాలమున సంస్కృత భాష పెంపొందినట్లు కానవచ్చును. తెలంగాణమున నీతని శాసనము లెక్కువగఁ గర్ణాటభాషలోఁగాన వచ్చుచున్నవి. రెండవ బేతరాజు ఓరుగంటి ప్రాంతమున నెలకొల్పిన శాసనములో రెండుమూఁడు వచన రూపముగ నాంధ్రభాషయందుఁ గనిపించును. ఈతఁడె కాకతీయ నృపులలో ఆంధ్రభాషాసేవ శాసన వాఙ్మయమునఁదొలుదొల్త వెలయించిన ధన్యుఁడు.

జనగామ తాలూకా గూడూరులో గ్రామమధ్య నొక శాసనముగలదు. అందు కొంత భాగము కన్నడ పద్యములు కొంతభాగము తెలుఁగు పద్యములతోను న్నది. తెలుఁగు పద్యములె ప్రాచీనములు. అందుఁ బేర్కొనఁబడిన కాకతి బేతభూపాలుఁడు క్రీ. శ. 1050 నుండి యున్నవాఁడో క్రీ. శ. 1080 నుండి యున్నవాఁడో కావచ్చును. పద్యములలోని చరిత్రము సందిగ్ధముగానున్నది. మనకుఁ గావలసినది కాకతీయ బేతభూపతి నాఁటికవిత. కొలని చాళుక్యులకు నెలవు విర్యాలగోత్రుఁడగు ఎఱ్ఱభూపాలుఁడు బేత రాజును కొలనిలో రాజును జేసెను. అతనిభార్య కామసాని భర్తృధర్మము కాపాడెనని యీ పద్యముల భావము.

ఉ॥ భావితకీర్తి నాతనికి పాండవమధ్యమభీముఁడో యనం
గా విరియాలభీమ, నృపఘస్మరుఁడైయుదయించె వానికిన్
భూవినుతుండు మాండలికభూషణుఁ డెఱ్ఱనరేంద్రుఁ
డుత్తమ
శ్రీవినుతుండుబంధుజనసేవ్యుఁడు తానుదయించె నున్నతిన్

చ॥ అతఁడని బొట్ట బేతవసుధాసుతుఁ జేకొని వానివైరిను
ద్ధితముగఁజంపి యాకొలని దేశమునందుఁ బ్రతిష్ఠఁ జేసి...

చ॥ అదుదగునట్టి ఎఱ్ఱనృపునంగన కామనసాని యాకమే
ల్లగదని బేతభూవిభుని కాకతివల్లభుఁ జేసివాని తాఁ
పరగఁగఁ జేతబట్టి ఘనుపల్లవరాయని యాగిజొచ్చె భా
స్కరనిభుఁ జక్రవర్తిగని కాకతి నిల్పుట కోటిసేయదే.

ఈశాసన పద్యములు నన్నయ భట్టారకుని భారత రచనకు ముప్పదియేండ్లు ముందువో వెనుకవియో గావలయును. పద్యరచనము ధారాశుద్ధితో నలరారి విషయ సమీకరణమునందు మేలు బంతిగనున్నది. కాకతి ప్రోలరాజు కాలమున సామంతుఁడగు వేము చోళబొద్దను మల్లయ్యనాయకుఁడు విక్రమ శకము 45 న (క్రీ. శ. 1120 లో) మాటేడులో వేయించినశాసనము పద్యములతో నలరారుచున్నది. రమణీయమగు శైలిలోనున్న శాసనపద్యములలో నొక్కటి మాత్రముదాహరించిన ప్రోలభూపతికాలమున ఆంధ్రకవితావిధము తెలిసికొనవచ్చును.

"శ్రీవాణీప్రియుఁడాది కర్త త్రిజగత్స్రష్టయుఁడు
బుట్టింప భూ
దేవక్షత్రియ వైశ్యశూద్రుల మహాతేజంబుతో
వారలం
గావంబూని పులింద వంశగతులం గమ్యుండు
తద్వంశజుం
డావిర్భూతయశుండు బూచన సుపుణ్యాత్ముండు
బుట్టెమహిన్"

ద్వితీయ ప్రోల భూపాలుని కాలమున హనుమకొండ

నగర పాలకుండుగ నున్న గంగాధరమంత్రి వేంగీదేశనివాసి. రుద్రదేవుని కాలమునఁ గాకతీయసామ్రాజ్యమునకుఁ బ్రధానామాత్య పదవి నొంది లలితకళాప్రియుఁడై పుణ్యక్షేత్రములలో నాలయప్రతిష్ఠలు గావించెను. అర్హమతము వాఁడైనను చతుర్వింశతి మూర్తియుతముగఁ జైనప్రతిష్ఠయు బుద్ధప్రతిష్ఠ గొనర్చెను. ఈ గంగాధరుఁడు స్వయముగాఁ గవి. కృతుల నొందితినని చెప్పుకొనినాఁడు. నగునూరు ( కరీము నగరము జిల్లా ) లో మనోహరతర శిల్పవిన్యాసములతో నలరారు దేవగృహముల గట్టించి యచటఁ దాను రచించిన పద్యములతో నొకశాసనము స్థాపించినాఁడు. ఆ శాసనము ఆలయ శిలాఖండములతోఁ బాటు కరీము నగరమున ప్రభుత్వము వారి భవన నిర్మాణమునకై చేర్పఁబడి యొకచోఁ బాఁతఁబడినది. శాసన కాలము క్రీ. శ. 1170. గంగాధరుఁడు ప్రోలరాజు ప్రచండ భాస్కరునివలె ఆంధ్రదేశనభోవీథి వెలుఁగు కాలమునను రుద్రదేవుఁడు కళాభిరాముఁడై బాలచంద్రునివలె దినదిన ప్రవర్ధమానుఁ డగుచున్న శరద్రాత్రులందును నున్నవాఁడు. ఈతనికవిత రసపరిప్లుతము, మనోజ్ఞము. సంపూర్ణరూపముగ నున్న యీతని శాసన కవితనుండి మచ్చునకుఁ గొన్ని పద్యములనుదాహరించి పాఠక మహాశయుల తన్మయులఁ గావింతును.

చ॥ సకల కలావిధిజ్ఞుఁ డనఁ జాలి సమస్త జనాలి సద్గుణ
ప్రకరము నెప్పుడున్ బుధసభన్ బ్రణుతింపఁగ
నున్న యట్టినన్
ప్రకటితకీర్తి ప్రోల జనపాలుఁడు ఘోరతరాజి
లోలుఁడ
త్యకుటిల చిత్తుఁడీతఁడని యాదరికన్ బిలిపించి
పంపఁగాన్॥

చ॥ పరనరపాలమౌళి మణి భాస్వరదీప్తిలతానితాంతవి
స్ఫురిత పదాబ్జుచే నహితభూతలనాథవరూధినీసరో
వరమథన ప్రభూత మదవద్విరదాధిపుచే విరోధిభూ
ధర శిఖర ప్రభిన్నవిదితత్రిదశేంద్ర నిశాతహేతి
చేన్॥

చ॥ వెలయ నమాత్యసంపదయు విశ్రుతమైన నియోగ
వృత్తులం
దలము సితాతపత్రముల తర్క్య విభూషణలేపనాఁ
బరం
బులు తగు వృత్తులన్ బడసి భూసురవర్గముఁ బ్రోచి
దేవతా
నిలయము లెల్లఁ బెక్కొనర నిల్పుచుఁ బూజలు
బ్రీతిచేయుచున్॥

ఈ గంగాధరమంత్రి కవిత యసాధారణమైనది. కాకతి రుద్రదేవుఁడు కూడఁ గవితాభూషణుఁడు. నీతిసారము అను రాజనీతి శాస్త్రము రచించెనని వినికి. మంత్రియు రాజును గవిచక్రవర్తులై అచింతేంద్ర వర్యుఁడు ఆస్థాన కవియై యలరు పుణ్యకాలమున వాఙ్మయసేవ యెంతయేని జరిగియుండును. దురదృష్టవశమున ఆ పవిత్ర చిహ్నములగు గ్రంథసముదాయము నశించుట విచారకరము.

ఆంధ్ర చోళవంశమున జనించిన గోకర్ణుఁడు సరిగా గంగాధరమంత్రి వలె ప్రోలరాజు - రుద్రదేవుల కాలము వాఁడు. ఇతని శాసనములు గూడనీ విషయము స్థాపించుచున్నవి. గోకర్ణుఁడు గోకర్ణచ్ఛందస్సు చేసెను. అప్పకవి దీనిని పేర్కొనెను. ఇదియె కవిజనాశ్రయమని కొందఱనుచున్నారు కాని విశ్వసనీయము గాదు. ఉదయాదిత్యుని పేరనొక యలంకార శాస్త్రము రచించినట్లు వినుచున్నాము. ఉదయాదిత్యుఁడు పానుగల్లు ప్రాంతము పాలించు రాజు. పండితారాధ్య చరిత్రమువలన నితఁడు మల్లికార్జున పండితారాధ్యునికి సమకాలికుఁడని తెలియును. ఈ విధముగా చోడులు గూడ ఆంధ్రభాషాసేవ గావించిన ధన్యులు. ఆంధ్రచోళుల రాజధాని యగు వర్ధమానపురమును రుద్రదేవుఁడు ధ్వంసముచేసి నగర మధ్యమునఁ దటాకము నెలకొల్పితినని సగర్వముగా అనుమకొండ శాసనమునఁ జెప్పికొన్నాఁడు. అందుచేఁ గాఁబోలు ఆంధ్రచోడుల వాఙ్మయసేవ కాధారములు లభింపకున్నవి. ప్రజారంజకులగు వీరల దేవాలయములు శిల్పసంపదతో నొప్పి నేటివఱకు అశ్రుసేచన సౌభాగ్యమును గళావిదులచేఁ జూఱఁగొనుచుండుట మఱువరాని యంశము.

బెక్కల్లు అను గ్రామమునఁ గొండపయి పద్యశాసనమొండుగలదు. అదియు క్రీ. శ. 1100 ప్రాంతము లోనిది. నకలు నాయొద్ద లేనందునఁ బద్యముల నుదహరింపలేము. తిక్కన సోమయాజికి నన్నయభట్టునకు మధ్యకాలమున నాంధ్రకవిత తెలంగాణమునందుఁ బెంపొందినట్టుల నీ శాసన కవితదృష్టాంతముగఁ దీసికొనవచ్చును. ఈ శాసనకవుల గ్రంథరచనము గాంచు నదృష్టముమాత్రము చేకూరలేదు. చేకూరుననుఆశయు లేదు. భూలోకమల్లుని ప్రతినిధియగు గుండాధిపుఁడు రెండవ ప్రోలరాజు కాలమువాఁడు. మంథెనపాల

కుఁడు. పశ్చిమ చాళుక్యనృపులు దేశమునిండ కర్ణాట భాషాశాసనములు ముంచియెత్తు కాలమున సూరేశ్వరాలయమును ప్రతిష్ఠించి తెలుఁగు వచనశాసనము మంథనలో స్థాపించినాఁడు. అందు గుండ్రెడ్డియనునామము చేర్కొనఁబడుటచే గుండాధిపుడు రెడ్డికావచ్చునని తోఁచుచున్నది. కాకతీయయుగమున రుద్రదేవుని వఱకుఁగల నజ్ఞాతకవితావిలాసములు దిఙ్మాత్ర ముదాహరించితిమి.

గణపతిదేవ చక్రవర్తి ఆంధ్రదేశమును పాలించిన కాలమగు క్రీ. శ. 1199-మొదలు 1261 వరకు ఆంధ్ర కవితకు సువర్ణయుగము. పరిణతవయస్కురాలై ఆంధ్ర కవితాకన్య హావభావముల వెల్లడించిన దీ పుణ్యకాలమందె. ఒక యజ్ఞాత శాసనకవి ఉప్పరపల్లి శాసనమునుండి మనోహర కవితాగాన మొనరించినాఁడు. అందలి కవిత దిలకించుచో ఎందరెందఱు మహాకవుల రచనములు కాలగర్భమున మరుగుపడినవో తెలియఁగలదు.

క॥ ఉరగేంద్ర దిగ్గజములకుఁ
బరమోత్సాహముగ నాత పత్రము లోలెం
ధరయెత్తిన కిరివరుఁడగు
హరి కాటయకీవుతము దయామతి శుభముల్

మ॥ ప్రతిపక్ష క్షితిపాలకుంజరమద ప్రారంభ సంరంభము
ద్ధత బాహానిహిత ప్రచండ నిశితోద్యత్ఖడ్గ ధారానఖా
హతి భేదించి యఖర్వగర్వబలశౌర్యస్ఫూర్తిఁ గంఠీరవా
కృతియై సన్నుతవృత్తిఁదాల్చి వెలసెన్ రేచర్ల రుద్రుండిలన్

కాకతీయగణపతి ముఖ్యామాత్యుఁడు శివదేవుఁడు. ఇతఁడు రాజకీయ చాతుర్యమందె గాక కవితాప్రాభవమునందును పేరుచెందిన రసికుడు పురుషార్థసార మను ఉత్తమగ్రంథమును శివదేవధీమణి శతకమును రచించెను. అవియిప్పుడు లభించుటలేదు. సకలనీతిసమ్మతమున మడికిసింగన అందలిపద్యములఁ బెక్కింటిని నుదాహరించెను. ఉపలబ్ధములగు పద్యములవలన అది యొక రాజనీతిశాస్త్రమనియుఁ దెలుఁగుతనము వెల్లడించు అలఁతిపదములతో హృదయరంజకమగు శైలితో నలరారు పురుషార్థసారము లోపించుట భాషాసేవకుల దురదృష్టము. శైలికొకపద్యము నుదాహరించిన గా కృతి గొప్పదనము గ్రహింపవచ్చును.

చ॥ వెనుకకుబోక హాయనక వేసటనొందక బంతిబంతిలోఁ
బెనుపక కానమింప్రభుమని పెగ్గిలకెంతయు మున్నుఁ జూచుచుం
గనుకని యక్షరాక్షరము కందువుతప్పకయేకచిత్తుఁడై
యనుపమభక్తితోఁ జదువు నాతనివాచకుఁడండ్రు సజ్జనుల్

ఈ శివదేవునినె గణపతిచక్రవర్తి రుద్రమదేవి దీక్షాగురువగు విశ్వేశ్వర శివశంభువుగా చారిత్రికులు నిరూపించుచున్నారు. ఇదియొకభ్రమ. విశ్వేశ్వర శివశంభువు ఆంధ్రేతరుఁడు. గోళగి మఠాధ్యక్షుఁడు. అతని మాతృభాష తెలుఁగుకాదు. అతని శాసనము శ్లోకమయము.

గణపతిదేవునికాలమున తిక్కనసోమయాజి ఓరుగంటికివచ్చి భారతమువినిపించి రాజకీయ కార్యముల సాధించెనను కథ యనుశ్రుతముగ వినఁబడుచున్నది. అదియు సత్యమెకావచ్చును. తిక్కనసోమయాజి గణపతిదేవుని సమకాలికుఁడు. అతని శిష్యుఁడును సరసకవియునగు మారన మార్కండేయపురాణము తెలిఁగించి గన్నసైన్యపతి కంకితమునిచ్చుటఁజూడ తిక్కనసోమయాజి సశిష్యుఁడై యోరుగంటికివచ్చి రాజప్రార్థనముచే మారనను అచ్చటనుంచెనని యూహింపవచ్చును. కాని సర్వప్ప సిద్ధేశ్వర చరిత్రములో ఓరుగంటికి గణపతిదేవుని కాలమున తిక్కనవచ్చుట మనోహరముగ వర్ణించియున్నాఁడు.

రుద్రమదేవి రాజ్యపరిపాలనము గావించిన క్రీ.శ. 1261 నుండి 1296 వఱకు ఆంధ్రసామ్రాజ్యమునకెడతెగని వసంతకాలము. అప్పుడే గోనబుద్ధభూపాలుఁడు, కాచవిభుఁడు విఠ్ఠలరాజు తెలుఁగునుడికారములతో రామాయణము దేశీయచ్ఛందస్సులతో రచించి ప్రతిష్ఠనార్జించిరి. రంగనాథుఁడను కవియే బుద్ధభూపతి పేర రామాయణము రచించెననియు అది రంగనాథ రామాయణమని ప్రశస్తిగాంచుటయే రంగనాథుని కర్తృత్వమును వెల్లడిచేయుచున్నదనియు నొకవాదము కలదు. నిజమని విశ్వసించవచ్చును. సరిగా నీకాలముననే రంగనాథ కవియుండెను. ఇతఁడు సంస్కృతాంధ్రములలోఁ పేరుచెందిన కవి. కర్ణాటక భాషలోఁ గూడఁగొన్ని కావ్యములు రచించెను. శివస్తుతిఁగావింపనందున ఈతని కనులు బోవనయనగతిరగడ అను శివభక్తిదీపిక రచించి మరలఁ గనులఁ బొందినటుల నాగ్రంథమున నాధారములు గలవు. ఈరంగనాథుఁడు నురుద్రమదేవి కాలమున నుండెను. భాస్కర రామా

యణములోని భాగము వ్రాసిన భాస్కరుఁడు లేముల వాడ భీమకవి యీ కాలమువారె. మల్యాలగుండ నాయకుఁడు రుద్రమదేవి సేనానాయకుఁడు. ఇతని శాసనరచయితలగు కవ్చన సూరి మయూరభట్టు, ఈశ్వరభట్టు ప్రచండకవులు. వీరు రుద్రదేవి కాలమునఁ బ్రతిష్ఠ గాంచిరి. విద్యానాథుఁడు ప్రతాపరుద్రయశోభూషణము రచించిన మహాకవి. ఇతఁడు రుద్రమదేవి పరిపాలనము కనులారఁ గాంచి ప్రశంసించియామె స్వయంభూస్వామి భక్తి పేర్కొని పట్టాభిషిక్తుఁడైన ప్రతాపరుద్రుని ప్రశంసించినాఁడు. ఇందుచే నితఁడా రుద్రమదేవి కాలముననె కాక ప్రతాపరుద్రుని కాలమందునుండెను. ప్రతాపరుద్రుని కాలమున నున్న మహాకవులు కొందఱేని రుద్రమదేవి కాలముననున్నారనవచ్చును. రుద్రమదేవి సామ్రాజ్యమునె గాక వాఙ్మయమును గూడ నుద్ధరించెనని చెప్పునవకాశము కలదు.

గణపతి దేవుఁడు ఓరుగంటిలో శిల్పకళాశోభితమగు స్వయంభూదేవాలయము పూర్తిచేసి మహోన్నత శిలాద్వారములు నాలుగువైపుల నిల్పలలిత కళాపోషకుఁడనిపించుకొనెను. మహమ్మదీయుల దండగముచే స్వయంభూదేవాలయము పూర్తిగఁ గూలకొట్టఁబడెను. విధ్వంసమగు ఓరుగల్లు కోటను బాగుచేయుట కీయాలయ శిలలు శిల్పములు విగ్రములు గజబృందములు సింహములు గుఱ్ఱముల పంక్తులు అవిఇవి యననేల సర్వస్వము దుర్వినియోగము చేయఁబడెను. లోకోత్తరమగు నీయాలయ రమణీయ శిల్పములు ద్వారముల మధ్య అశ్రుమలీమస దృష్టితోఁ దిలకింపఁగల్గుదుము. ప్రతిశాసనము నందును గణపతి దేవుఁడు స్వయంభూనాథభక్తుఁడు అని సగర్వముగాఁ జెప్పుకొనుట మాత్రము మిగిలినది. పాలకుర్తి సోమనాథ మహాకవి రుద్రదేవుని కాలమునందు గాక గణపతి దేవుని కాలమునందును నుండియుండును. సకల నీతిసమ్మతమునను దాహరింపఁబడిన ముద్రామాత్యము పంచతంత్రి కామందకము శాలిహోత్రము లోనగు ఆంధ్రగ్రంథములు దాదాపు ఈ కాలమునందు రచియింపఁబడినవని విశ్వసింపవచ్చును. రాజ్యవిప్లవములె శిల్పసంపదలు నశించుటకును గ్రంథ భాండారములు దగ్ధమగుటకును ప్రజలలో అలసభావ మేర్పడుటకును గారణము.

గణపతిదేవ చక్రవర్తి నాటిన వాఙ్మయబీజములు అచిరకాలమున మొలకలెత్తి దిశల నెల్లయెడల నాక్రమించిన మహావృక్షములై లతాంతముల నోడను ఫలములతోడను నిండారెను. కవిపికములు మనోజ్ఞగానము చేతను దేశసౌభాగ్యమును గీర్తించినవి. రాజ్య విస్తృతమైనది. శాంతి నెలకొల్పఁబడెను. తటాకనిర్మాణము దుర్గప్రతిష్ఠాపనము విరివిగాఁ జరిగినది. సముద్రవ్యాపారము పునరుద్ధరింపఁ బడెను. సేనానాయకులు దేశమంతటను నావరించి యాంధ్రపతాకమును రాజమందిరములపై సుస్థాపిత మొనరించిరి. దాదాపుగ నలువది సంవత్సరములు గణపతిదేవుఁడు రాజ్యమేలి అనురూపయగు పుత్రిక రుద్రమదేవిని రత్నసింహాసన మెక్కించెను.

ప్రతాపరుద్ర చక్రవర్తి గుణగణముల విద్యానాథకవి వర్ణించి జన్మము సార్థకము జేసికొన్నాఁడు. అతఁడు మానుషశంభుఁడనియు సత్పరిపాలకుఁడనియు గణపతిదేవుని కీర్తించినాఁడు. రుద్రమదేవి గణపతి చక్రవర్తి పుత్రియని కంఠోక్తిగ శాసించినాఁడు. రుద్రమదేవిని రుద్రుఁడని పుత్రునివలె వ్యవహరించి గణపతి దేవుఁడు ధన్యుఁడైనాఁడని చెప్పినాడు. విద్యానాథుఁడు రుద్రమదేవి స్వయంభూదేవానుగ్రహము బడసిన ధన్యురాలనియు ముమ్మడాంబ కుమారుఁడగు దౌహిత్రుని ప్రతాపరుద్రుని రాజ్యపాలకునిగఁ జేసెననియు బాల్యముననే దండయాత్రలలోఁ బ్రత్యర్థులను జయించి యువరాజపదవికిఁ బట్టాభిషిక్తుఁడయ్యెననియు జెప్పియున్నాఁడు. ప్రతాపరుద్రుని అజరామర కీర్తిగానము సల్పుటకుఁ బ్రతాపరుద్రీయ మొకటిచాలును. సర్వోత్కృష్టమగుదశ కాకతీయ సామ్రాజ్యమునకు ప్రతాపరుద్రుని కాలముననే కలిగినది. సర్వవిధముల అభ్యున్నతికి వచ్చిన యీతని రాచతికము పెరుగుట విరుగుటకొఱకె. అత్యుచ్ఛ్రయః పతనహేతుః అను నార్యోక్తులకుఁ దార్కాణమగుట భరింపరాని విచారకారణము.

కళింగదేశము మహిషమండలము చోళ పాండ్యదేశములు సేవణదేశము ఆదియిది యననేల సరిహద్దులలోనున్న సర్వదేశములలోఁ బ్రతాపరుద్రుఁడు వరాహపతాకము నెగురవేసినాఁడు. పట్టుమనిముప్పది వసంతములేని నిండకముందె యీతని రాజ్యలక్ష్మి యవనులచే నాకృష్టమైనది. కాలోహిదురతిక్రమః అని పెద్దలు చెప్పునది సత్యము.

ప్రతాపరుద్ర చక్రవర్తికాలమున సంస్కృతాంధ్ర వాఙ్మయములు మిగుల నభివృద్ధికి వచ్చెను. కొలిచల మల్లినాథ మహాకవి ప్రతాపరుద్రునిచేఁ గనకాభిషేక

ము నందిన శతావధాని అగస్త్యకవి సంస్కృతమునఁ బెక్కు గ్రంథరత్నముల నొనరించెను. విద్యానాథుని మొదటిపేరు అగస్త్యుడని పరిశోధకు లనుచున్నారు. కావచ్చును. గంగాధరుఁడు నరసింహకవి విశ్వనాథకవి ప్రతాపరుద్ర చక్రవర్తిచే ఆదర సత్కారముల గన్న సంస్కృతనాటక కర్తలు. వీరభల్లట దేశికుఁడు ప్రతాపరుద్రుని యాస్థానమున నుండి సర్వశాస్త్రవేత్త యని పేరొందినవాఁడు. సంస్కృతాంధ్రములలోఁ బేరొందినకవి అప్పయార్యుఁడు. ఈ జైనకవి ప్రతాపరుద్రుని కాలమున ఓరుగంటిలో నివసించి క్రీ.శ. 1310 లో జినేంద్ర కల్యాణాభ్యుదయమను సంస్కృతమున రచించినాఁడు. ఇతఁడు పుష్పసేనాచార్యుని శిష్యుఁడు. పేరునుబట్టిచూడ ఆంధ్రుఁడని తోఁచుచున్నది. రావిపాటి త్రిపురాంతకుఁడు ప్రేమాభిరామమను వీధినాటకము సంస్కృతమున రచించెను. అది ప్రతాపరుద్రదేవుని కాలమున ఓరుగంటి వైభవము, స్వయంభూదేవోత్సవములు సాంఘిక వినోదములు ప్రశంసించు గ్రంథము. దాని ఛాయగా రచింపఁబడిన క్రీడాభిరామమను దెలుఁగు కావ్యము మాత్రము మిగిలినది. త్రిపురాంతకుని కావ్యములు రసవత్తరములు మనోహర భావపూరితములు. అవియు అనుపలభ్యములు. శ్రీనాథుని పితామహుఁడును పద్మపురాణ కర్తయు నగు కమలనాభామాత్యుఁడు ప్రౌఢకవి. వినమత్కాకతిసార్వభౌముఁడని ప్రశంసింపఁబడిన యీతఁడు సరిగ ప్రతాపరుద్రుని కాలమునందె యుండెను. శాకపల్లి మల్లికార్జునుఁడు భాస్కర రామాయణకవులు ఏకామ్రనాథుఁడు మున్నగు మహాకవు లెందఱో యీ ప్రభునియాశ్రయమునఁ బ్రఖ్యాతిగాంచిరి. సంస్కృతాంధ్ర భాషలకు ఈ నృపాలుని కాలమునఁ బ్రసిద్ధి వచ్చెను. సర్వమతముల వారికి సమానగౌరవ మొసంగెను. పరిశీలించి చూచిన శైవమునకె కొంత గౌరవమును హెచ్చుగా నొసంగినటులఁ దోఁచును. కాకతీయ సామ్రాజ్యము యవనులు ప్రతాపరుద్రుని బంధించి ఢిల్లీకిఁ గొనిపోవుటతో నడుగంటినది. శిల్పములు రాజమందిరములు దుర్గములు విద్యాలయములు నామరూపములు లేకుండఁ జేయఁబడెను. గ్రంథభాండారము లగ్నిహోత్రమున కాహుతి గావింపఁబడెను మతోన్మాదులు పరాజితుల రాజ్యము గొనుటలో విశేషములేదు. గాని లలితకళా ద్యోతకములగు సుందర దృశ్యముల స్మృతిచిహ్నములుగా నుంచక పోవుట దురాగతము.

వీరశైవ వాఙ్మయ ప్రపంచమునఁ బాలకురికి సోమనాథుఁడు అద్వితీయస్థానము నాక్రమించెను. బసవపురాణము పండితారాధ్య చరిత్రములు విలువగల గ్రంథములు. ఈకవి సర్వజ్ఞుఁడు. చర్చింపని విషయమె లేదు. వాదములోఁ బ్రచండుఁడు. రుద్రదేవుని కాలమునందో ప్రతాపరుద్రుని కాలమునందో ఓరుగల్లు ప్రాంతమునను ండెను. తరువాత వారు శైవ వాఙ్మయమును నీతనిరచనము నె ఒరవడిపెట్టి చక్కదిద్దిరి. సోమనాథుఁడు ఓరుగంటి ప్రాంతమునఁగల పాలకుర్తి నివాసి. ఒకానొకరు కురికి గ్రామ పర్యాయ పదముగఁ గన్నడమునఁగలదనియు కురికి అంతమునఁగల పదములు కన్నడ దేశమునఁగలవు గానను సోమనాథునికిఁ గన్నడము వచ్చునుగావునను పాలకురికి కన్నడదేశములో నుండ వలెననియు వ్రాసిరి. వెదకఁగా వెదకఁగా మైసూరు జిల్లాలోని తుముకూరు తాలూకాలో ఒక హాలకురికి గనపడినది. ఇదె సోమనాథుని జన్మస్థానమని భావించిరి. హాలకురికియె పాలకురికియట. సోమనాథుఁడు ఓరుగల్లు ప్రాంతవాసి. ఓరుగల్లు ప్రాంతము పశ్చిమ చాళుక్యుల కాలమునఁ గర్ణాటభాషకు నెలవుగా నుండెను. కురికి యను గ్రామపర్యాయ పదముఁట సహజమె. కురికి కుట్టుఅయి కుర్తి కాఁగూడదాయని నాసందేహము. ఎటులైన సోమనాథుఁడు ఓరుగంటికి సంబధించిన వాఁడె. ఓరుగంటి ఆంధ్ర వాఙ్మయముతో శైవ వాఙ్మయముతో అతని కవినాభావ సంబంధము కలదు.

ఇది క్లప్తమగు తెలంగాణము నందలి ఆంధ్రవాఙ్మయ చరిత్రము. కాకతీయయుగము మాత్రము. ఇందు జర్చించితిని. కాకతీయుల పతనానంతరము వారిసేనానాయకులుగఁ బలుకఁబడిని సంపాదించిన వెలమవారు తెలంగాణమును బాలించిరి. ప్రతాపరుద్రుని యనంతరమున నతనిసేనాని రేచర్ల సింగమనాయకుఁడు తెలంగాణము నాక్రమించుకొనెను. అతఁడు మరణింపఁగు మారులు అనపోతనాయకుఁడు రాచకొండ దుర్గమును మాధవనాయకుఁడు దేవరకొండ దుర్గమును బరిపాలించిరి. అనపోత నాయఁడు నాగనాథ కవిచే మదనవిలాస మను భాణమునఁ బ్రశంసింపఁ బడినాడు. అనపోతనాయని విజయములఁ బ్రశంసించు అయ్యనవోలి మైలారుగుడిలోని శాసనము నాగనాథకృతమె. నాగనాథుఁడు విష్ణుపురాణము కూడఁ దెలుఁగు చేసియున్నాఁడు. ఎడతెగని సంగరయాత్రలలో మునిగి తేలుచున్నను అనపోతనాయఁడు సాహిత్య వినోద




| | | |
|---|---|---|
| సంపుటము ౨ | శా॥ శ॥ ౧౮౭౩ | 15 ఆగష్టు |
| సంచిక ౧ | ఖర శ్రావణము | 1951 |

# స్వవిషయము

సమయప్రసూనమున నొక దళము రాలినది. ముది ముత్తైదువగు ప్రకృతికాంత కొకయేడు పైబడినది. ఆర్యుల ఆశీస్సులంది వచ్చియురాని పలుకులతో సుజాత తన మొదటి పుట్టినపండుగను జరుపుకొనుచున్నది. అనంతకాలసాగరమున నొకవత్సర మొక శీకర ప్రాయమే యైనను నెలనెలగండముల నెదుర్కొనవలసిన సారస్వతపత్రికలకిది యొక మహాయుగము.

ఈ సంవత్సర కాలములో ప్రపంచాకాశమున నొకటి రెండుమారులు ప్రచండ యుద్ధమేఘము లలముకొని తమంత విచ్చిపోయినవి. మరల హిమవన్నగాంచలముపై నొక మబ్బుతునక పొడసూపుచున్నది. విశ్వకల్యాణమే పరమావధిగా గల భరతఖండ ప్రశాంతవాయువు లెట్టి మబ్బులనైన విరియింప గలవు.

తప్పుత్రోవబట్టిన లోకమును దిద్దవలసిన బాధ్యతవహించు పవిత్ర పత్రికారచన ప్రజల అజ్ఞానమునే అవకాశముగ తీసికొని ఆర్జనవైపు మొగ్గుట దేశదౌర్భాగ్యము. సినీమా, కామపత్రికల ధాటికి విజ్ఞానవాఙ్మయ మాగలేక పోవుచున్నది. ప్రభుత్వమున కీవిషయమక్కరలేదు. మన రాజ్యాంగము సువిశాలమైనది.

ముల తోడఁ దొరపియగునపు డానందించువాఁడు. మాధవనాయకుని మంత్రికి తమ్ముని కొమారుఁడు గౌరనమహాకవి కవిగజాంకుశము లక్షణదీపిక హరిశ్చంద్ర చరిత్రము నవనాథ చరిత్రములను రచించెను. ఇతఁడు శ్రీనాథునకు సమకాలికుఁడు.

సర్వజ్ఞ బిరుదము సింగభూపాలునికి లేదనియు ఇతని మనుమనికిఁ గలదందురుగాని తాతబిరుదమునె మనుమడు పెట్టికొని యుండును. సర్వజ్ఞుండు క్రీ. శ. 1398 ప్రాంతమున రాజ్యమునకు వచ్చెను. ఇతఁడు తండ్రివంటి పరాక్రమైక జీవి కాఁడు. విద్యావినోది. రసార్ణవసుధాకర మితని కృతి. ఇది యత్యుత్తమమగు అలంకార గ్రంథము, "యథామమైవ" యను నుదాహృత శ్లోకములఁ జూచిన బహు గ్రంథకర్తయని తోఁచును. వీరభద్ర విజృంభణము కరుణాకందళము రచించిన చమత్కార చంద్రికా కారుఁడగు విశ్వేశ్వర కవి యీతని యాస్థానమునుండి కీర్తి గడించెను. రత్నపాంచాలిక అను నాటకమొకటి సింగభూపతి రచియించెను. అమరవ్యాఖ్యాతయగు బొమ్మకంటి అప్పలాచార్యుఁ డాస్థాన విద్వాంసుఁడు. అమర వ్యాఖ్యానాంతమునఁ గల

కుమార సింగభూపేన లక్ష్యలక్షణవేదినా
శోధితశ్చేదయం గ్రంథః కింశోన్యశ్శోధనాంతరైః

అను శ్లోకమువలన సింగభూపాలుఁడు లక్ష్యలక్షణ పరిజ్ఞానముగల వాఁడనియు అతఁడు శోధించిన గ్రంథము సింకొక్కఁడు శోధింప నవసరము లేదను భావము స్పష్టమగుచున్నది. గ్రంథరచనమును బట్టి ఇతనికి సర్వజ్ఞత్వము గలదని యొప్పుకొనక తప్పదు. ఇతని మనుమఁడు సింగభూపాలుఁడు విద్యావిదుఁడు కావచ్చునేమొ. అదియు ననుమానమె. సర్వజ్ఞబిరుదము ధరించెననుట యొప్పుకొన్నచోఁ దాతగారి బిరుదము ధరించెనని చెప్పవచ్చును. శ్రీనాథమహాకవి క్రీ. శ. 1403 నాఁటికె పెదకోమటి వేమభూపతియొద్ద విద్యాధికారిగ నుండెననుట శాసనప్రమాణము. అంతకుముం దెన్నిసంవత్సరములనుండి యీ పదవి పరిపాలించెనో నిర్ణయము కాలేదు. 1360 క్రీ. శ. ప్రాంతమున శ్రీనాథుని జన్మకాలమని యొక వాదముకలదు. మొదటి సింగభూపతికాలమున శ్రీనాథుఁడు విద్యావేత్తయై యుండెగాన అతనిని దర్శించియుండును. ఈ నిర్ణయమునకు గొన్ని బాధకములుగలవు. బమ్మెర పోతరాజును ఈ కాలమువాడె. రేచర్ల గోత్రీయులగు వెలమ వీరులు రాజమణులు. ఆంధ్ర సామ్రాజ్య దీపమారిపోయినపిదప సురక్షితముగనున్న రాచకొండదుర్గమునుండి సాహిత్యదీపము వెలిఁగించిరి. రాచకొండ విశేషములెంతేని వ్రాయవలసియుండునుగాని ఇది యదును గాదు. ఇంకొకమారు చూచుకొందము.

రామగిరిదుర్గము కరీమునగరము జిల్లాలోనున్నది. కాకతీయులకుఁ బూర్వమునుండియు నిది పేరెన్నిక గన్న దుర్గము. ముప్పనాయకుని పాలనమున మడికి సింగన మహాకవి అతనిమంత్రుల యాదరసత్కారముల నందికొనుటకు రాజమహేంద్రవరప్రాంతమునుండి విచ్చేసెను. ఈతఁడుగావించిన ఆంధ్రవాఙ్మయ సేవ విలువకట్టరానిది. ఇట్లె పలువురుకవులు తమ యభిజనమువిడచి మహోచ్చదశయందున్నపుడు ఓరుగంటిప్రాంతమునకు ఆవల దుర్గపాలకులసన్నిధికి అనంతరము సంస్థానములకుఁ జేరిరి. మారన కాకతీయ సేనానుల నాశ్రయించెను. కొలని గోపరాజు వంశజులు వెలనాటినుండి కొలనికితరువాత వేముగంటికి చేరిరి. కొంతమంది దేవరకొండ దుర్గపాలకుల నాశ్రయించిరి. పట్టమెట్టు సోమనాథుఁడు గోదావరి మండలమునుండి దోమకొండ సంస్థానపతుల యాస్థానకవి యయ్యెను. ఇట్లు పలువురగుర్తింపవచ్చును. ఆ కాలమున అలంపూరు కాళేశ్వరము లేములవాడ కొలనుపాక ధర్మపురి మాహురము వాడపల్లి లోనగు పుణ్యక్షేత్రములు ఉమ్మడిసొత్తులుగనుండెను. రామగిరి సింగనకవిని రాఁదీసెను.

సబ్బినాటిసీమకు రాజధానియగు రామగిరి ప్రసిద్ధ దుర్గరాజము. ముప్పనాయకుఁడా దుర్గమును పాలించునపుడు సింగన వెలిగందలమంత్రియగు కందనామాత్యుని ఆశ్రయమునుండి పద్మపురాణము భాగవత ద్విపద జ్ఞానవాసిష్ఠము తెలుఁగునఁ గబ్బములగాఁగూర్చెను. సకలనీతి సమ్మతమను సంకలన గ్రంథమువలన ఈఁతడు బహుగ్రంథకర్తయని ద్యోతకమగును. తన గ్రంథములందు కందనమంత్రిని రామగిరి కేశవస్వామిని ప్రశంసా పద్యములచే నుంచియొత్తెను. పద్మపురాణము1420 క్రీ. శ. రచించుటచే ముప్పనాయకుఁడు కందనమంత్రి కాలము స్పష్టమగుచున్నది. సింగన శ్రీనాథునకు పోతరాజునకు సమకాలికుఁడు. భాగవతములోని భాగములు లుప్తమైనపిమ్మట ద్విపదరూపమున నుత్సన్న భాగములు పూర్తిచేసెనని తలంచుటకవకాశములు పెక్కులుగలవు. అవియిటఁ జేర్కొనుటకు దావు చాలదు. (మిగతా ప్రక్క పేజీలో)

# తెలంగాణా రాజకీయోద్యమములు

శ్రీ మాడపాటి హనుమంతరావు పంతులు



'రాజకీయోద్యమము' అనునది ఎచ్చటనైనను "రాజ్యము"నకంతటికిని సంబంధించినదైయుండుట సహజము. ఒకరాజ్యములోని యొక భాగమునకు ప్రత్యేక రాజకీయోద్యమములుండుట అసాధారణవిషయము. 'తెలంగాణము' అనుప్రాంతము హైదరాబాదు రాజ్యములోని ఒకభాగము. ఇది ఈరాజ్యములోని ఇతరములగు రెండుభాగములతో- మరాట్వాడా, కర్ణాటకములను వానితో- కూడియున్నది. కనుక రాజకీయోద్యమములందు తెలంగాణము తక్కిన రెండు ప్రాంతములతో కలసినదైయున్నది. వేరుమాటలలో చెప్పవలసినచో తెలంగాణా రాజకీయోద్యమములను హైదరాబాదు రాజకీయములే యని చెప్పినను తప్పుగా నుండజాలదని భావింతును.

అనేక కారణములవలన హైదరాబాదులో రాజకీయోద్యమములు చాల ఆలస్యముగ జన్మించినవి. వానిలో ముఖ్యకారణము ఇచ్చటి ప్రభుత్వము ప్రాతవిధానముపై నాధారపడియుండి నిరంకుశత్వ సూత్రముల పునాదిపై నుండుటయే. చుట్టుపట్టులందు బ్రిటిషు ప్రభుత్వమునకు లోబడిన ప్రాంతములో చిరకాలమునుండి వ్యాపించుచుండిన రాజకీయ ప్రబోధమును ఇచ్చటప్రభుత్వము తన ప్రజల కందకుండ చేయవలసిన సర్వప్రయత్నములను చేయుచుండెను. ఇంచుమించు ఆరు వందల సంవత్సరములనుండి ముస్లిం ప్రభుత్వము క్రిందనే ఎడతెగక జీవించుచుండిన ప్రజల- ముఖ్యముగా తెలంగాణావాసుల చిత్తవృత్తికూడ నిస్సారమైయుండి తమ ప్రభుత్వమునకు ఎంత చిన్న విషయముననైనను తిరుగుబాటు చేయుట యటుంచుడు. విరుద్ధముగా నభిప్రాయము ప్రకటించుటకుగూడ ధైర్యము లేనివారై యుండిరి. దీనికితోడు ఇచ్చటి ప్రభుత్వమువారు గడచిన యేబది సంవత్సరముల కాలములో నవలంబించి యుండిన విద్యావిధానముగూడ ప్రజలను కుంగదీయుటకే తోడ్పడెను. కనుక ఇచ్చటి రాజకీయోద్యమములు

---

(44 వ పేజీ తరువాయి)

తెలంగాణమునందలి కవుల భాషాసేవతో నారంభమయిన ఈ వ్యాసము స్థూలదృష్టితో పదునేనవశతాబ్దమునందలి యుత్తరార్ధమువఱకు నడచినది. విస్తరమగునని తెలిసినయంశములు పెక్కు లుదాహరింప మానితిని. సంస్థానాధిపుల భాషాసేవయు మహమ్మదీయనృపుల ఆంధ్రాభిరతియుం గడమభాగములు మరియొకమాఱు చర్చింతును. విశ్రాంతి తక్కువయగుటయుం బరిజ్ఞానము లోపమగుటయు నీవ్యాసము అసమగ్రమగుటకు కారణములు. సుజాతపత్రికకు సంవత్సరమునిండ వచ్చినది. ఇది తెలంగాణమునుండి ఆంధ్రులనాకర్షించు మాసపత్రిక. దీని వార్షిక సంచికకుముందు నేను రచింపసంకల్పించిన తెలంగాణ వాఙ్మయచరిత్రముయొక్క స్వరూపనిరూపణకు ఈవ్యాసముమచ్చుతునుక. రసజ్ఞలోకముముందు ఈ వ్యాసమును వైచినచో విమర్శనీయాంశములు తెలుపుదురని యీ వ్యాసరచనము కారణము. కడభాగమునంతయు సంగ్రహరూపము నింకొకమాఱు విన్నవింతును.

మొన్న మొన్నటి వరకు మొలక ఎత్తుటయే కష్టముగా నుండినది.

౧౯౦౬లో వంగదేశ విభజనము వలన నేర్పడిన అఖిల భారతీయమగు ఉద్యమము అచ్చటి పత్రికల మూలమునను, సభల చర్యల మూలమునను, మన రాజ్యపు ప్రజలలో కొంత ప్రబోధము కలిగించినమాట నిజమేకాని ఇచ్చట రాజకీయోద్యమమున దగిన దానిని సృష్టించలేదు. తెలంగాణము లోని గ్రంథాలయములు జిల్లా ప్రజలలో రాజకీయాభిప్రాయములను కొంతవరకు వ్యాపింపజేసినవి. విద్యార్థులగు నగరవాసులకు రాజకీయ సాహిత్యము విరివిగ లభించినది. హైదరాబాదులోని విద్యాధిక వర్గము వారు దేశీయ మహాసభలకు అప్పుడప్పుడు వెళ్ళుచు నూతనోత్సాహమును వెంటదెచ్చుకొనుచుండిరి. తెలంగాణములోని విద్యార్థులు మదరాసు రాజధానిలోని తెలుగుజిల్లాలలో జరుగుచుండు రాజకీయసభల కప్పుడప్పుడు వెళ్ళుచు నవ్యభావములచే ప్రేరితులగుచు నుండిరి. అంతేకాని రాజకీయోద్యమమనునది అస్తిత్వమునకు రాకయుండెను.

౧౯౧౯లో నిజాం ప్రభువుగారు ఈరాజ్యమునందు కొన్ని రాజ్యాంగ సంస్కరణలను ప్రవేశపెట్టుట అవసరమని తెలుపుచు నొక ప్రత్యేకాధికారిని ఏర్పరచి ఈ సంబంధమైన విచారణ జరిపి నివేదిక సిద్ధపరుపగోరిరి. కాని ఆ కార్యము ఏకారణమువలననో సాగలేదు. హైదరాబాదులోని విద్యాధికులు ప్రభువుగారి పైయాజ్ఞవలన నుత్సాహితులై ౧౯౨౧లో "హైదరాబాదు స్టేటు రిఫారమ్సు అసోసియేషను"అనుసంస్థను స్థాపించిరి. దీనిలో ముఖ్యులు కీ॥ శే॥ పండిత కేశవరావు కీ॥ శే॥ వామననాయక్ (శ్రీ రాఘవేంద్రశర్మ) ప్రభృతులై యుండిరి. దీనిలో ముఖ్యభాగమునుగొన్న ఆంధ్రులు ఒకరిద్దరు మాత్రమే. ఈ సంస్థపక్షమున తరువాత కొలదికాలముననే యొక రాజకీయమహాసభను సమావేశపరచు సన్నాహములు నగరమున సాగినవి. కాని ప్రభుత్వము అంగీకరింపనందున ఆ ప్రయత్నము మూగిపోయెను. పై అసోసియేషన్‌లోని పలువురు కార్యకర్తలు ముఖ్యముగా ముస్లిములు - సభ్యత్వము వదలుకొని వీడిపోయిరి. ఈ మహాసభ జరిగియుండిన రాజకీయోద్యమమునకు గట్టి పునాది ఏర్పడియుండెడిది.

మహాసభకు అంగీకారమియ్య నిరాకరించుటతో తృప్తినొందక ప్రభుత్వమువారొక ఫర్మానా జారీచేయించిరి. దీనిమూలమున దేశమందు రాజకీయ సంబంధమైనట్టి లేక రాజకీయ పరిణామముల గలిగించునను అనుమానము గల్గట్టి ఏ బహిరంగసభయు ప్రభువుగారి స్వంత ఆజ్ఞ పొందనిది జరుగగూడదని నిషేధింపబడినది. ఇట్టి నిషేధము తరువాత గూడ కొద్ది మార్పులతో సాగుచు వచ్చినది. దీనివలన అధికారము చేతిలోగల యధికారులు అందరును రాజకీయమేగాక ఎట్టి ప్రజా ఉద్యమమును సాగకుండ అరికట్టసాగిరి. ఎట్లయినను పైన నుల్లేఖింపబడిన రాజకీయసంఘము పక్షమున- మహాసభ జరుప వీలులేదు కనుక- ఒక పథకము సిద్ధముచేయబడినది. ఇది ౧౯౨౩ లో జరిగినపని. ఈ పథకమును సిద్ధపరచిన గౌరవము అప్పుడప్పుడే ఎల్. ఎల్. బి. పరీక్షలో నుత్తీర్ణులై వచ్చి న్యాయవాదవృత్తిని సాగించుచున్న మన బూర్గుల రామకృష్ణారావుగారికి చెందుచున్నది. ఈ యంశ

మునుబట్టి మన రాజకీయోద్యమమున నిర్మాణాత్మకమగు నిట్టి కార్యమును తెలంగాణములోని యొక విద్యార్థియుడే నిర్వహించెనని తెలియవచ్చును. ఈ విధముగా స్థిరపరుపబడిన ప్రభుత్వమునకు పంపబడిన ఆ పథకము యొక్క ఫలిత మేమైనదని అడుగవలసిన పని లేదు. బుట్టదాఖలైనదని ఊహించుకోవచ్చును.

ఆ దినములలోనే బహుశః అదే సంవత్సరమున హైదరాబాదునగరమున ఆంధ్రజన సంఘమనుపది స్థాపితమై పనిజేయ సాగినది. దాని యుద్దేశము రాజకీయ ప్రబోధమని చెప్పబడలేదు. అట్టిపని నూటిగ జరుగనులేదు. "నిజాం రాష్ట్రములోని ఆంధ్రులలో పరస్పర సానుభూతి కలిగించి వారి యభివృద్ధికై ప్రయత్నించుట" అనుమాట మాత్రము సంఘ నియమావళిలో నుండెను. ఈవిధముగా నారంభమైన ఆంధ్రోద్యమము అటుతరువాత పదునేను సంవత్సరములవరకు రాజకీయోద్యమ మనిపించుకొనలేదు. అంతే కాదు ఈ పదునేనుసంవత్సరముల దీర్ఘకాలములో ఆ యుద్యమ నిర్వాహకులు తమది రాజకీయోద్యమము కానేకాదని ప్రకటించుకొనుచు, ప్రభుత్వమునకు నచ్చచెప్పుచు, పని సాగించుకొనుచుండిరి. ఆ కాలము గడచినపిదప ౧౯౩౭ లో నిజామాబాదునందు జరిగిన ఆరవ ఆంధ్రమహాసభలో అప్పుడు ప్రభుత్వమువారు రాజ్యాంగ సంస్కరణలను సూచించుటకై ఏర్పరచిన అయ్యంగార్ కమిటీవారిని బాధ్యతాయుత ప్రభుత్వము (రెస్పాన్సిబుల్ గవర్నమెంటు) యొక్క తత్వములపైన నాధారము కల రాజ్యాంగ సంస్కరణలకై సిఫారసు చేయవలసినదని కోరిరి. ఇది తెలంగాణా రాజకీయోద్యమ చరిత్రలో ప్రధానమైన మెట్టని చెప్పవలసియుండును.

పైన చెప్పిన పదునేనుసంవత్సరముల కాలములో రాజకీయోద్యమమునకు నూటిగా సంబంధించిన యొక అంశమును చెప్పుట అవసరము. ఆ కాలమున భారతదేశమున గాంధీమహాత్ముని నాయకత్వమున జరుగుచున్న మహోద్యమ ప్రభావఫలితముగ హైదరాబాదు నగరవాసులు రాజకీయమహాసభ యొకటి జరుపదలచిరి. కాని నగరమునయే యనేల రాజ్యమునందెచ్చటను అట్టిసభను జరుపుట కనుజ్ఞ దొరుకజాలదు కదా? సమీపమున నున్న బ్రిటిషు ప్రాంతములలోనికి వెళ్ళి అట్టి మహాసభ సమావేశపరుచుట అసాధ్యమైన పని కాదు. అయినను దానికంటె నిజాము ప్రభువు తనదేశని వాదించుచున్న బెరారు రాష్ట్రములో మహాసభనుజరిపించుట ఉత్తమముగా భావించబడెను. అచ్చట సభ జరుగగూడదని నిషేధించుఅధికారము నిజాము ప్రభువుకు - ఆయన దురదృష్టమువలన నపుడు లేక ప్రజలఅదృష్టమువలన నపుడు - లేనేలేదు. అందువలన ౧౯౨౬లో బెరారుప్రాంతములోని "అకోలా" పురమున మొట్టమొదట నిజాం రాష్ట్ర రాజకీయమహాసభ వైభవముగ జరిగినది. దీనినిర్వహణములో తెలంగాణా కార్యకర్తలు పలువురు భాగముగొనిరి. ఈ మహాసభ కధ్యక్షులై జయప్రదముగ నిర్వహించినవారు శ్రీ రామచంద్రనాయక్ ఎం. ఏ. బారిష్టర్ ఎట్లా. (వీరిపుడు హైదరాబాదు హైకోర్టులో ప్రధాన న్యాయాధిపతిగా నున్నారు.) దీనిలో బాధ్యతాయుత ప్రభుత్వము కోరబడెను.

నిజామాబాదు ఆంధ్రమహాసభ తరువాత రాజకీయోద్యమ సంబంధమున జరిగిన మరియొక కార్యమును వివరించుట అవసరమని భావించుచున్నాను. ప్రభుపుగారేర్పరచిన అయ్యంగార్ కమిటీవారికొక రాజ్యాంగ సంస్కరణాల పథకమును ప్రజాదృక్పథము ననుసరించి సిద్ధపరచిపంపుట అవసరమని నగరములోనిప్రముఖులు భావించి యొక సమావేశమును జరిపిరి. దీనిలో ఒక ఉపసంఘము పథకమును సిద్ధముచేయుటకై ఏర్పరుపబడినది. సంఘమువారు అట్టిపథకమును కొలది కాలములోనే సిద్ధపరచి ప్రభుత్వమునకు పంపిరి. ఈ కమిటీకి అధ్యక్షుడు ఆంధ్రుడు. కార్యదర్శులలో ఇరువురు ఆంధ్రులు. ఈవిషయమున కార్యము నిర్వహించినగౌరవము శ్రీ బూర్గుల రామకృష్ణారావుగారికిని శ్రీకృష్ణశర్మగారికిని చెందుచున్నదనుట యథార్థము. దీనివలన రాజకీయోద్యమములలో - అవి మొత్తము రాజ్యములేవైనప్పటికినీ తెలంగాణావాసులు వహించిన గురుతరభావము విదితమగుచున్నవి.

నిజామాబాదు తరువాత జరిగిన ఆంధ్రమహాసభలలో రాజకీయోద్యమము ప్రధాన పాత్ర వహించినది. అనగా తెలంగాణా యొక్క ప్రజలందు రాజకీయ ప్రబోధము క్రమముగా హెచ్చినది. అది క్రమముగా భారత జాతీయ మహాసభ యొక్క (ఇండియన్ నేషనల్ కాంగ్రెస్) ఆదర్శముల ననుసరించిన జాతీయోద్యమముగా ముందుకు సాగినది. నిజామాబాదు మహాసభ తరువాత నిజాము ప్రభువుగారు ప్రకటించిన సంస్కరణాలు అతిహీనములును, అభివృద్ధి నిరోధకములును నై యుండుటవలన తెలంగాణములో రాజకీయోద్యమము బాగుగా పెరిగి అది అతివాదిత్వ పద్ధతి నవలంబించినది. జనసామాన్యమునందు ప్రబోధము హెచ్చినది. మల్కాపురము, చిలుకూరు, ధర్మవరము, హైదరాబాదు మహాసభలలో-అయిదుసంవత్సరముల కాలమున క్రొత్తభావములు క్రొత్త ఆదర్శములు ప్రబలసాగినవి. ఆంధ్రమహాసభ కార్యకర్తలలో కొందరు కమ్యూనిస్టు భావముల వలన ప్రేరితులై పదునొకండవ ఆంధ్రమహాసభ నాటికి ౧౯౪౩ వరకు తమ పక్షమును ప్రబలముగా చేసికొని భువనగిరిలో తమ యిష్టమువచ్చిన ఆదర్శములతో పదునొకండవ ఆంధ్ర మహాసభను సమావేశ పరచుకొనిరి. కాని తరువాత ఆ పక్షమువారి యూజమాన్యము నుండి తెలంగాణా ప్రముఖులు, ఆంధ్రమహాసభను తొలగించి పండ్రెండవ ఆంధ్రమహాసభను మడికొండలో పూర్వ సంప్రదాయముల ప్రకారము దిగ్విజయముగా జరిపిరి. దీనివలన తెలంగాణా రాజకీయములు మరల జాతీయ పక్షమార్గము ననుసరించి సాగినవి.

ఇవి తెలంగాణ రాజకీయముల కొన్ని వివరములు. నాకు దొరకినకొద్ది పాటి వ్యవధిలో ఇంతకంటె ఎక్కువ యంశముల దెల్పుటగాని వాని నెక్కువ హృదయాకర్షముగ గాని, విమర్శనా పూర్వకముగ గాని వర్ణించుటగాని సాధ్యము కాలేదు. కనుక ఈ వ్యాసమున కానవచ్చు లోపములకు క్షంతవ్యుడనని మనవిచేయుచు విరమింతును.



# తెలంగాణా - తెనుగు పత్రికలు

శ్రీ సురవరం ప్రతాపరెడ్డి బి.ఏ.బి.యల్.

బ్రిటిషు ప్రభుత్వ కాలములో బ్రిటిషాంధ్ర ప్రాంతములలో తెనుగు పత్రికలను, తెనుగు ముద్రణమును మొదలుపెట్టిన వారు ఇంగ్లీషు పాదరీలు. క్రైస్తవ మతబోధకై వారీయుపకారమును చేసిపోయిరి. తెనుగులో మొదటి ముద్రిత గ్రంథములుగూడ బైబిల్ భాగములే. బ్రిటిష్ ఆంధ్రములో 1835 ప్రాంతమునుండి క్రైస్తవాంధ్ర పత్రికలు వెలువడెను. 1860-70 ప్రాంతములలో బళ్ళారినుండి శ్రీ "యక్షిణి" అను పత్రికను క్రైస్తవులే నడిపించిరి. అటుపై కొక్కొండ వెంకటరత్నంగారు, కందుకూరి వీరేశలింగం గారు, పూండ్ల రామకృష్ణయ్య గారును మరి పలువురు పండితులును పత్రికలను సాగించిరి. కాని అవియన్నియు వాఙ్మయ సంబంధమైనట్టివి.

తెలంగాణములో పత్రికా ప్రచారము చాల వెనుకబడి యుండెను. నేటికిని వెనుక దిక్కు తెలంగాణమున్నది. తెలంగాణమున అచ్చు యంత్రములను మొదట నెలకొల్పిన వారు వనపర్తి సంస్థానమువారును, గద్వాల సంస్థానము వారును నైయుండిరి. ఆ ప్రెస్సులకు ముద్దు పేరులుగూడ పెట్టియుండిరి. ఇంచుమించు నూరు సంవత్సరముల క్రిందట ఆ ప్రెస్సులం దేర్పడియుండెను. వాటిలో కొన్ని పూర్వకావ్యములు, కొన్ని సమకాలికకవుల కృతులు, కొన్ని మతాచారములకు సంబంధించిన రచనలు ముద్రింపబడెను.

తర్వాత బహుకాలమువరకు తెలంగాణమందు తెనుగు ముద్రణాలయములు కానరాలేదు. 21-6-35 క్షయ చైత్ర శు౧౧ నాటి "నీలగిరి" పత్రికలో ఆ పత్రికా సంపాదకులగు శ్రీ నరసింహా రావుగారు సంపాదకీయమం దిట్లు వ్రాసిరి.

"హైద్రాబాదు సికింద్రాబాదు నగరములను వీడి రాష్ట్రమంతయు వెదకినచో ఓరంగల్లు, నల్లగొండ, ఇనుగుర్తి యందు తప్ప మరేస్థలమందు నాంధ్ర ముద్రణాలయము గోచరింపదు. మొత్తముపై రాష్ట్రమంతటను గల ఈ ముద్రణాలయములను వ్రేళ్ళపై లెక్కింపవచ్చును. వీరికైనను తగిన పని కలదా లేదా యని విచారించు నపుడు మాత్రమాశ్చర్యము జనింపక మానదు... ఈ వృత్తిలో ప్రవేశించినవారు దండుగలు పడి ముద్రణాలయమును సగము వెలకమ్ముకొని తమవృత్తిని మానుకొను చున్నారు... ఇప్పటికి హైద్రాబాదు వంటి ముఖ్యపట్టణములో కేవల మాంధ్రాక్షరముల నుంచుకొని జీవించు ముద్రణాలయమే గోచరింపదు."

ముద్రణాలయముల గతి యిట్లుండగా నిక పత్రికల నెవ్వరడిగిరి? నేటికిని హైద్రాబాదు దినపత్రికలను రూపుమాపుట కనువైనస్థలము గదా ? ఇచ్చట ఔలిప్రింటర్ కలదా? టపా సౌకర్యాలుకలవా? ౨౨౦౦౦ గ్రామాలలో

-౨౦౦౦ గ్రామాలకైనను దినదినము టప్పా యందదు. ఏడాదికొకనాడైనను శ్రాద్ధదినము నాటి పితరులవలెనైనను టప్పా జవాను యొక్క యదృశ్యమైన ముఖారవిందమును చూచుటకు నోచుకొనని గ్రామాలు నూర్లకావు వేలుకలవు. మరికొన్ని యదృష్టరేఖలు గల గ్రామాలకు చంద్రుని వలె పక్షానికొకమారైనా టప్పాజవాను కనబడకుండునా? మనలో అక్షరాస్యత నూటికేడు వరకే గదా! అందులో తౌరక్యాంధ్రమున కెంత యాదరమో ఉర్దూలో మాట్లాడుకొను నాంధ్రసోదరులను తండ్రికొడుకులను మామలను వారి దశమగ్రహములను విచారించిన తెలియకుండునా! ఇట్టి వాతావరణములో తెలుగులో యేసునాథుని ఈ ఇరవైయవ శతాబ్దారంభములో గూడ తెలంగాణమందు తెలుగు పత్రికలు లేకుండెనవిన ఆశ్చర్యపడవలసిన యవసరమేమి కలదు?

ఈ తెలంగాణములో మొదటి తెలుగు పత్రిక "హితబోధిని" యని పిడికెడుమందికి మాత్రమే తెలియును. నావద్ద హితబోధినీ మాసపత్రికయొక్క నాల్గవసంచిక కలదు. అది సెప్టెంబరు 1913 నాటిది. దాని ముఖపత్రముపై ఇట్లున్నది.

'సంవత్సరము చందా అభిమానులకు25రు॥ శేక 12రు॥ సామాన్యులకు 5 రు॥'

శ్రీనివాసశర్మ "ఎడిటర్." పత్రికలోని వ్యాసాలు-వ్యవసాయము, మిరియముపంట, వరిపంట, వైద్యము, పారిశ్రామికము, (సబ్బులుచేయువిధము, పింగాణిగిన్నెలు, రంగులు) సంఘసంస్కరణము (రెడ్డిగారి ప్రహసనము)" పత్రికలోని పుటలు 16.

ఇవి యాపత్రికలోని విశేషాలు. అది సంవత్సరములోపలనే యంతరించిపోయెను.

తర్వాత మరల ఐదేండ్లవరకే పత్రిక జాడయులేకుండెను. ఇంచుమించు 1920 లో తటాలున రెండు తెనుగుపత్రికలు బయలుదేరెను. ఒరంగల్లుజిల్లా 'ఇనుగుర్తి' అను గ్రామమునుండి శ్రీఒద్దిరాజు సీతారామచంద్రరావుగారు "తెనుగుపత్రిక" అను వారపత్రికను ప్రారంభించిరి. వారును వారిసోదరులు శ్రీ రాఘవరంగారావుగారును ప్రాచీనసాంప్రదాయమున సంస్కృతాంధ్రములందు కృషిచేసి గొప్పపండితులైనవారు. కాని ఒకగ్రామమునుండి పత్రికను పెట్టుటయు, దానికి చందాదారులు 500వరకేఉండుటయు, వారును స్థిరచిత్తులు గాకుండుటయు, మొదటినుండియు బాలారిష్టములేయుండెను. అయినను సంపాదకుల పట్టుదలవలన నది యైదేండ్లు సేవచేసెను.

రెండవవారపత్రిక 'నీలగిరి' యనునది. అది నల్లగొండనుండి కీ॥ శే॥ నరసింహారావుగారిచే నడుపబడెను. నరసింహారావుగారు ఒద్దిరాజుసోదరులవలె నుద్దండపండితులు గాకున్నను తెలుగు ఉర్దూభాషలలో గట్టి పాండిత్యముగలవారు. వారును అయిదేండ్లపాటా పత్రికను నడిపించిరి. అంతలో గోలకొండ అర్ధవారపత్రిక 1925లో తెలంగాణా రంగముపై కెక్కెను. తలవనితలంపుగా ఆ పత్రిక వెలువడుటచే పై రెండుపత్రికలకును దెబ్బ తగిలెను. అవి గోలకొండ వెలువడిన సంవత్సరకాలములో నంతరించెను. ఆరెండుపత్రికలును మొదటిసారి తెలంగాణాజనులలో జాగరూకత కలిగించెను. 'గోలకొండ' తోపాటు శ్రీ మాడపాటి హనుమంతరావుగారు "నిజాంరాష్ట్ర ఆంధ్రజనసంఘము"ను స్థాపిం

చిరి. నాటినుండి ఆంధ్రోద్యమము ప్రారంభమయ్యెను. దానికి మొదట తెలుగు, నీలగిరి పత్రికలును, తర్వాత గోలకొండపత్రికయు సంపూర్ణముగ దోహదమిచ్చినవి.

గోలకొండ ప్రారంభమైన రెండవ సంవత్సరమందే శ్రీ పి. యన్. శర్మ గారి సంపాదకత్వమున "సు జా త" పత్రిక వెలువడెను. వారొక సంవత్సరము నడిపించి వకీలుసనదు పుచ్చుకొన్నందున వేరొక సంపాదకుని పెట్టవలసివచ్చెను. ఆ తెరవెనుక భాగవత కథను గూడ నింతలో తెలుపుదును. 'సు జా త' మూడుసంవత్సరములు నడిచెను. 500 చందాదారులుండిరి. రాజపోషకుల ధనముచే స్వయం పోషకముగా నుండెను. తుదకు నాల్గవసంవత్సరపు మొదటిసంచిక వెలువడిన తర్వాత దాని నాపవలసివచ్చెను. పి యన్. శర్మగారు వకీలుగా నుండినను సుజాతను విచారించుకొనుచుండిరి. శ్రీ శర్మగారును, శ్రీ మాడపాటి హనుమంతరావుగారును, ఈ వ్యాసకర్తయు దాని లాభనష్టాలకు (అనగా నష్టాలకే యని యన్వయము) బాధ్యులని కలబలుకుకొని యుండిరి. పత్రిక నాపిననాడు ముగ్గురికిని తలా 200 రూపాయల ప్రకారము నష్టము చేతికి తగిలెను.

గోలకొండపత్రిక నీ రచయిత ప్రారంభించి మూడేండ్లపాటు సాగించిన తరువాత వకాలతుచేయవలసివచ్చెను. అప్పుడుపత్రికకు నామకార్థముగా శ్రీ కొండా వెంకటరంగారెడ్డిగారి సోదరులు శ్రీ కొండా బాలకృష్ణారెడ్డిగారు సులభముగా లభించిరి. అది వెంకటరంగారెడ్డిగారి అనుగ్రహము' బాలకృష్ణారెడ్డిగారు మొగలాయిమనిషి. ఇంగ్లీషు ఉర్దూలను మిడిల్ వరకు చదివియుండిరి. తెనుగులో కలమెత్తి పత్రిక కెన్నడును వ్రాసినపాపాన పోలేదు. సుజాతకును శర్మగారి స్థానములో బాలకృష్ణారెడ్డిగారే సంపాదకులైరి. తెర వెనుక భోగోతమును గోలకొండకీ రచయిత సుజాతకు శ్రీ మాడపాటి హనుమంతరావుగారును సాగింపవలసివచ్చెను. పలుమారు శ్రీ మాడపాటివారిట్లనుచుండిరి. "సంపాదకత్వము మొతటి అసామాన్య కార్యము. అట్టిది బాలకృష్ణారెడ్డిగారి కయాచితముగ బలవంతముగ లభించినది."

సుజాత ఉత్తమ మాసపత్రిక యనిపించుకొన్నది. అది యాగిపోయిన 24 యేండ్లకు మరల అదే పేరుతో వెలువడుచున్నది. దీని జాతక మెట్లున్నదో ? తెనుగు నీలగిరి పత్రికల కాలమందే "ఆంధ్రాభ్యుదయము" అను మరొక పత్రిక యుండెను. సుజాత యాగిపోయిన పదేండ్లవరకు మరల యే మాసపత్రికయు లేకపోయెను. అటుపై సికిందరాబాదునుండి "ఆంధ్రశ్రీ" అను మాసపత్రిక ఒక సంచిక వెలువడి ఆగిపోయెను.

శుక్లసంవత్సరమందు "దేశబంధు" యను మాసపత్రికను అత్రాప్రబల్లాలోని యొక గ్రామమునుండి ఒక శ్రీవైష్ణవులు ప్రారంభించి మూడేండ్ల వరకు సాగించిరి. ఒక చిన్న గ్రామమునుండి దాని నంతకాలము పట్టుదలతో నడిపించుట ప్రశంసాపాత్రము. అది అంతటితో ఆగిపోయెను.

1934లో సికిందరాబాదునుండి అడుసుమిల్లి దత్తాత్రేయశర్మగారు "దక్కన్ కేసరి" అను ఆంగ్ల ఆంధ్ర మాసపత్రికను నడిపించిరి. అది యేడెనిమిది నెలలవరకు సాగి యాగిపోయెను.

1936లో సికిందాబాదునుండి "గ౯-౩౬" అను విచిత్ర నామకరణముతో నొక మాస పత్రిక బయలుదేరెను ఆ పత్రికా శిశువు పురిటిలోనే గంతుగొట్టెను. 1938లో "తెలుగుతల్లి" అను మాసపత్రిక సికిందాబాదు నుండి రాచమళ్ళ సత్యవతీ దేవిగారి సంపాదకత్వమున వెలువడెను. అదియు నేడాదిలోనే క్రిందబడనుండ కొందరు హైదాబాదు యువకులు చేరి దానిని మరొక సంవత్సరము సాగించిరి. తరువాత సికిందాబాదు నుండి "విభూతి" అను మాసపత్రికను పండితచిదిరె మఠము వీరభద్ర శర్మగారు మూడేండ్లు నడిపించి వారంతలో కాశీలో నొక శైవపీఠము నకు అధిపతులుగ వెళ్ళుటచే నాపి వేసిరి. అది యుత్తమముగా సాగినట్టి మాసపత్రిక.

ఇంచుమించు 1937 నుండి సికిందాబాదులోని "దివ్యవాణి" అను వారపత్రికను శ్రీ చిపురుల అప్పయ్య శాస్త్రిగారు సంపాదకులైనడిపించుచున్నారు. శాస్త్రిగారు గొప్ప పండితులుపూర్వాచార పరాయణులు. అందుచేవారిపత్రిక సంఘసంస్కార విముఖమైనది.

హైదరాబాదులో భాగ్యరెడ్డిగారను హరిజన నాయకులుండిరి. వారు "భాగ్యనగర్" అను వారపత్రికను ఇంచుమించు 15 సంవత్సరముల క్రిందట సంపాదకత్వము వహించి నడిపిరి. కాని పత్రిక వెలువడిన మరుసంవత్సరమే అతడు క్షయ చికిత్సకు బెంగుళూరికిపోయెను. అప్పుడుదానిని శ్రీకంఠము సత్యనారాయణ నాయుడుగారు నడిపిరి. అదియు 3-4 యేండ్ల తరువాత అంతరించెను.

హైదాబాదులోని శ్రీ బి. యన్. శర్మగారు తెలంగాణా కొరకై బెజవాడకు వెళ్ళి అచ్చటినుండి "ఆంధ్రవాణి" యను పత్రిక నొక సంవత్సరముపాటు నడిపిరి. శర్మగారు పత్రికా రచనాసమర్థులే కాని ఆర్థిక దుస్థితిచే పత్రిక ఆగిపోయెను.

హైదాబాదులోకూడ దినపత్రికను పెట్టవలెనను నభిలాష ఇద్దరికి జనించెను. రాజగోపాల్ మొగలియారుగారు 1945లో "తెలంగానా" అను దినపత్రికను ప్రారంభించిరి. ఉర్దూ, ఇంగ్లీషు దినపత్రికలతో పాటు "మీజాన్" అను అరబ్బీపేరుతో తెనుగు దినపత్రికను కలకత్తావాలా అనువారు లేవదీసిరి. తెలంగానా పత్రికా సంపాదకులు తమిళులు. మీజాన్ పత్రికాధిపతులు ముసల్మానులు. తమిళుడు తెలుగుమాటలైన వచ్చును కాని ముసల్మాను తెలంగీయెట్టిదో తెలిసికొన ప్రయత్నించిన వాడుగాడు. అందుచే తెలంగానాకు శ్రీ శ్రీ బుక్కపట్టణము రామానుజా చారులుగారును, మీజాన్ పత్రికకు అడవి బాపిరాజుగారు సంపాదకులుగా నిర్వహించిరి. బుక్కపట్టణము వారు హైదరాబాదురాజ్య పత్రికారంగములో నసాధారణులు. దిట్టముగా గట్టిగా ఆంధ్రాంగ్లములలో పత్రికల నడుపగలవారు. వారి జీవనమంతయు సందేగడచెను. తెలంగానాపత్రిక రెండుమూడేండ్లు వెలువడిచందాదారులు పడిపోవుటచే పడిపోయెను. మీజాన్ పత్రికయు రెండుమూడేండ్లకే ఆగిపోయెను. అది ఆగిపోవుటగూడ విచిత్రమైనది. రజాకారు కాలములో దానికి ప్రభుత్వద్రవ్య సహాయము బాగుగానుండెను. కాని చందాదారులెవ్వరును లేకపోయిరి. అందుచే దానిని నామకార్థముగా ప్రచురించునట్లుచేసి ప్రభుత్వానికి, తమకుమాత్రమే దాని యస్తిత్వము తెలియునట్లుగా కొన్నిమాసాలు సాగింపగా

'సహేంద్ర తక్షకాయస్వాహా'యన్న పోలీసు చర్యాహోమములో నదియు దానితోబాటుండిన ఉరుదూ ఇంగ్లీషు మిాజానులును ఆహుతి యయ్యెను. ఇప్పుడు హైదరాబాదులో 'గోలకొండ' దినపత్రిక యొక్కటే యొకటికలదు. అదే తెలంగాణమ్మముక్కుపై వేలాడు కొలికిపూస.

శ్రీ దేవులపల్లి రామానుజ రావుగారు ఇంచుమించు 1937లో 'శోభ' అను మాస పత్రికను వరంగలునుండి ప్రశంసాపాత్రముగ ప్రకటించిరి. అది యుత్తమముగా నుండెను. కాని ఒక సంవత్సరముతరువాత ఆగిపోయి మరల 1950లో పునరుద్ధరింపబడి హైదరాబాదునుండి వెలువడుచున్నది.

క్రీ.శ. 1945లో సికిందరాబాదునుండి 'తరణి' అను మాసపత్రిక వెలువడి సారస్వత, జ్యోతిష విషయాలనుగురించి ప్రచార మొక వత్సరము పాటుచేసి ఆరిపోయినది.

ఆంధ్రమహాసభ కమ్యూనిస్టుల చేతులలో బడినకాలములో "ఆంధ్రకేసరి",యను వార పత్రిక యించుమించు నొకసంవత్సరమువరకు నడచి ఆగిపోయెను.

హైదరాబాద్ ప్రభుత్వపక్షాన కొన్ని తెనుగుపత్రికలు నడుపబడెను. అందు ముఖ్యమైనది సమాచార శాఖవారి "హైద్రాబాదు సమాచారము." అది పక్షపత్రికగా నుండెను. పోలీసుచర్యతర్వాత దానిస్వరూపము మారి ఉత్తమపత్రికయయ్యెను. కాని గోర్వాల కమిటీ దాని నాపివేయించెను. ప్రభుత్వ సహకార సంఘంవారును, విద్యా శాఖ వారును మాసపత్రికల నడపిరి. మరియు కో-ఆపరేటివ్ యూనియన్‌వారును నొక మాసపత్రికను నడపిరి. అవన్నియు నాగిపోయినవి.

హైదరాబాదు సంస్థానములోని పత్రికల చరిత్ర రెండుభాగములు కలది. 1 పోలీసు చర్యలకు పూర్వస్థితి. రెండవది తదనంతర స్థితి. పూర్వంనుండి హైదరాబాదు నిరంకుశ ప్రభుపాలితము. హుజూరు ఫర్మానాలే శాసనాలు! నిజాం ప్రభువు వాక్కులే యాజ్ఞలు. పత్రికలపై పర్యవేక్షణచేయుశాఖ హోంశాఖ. అందులోని పోలీసుశాఖయే పత్రికలను మందలించి బెదరించి బాధించు నధికారశాఖ. ప్రభుత్వమునకు నచ్చని పత్రికల నాపివేయుచుండిరి. అట్టిచర్యలపై అపీలు లేదు. మరల హోంశాఖయే దయదలచి మన్నించి కటాక్షించిన పత్రికకు పునర్జన్మ కలిగెడిది. పత్రికకు శ్రీవుదొరుకుటయనగా పద్మవ్యూహమునూ, భూల్‌భులియాను భేదించుకొనిపోవునంతటి ఘనకార్యము. పత్రికను పాపించువాని పుట్టుపూర్వోత్తరములు, వాని యేడుతరాల యింటిపేరును, వారి స్వీయ చరిత్ర, వాని కృకతముకాని మెతకదనము, ఇవన్నియు విచారించి, తృప్తిపడినతర్వాత వానిని పిలిపించుకొని బహు నియమములు గల పత్రముపై వాని సంతకము తీసుకొనెడి వారు. ఆ నియమములలో— "నేను రాజకీయములను చర్చించను. నేనే మతముల వారిని చెనకను. నిజాంప్రభుత్వమునకుగాని, బ్రిటిషు యిండియా ప్రభుత్వమునకుగాని వ్యతిరేకముగా విమర్శలు చేయను–" అనునవి ముఖ్యమైనవి. అట్టిస్థితిలో తెనుగు పత్రికల వృద్ధి యెట్లగును?

పోలీసుచర్యల తర్వాత పత్రికలపై నిరోధకములు తక్కువయ్యెను. కాని, పూర్తిగా పోలేదు. ఇది జయింపబడిన రాజ్యముకదా!

మేమాసించినట్లు పెద్దలు ఆదరాభిమానములుంచి తమ రచనలచే సుజాత నలంకృతను జేసిరి. మేమనినట్లు నడచితిమో లేదో నిర్ణయించి సూచింపవలసినది లోకము. ఇంకను క్రొంగ్రొత్త సొబగులుగూర్చి సుజాతను ముద్దుగా దీర్చవలయునను కోరికలు చాల గలవు కాని ఈమె దరిద్రుల ఇంటిబిడ్డ.

దైవానుగ్రహమున తక్కిన హంగులకు లోపములేదు. కాని ఆర్థికముగ పత్రిక దెబ్బతినుచున్నది. ఇప్పటికే ఋణములపాలైనను సాహసము మాచే ముందడుగు వేయించుచున్నది. దానిఫలితమే ఈ ప్రత్యేకసంచిక. ఆర్యుల ఆదరమునకు అర్హమైనచో కృతకృత్యుల మయ్యెదము.

ఇంతవరకు ఉదారుల విరాళములచే తెలంగాణపు పెద్దల చేయూతచే పత్రిక నిలువగలిగినది. ఆంధ్ర సారస్వతపరిషత్తు నిలువ నీడనిచ్చినది. సుందరచిత్రములను హైదరాబాదు ఆర్ట శాఖవారును, గోలకొండపత్రిక, ఆంధ్ర చంద్రికా గ్రంథమాలల వారును లేదనక అనుగ్రహించుచున్నారు. ఈ ప్రత్యేకసంచికకు తీరకలేకున్నను విలువగల రచనలను సుప్రసిద్ధ రచయితలు ప్రసాదించినారు. ఆంధ్ర సారస్వతపరిషత్తును, కొందరు ఉదారమహాశయులును ఆర్థికసహాయము చేసినారు. వీరికందరికిని సుజాత కృతజ్ఞురాలై యున్నది.

మా యుద్యమముపై లోక మిలోధిక సానుభూతులను ప్రసరించునని ఆశించుచున్నాము.

# నా తెలంగాణ

## దాశరథి

కోటి తెలుగుల బంగారు కొండక్రింద
పరచుకొన్నట్టి సరసులోపల వసించి
పొద్దు పొద్దున అందాల పూలుపూయు
నా తెలంగాణ తల్లి; కంజాత వల్లి

వేయి స్తంభాల గుడినుండి చేయిసాచి
ఎల్లొరా గుహ లందున పల్లవించి
శిల్పిఉలి ముక్కులో వికసించినట్టి
నా తెలంగాణ, కోటి పుణ్యాల జాణ

మూగవోయిన కోటి తమ్ములం గళాల
పాట పలికించి కవితా జవమ్ము కూర్చి
నా కలానకు బలమిచ్చి నడిపినట్టి
నా తెలంగాణ, కోటి రత్నాల వీణ

మిలిటరీ గవర్నరు పాలించిన కాలములో కోరదగిన స్వేచ్ఛ లేకున్నను, పూర్వముకంటె కొంత మేలు పరిస్థితు లేర్పడెను. క్రమముగా పత్రికలకు స్వాతంత్ర్యము లభించుచువచ్చెను. అందుచేత పత్రికల సంఖ్య పెరిగిపోయెను. పోలీసుచర్య తర్వాత యీ క్రింది పత్రికలు వెలువడినవి.

| | | | |
|---|---|---|---|
| 1. 'సుజాత' మాస పత్రిక | సంపాదకులు: | గడియారం రామకృష్ణ శర్మ | హైద్రాబాదు |
| 2. 'ప్రగతి' వార పత్రిక | ,, | భండారు చంద్రమౌళీశ్వరరావు | ,, |
| 3. 'భాగ్యనగర్' పత్రిక | ,, | అష్టూరి అయోధ్య రామకవి | ,, |
| 4. 'పద్మశాలి' మాస పత్రిక | ,, | బూర్గుల రామకృష్ణయ్య | ,, |
| 5. 'జనశక్తి' వార పత్రిక | ,, | జె. గౌతమరావు | ,, |
| 6. 'ప్రజాశక్తి' వార పత్రిక | ,, | రషీద్ | ,, |
| 7. 'మేధావి' మాస పత్రిక | ,, | బిరుదురు వెంకట శేషయ్య | ,, |
| 8. 'జయభారత్' మాస పత్రిక | ,, | వెల్దండ ప్రభాకరరావు | ,, |
| 9. 'తెలుగుదేశం' వార పత్రిక | ,, | రాజ్యలక్ష్మి దేవి | ,, |
| 10. 'కాకతీయ' వార పత్రిక | ,, | పి. వి. సదాశివరావు | వరంగల్లు |
| 11. 'చిత్రవిచిత్ర' వారపత్రిక | ,, | దామోదరరావు | ,, |
| 12. 'సుదర్శన్' (తె.హిం.) మాసపత్రిక | ,, | సుదర్శనా దేవి | వనపర్తి |
| 13. 'శ్రీ కుసుమ హారనాథ' ఆంధ్రాంగ్ల మాస పత్రిక | ,, | హరిహరయ్యర్ | సికింద్రాబాద్ |

11-52

నాకు తెలిసినంతవరకు నిప్పటి పత్రికల పేర్లు తెలిపినాను. పత్రికలు తొందరతొందరగా వెలువడును. అదే తొందరతొందరతో మాయమగుచుండుట కొన్ని స్మృతిపథమున నుండకపోవచ్చును. 1914 నుంచి 1951వరకు తెలంగాణములో వెలువడిన పత్రికలను చూచిన 23 ఏండ్లొక అర్ధవార పత్రికయు, అయిదేండ్లు రెండువారపత్రికలును, మూడేండ్లొక మాస పత్రికయు నొక వారపత్రికయు రెండేండ్లు రెండు దినపత్రికలు సాగి యాగిపోయినట్లు విశదమైనది. తక్కిన పత్రికలలో సగమువంతు యేడాదిలోనే యాగిపోయెను. ఇపుడు సాగుచుండిన తెనుగు పత్రికలలో దేనికిని 1000 కి మించిన చందాదారు లుండినటుల కానరాదు. ఈ పత్రికలు తెలంగాణ ప్రజల నాకర్షింప జాలినవి కావనుట కనబడుచునే యున్నది. ఆంధ్ర వారపత్రికలో కథలు, సినిమా విలాసినుల బొమ్మలు పూర్తిగా నుండుట మొదలుపెట్టిన తర్వాత తెలంగాణమున నివెన్ని ప్రతులు వ్యయమగునో అంతమాత్రమే తెలంగాణా తెలుగు పత్రికలు అమ్ముటలేదు. ఆంధ్ర ప్రభకు

( మిగతా ప్రక్క పేజీలో )

# తెలంగాణము - ఆధునికాంధ్ర వాఙ్మయ వికాసము

శ్రీ దేవులపల్లి రామానుజరావు బి. ఏ. ఎల్ ఎల్ బి.

ఒకజాతియొక్క సర్వతోముఖ వికాసానికి, ఆ జాతి సాహిత్యానికి సన్నిహిత సంబంధముకలదు. ఈ సంబంధము పరస్పరప్రభావముతో గూడుకొన్నదని ఏ జాతిచరిత్రను ఏ వాఙ్మయచరిత్రను పరిశీలించినప్పటికిని స్పష్టము కాగలదు. ఒకజాతి సంస్కృతికి నాగరికతకు ఆజాతి సాహిత్యమే కొలతబద్దవంటిది. సారస్వతములేని జాతి మృతప్రాయము. ఒక దేశ చరిత్రను పరిశీలించినప్పుడు, ఆ దేశమునందు పుట్టి పెరిగిన అభ్యుదయకరమైన ఉద్యమాలకు జీవనాధారము సారస్వతమనియే బోధపడగలదు. దేశకాల పరిస్థితులనుండి సాహిత్యము తప్పించుకొనజాలదు. ఆదే విధముగా ప్రతిభావంతమైన సాహిత్యముయొక్క ప్రభావమును ఏజాతికూడ తప్పించుకొనజాలదు. దాస్యశృంఖలాబద్ధమై పరాయిపరిపాలనలో నలిగిపోవుచున్న భారతదేశమే, బంకించందు చటర్జీ, ఈశ్వరచంద్ర విద్యాసాగరులు, రవీంద్ర కవీంద్రులవంటి సాహితీవేత్తలను గన్నది. వారి రచనలను విన్న భారతజాతి ఒక్కుమ్మడి సంకెళ్ళను తెంపుకొని స్వాతంత్రోద్యమమునందు దూకినది. వారు వంగరాష్ట్రమునకేకాక ఇతరరాష్ట్రములకుకూడ ఆదర్శప్రాయులైరి. వీరి రచనలద్వారా భారతదేశ రాజకీయాలందు ప్రముఖపాత్రనువహించిన స్వాతంత్ర వీరులు, పన్నెకెక్కిననాయకులు బంగాళాదేశమున ప్రభవించిరి. బకించంద్రుని వందేమాతరగీతము యావద్భారతహృదయంలో ప్రతిధ్వనించిపులకెత్తింపజేసినది. సమకాలికముగా ఇతరప్రాంతాలయందు అక్కడి రచయితలద్వారా ఇట్టి చైతన్యమే కలిగినది.

మన తెలుగునేలగూడ ఈ పరివర్తననుండి తప్పించుకొనలేదు. వీరేశలింగం పంతులు చిలుకూరు వీరభద్రరావు కొమర్రాజు లక్ష్మణరావు పంతులు చిలకమర్తి లక్ష్మీనరసింహము ప్రభృతుల సారస్వతసేవ ఆంధ్రదేశములో నవోదయానికి నాందీ ప్రస్తావనయైనది.

## పూర్వరంగము

ఆంధ్రజాతి మిక్కిలి ప్రాచీనమైనదని చరిత్ర ఉద్ఘోషించుచున్నది. రెండువేల సంవత్సరాల క్రిందట ఆంధ్రదేశాన్ని పాలించిన మొట్టమొదటి స్వతంత్ర రాజవంశము సాతవాహనులది. ఆనాడు ఆంధ్రదేశపు సరిహద్దులు తూర్పున బంగాళాఖాతము వరకును పడమర అరేబియా సముద్రము వరకును, ఉత్తరమున మధ్య హిందూదేశమునకు దక్షిణాన మైసూరుదాకను వ్యాపించినట్లు చరిత్రవల్ల విశదము కాగలదు. సాతవాహనులు పరిపాలించిన రాజ్యము సమగ్రమనియే చెప్పవచ్చును. అనగా సాతవాహనుల ఆంధ్రదేశములో మద్రాసు రాష్ట్రములోని తెలుగు జిల్లాలతోపాటు హైదరాబాదు రాష్ట్రములోని తెలుగు జిల్లాలుకూడ చేరియుండెను. ఆనాడు ఆంధ్రులు కనిపెంచుకొన్న మహాజ్వాలమైన

---

(54 వ పేజీ తరువాయి)

ఆంధ్ర పత్రికకు రెంటికిని కలసి పదిహేను వేల వరకు తెలంగాణలో చందాదారులు కలరు. కావునమనము పత్రికలనెంత అభివృద్ధి చేయవలయునో, యెంత ఆకర్షణీయముగా ముద్రింపవలయునో, యెంతటి సంపాదకత్వ అర్హత సంపాదించుకొనవలెనో, యెంతటి ఆర్థికపుష్టి కలిగియుండవలెనో, యెంత పట్టుదల కలిగియుండవలెనో సంపాదక మహాశయులు బాగుగా ఆలోచించుకొందురుగాక!

సంస్కృతి తూరుపుదీవులలో కూడ నడయాడినట్లు తెలియుచున్నది. తరువాత ఆంధ్రదేశ చరిత్రలో ఒడుదొడుకులెన్నియో కలిగినవి. చిన్నచిన్న రాజ్యము లేర్పడుటతో తెలుగునేల చీలి చిందరవందరయై పోయినది. అయితే దేశ సమైక్యతకు నిజానికి భంగము వాటిల్లినది బ్రిటిషు పరిపాలనలోనేయని చెప్పవచ్చును.

ఈష్టుఇండియా కంపెనీవారు మనదేశములో ప్రవేశించి, క్రమక్రమముగా విస్తరించి అప్పుడు ఆంధ్రదేశానికి పరిపాలకుడుగా నున్న హైదరాబాదు నిజాంను తమకు ఆధీనునిగా జేసుకొనిన తరువాత ప్రస్తుతము ఆంధ్రదేశములోని సర్కారు జిల్లాలు కంపెనీ పరిపాలన క్రిందికి 1760లో తేబడినవి. అనగా హైదరాబాదులోని ప్రస్తుత తెలుగుజిల్లాలు నిజాం పరిపాలనక్రింద ఉండిపోయినవి, సర్కారు జిల్లాలు బ్రిటిషు పరిపాలనక్రిందికి వచ్చెను. ఇదిజరిగి సుమారు రెండువందల సంవత్సరములు కావచ్చినవి.

చరిత్రలో ఈ రెండువందల సంవత్సరాలు యేమంత గొప్ప కాలము కాదు. అయినప్పటికి 1766 సంవత్సరములో జరిగిన కృత్రిమ భౌగోళిక విభజన ఫలితంగా ఆంధ్రుల సమైక్యతకు భంగము కలిగిందని చెప్పవచ్చును. ఆనాటినుండి పరిపాలన దృష్ట్యా ఏర్పడిన ఈ పొలిమేరలు ఒకరినొకరు అర్థము చేసుకొనుటకు ప్రతిబంధకము లైనవి.

హైద్రాబాదు రాష్ట్రములో ఆంధ్రోద్యమ పితామహులు ప్రసంగవశమున నాకు జెప్పిన ఒక వృత్తాంతము ఈ సందర్భములో జ్ఞప్తికి వచ్చుచున్నది. వారు క్రొత్తగా ప్రజాహిత జీవనములో అడుగు పెట్టిన తర్వాత అనగా మూడు దశాబ్దాల క్రిందట నన్నమాట ఒక పర్యాయము వారు సర్కారు జిల్లాల ఆంధ్రప్రముఖులైన ఒకరితో ఏదో సంభాషించు సందర్భమున (వారు తరువాత అఖిలభారత రాజకీయాలలో ప్రథమ శ్రేణి నలంకరించిన వారు) "హైదరాబాదులో ఆంధ్రులు కలరా యని ప్రశ్నించిరట." నేను చాలామంది సర్కారు జిల్లాల ఆంధ్రులతో సంభాషించినప్పుడు "మీరు హైద్రాబాదు వాసులైనప్పటికి తెలుగు మాట్లాడగలుగు చున్నారే" యని అనేకులు ఆశ్చర్యపడి యుండిరి. హైద్రాబాదు తురకరాజ్యము అన్న భావమొక్కటే హైదరాబాదేతరులైన ఆంధ్రుల హృదయాలలో వ్యాపించియుండెను. ఆధునికాంధ్ర వాఙ్మయమున ప్రసిద్ధులైన ఒక రచయిత తెలంగాణమున తెలుగు రచయితలు ఎవ్వరు అని ఒకానొక సందర్భమున నన్ను ప్రశ్నించి యుండిరి. ఈ విధముగా రెండువందల సంవత్సరాల కాలమున భిన్న పరిపాలన మరియు కృత్రిమ భౌగోళిక విభజన ఫలితంగా ఆంధ్రదేశ సమైక్యతకు రాజకీయంగానే కాక సాంస్కృతికంగా కూడ పెద్దగొడ్డలిపెట్టు తగిలెనని పైసంఘటనలే ఋజువు చేయుచున్నవి.

హైదరాబాదు రాష్ట్రములోని ఎనిమిది జిల్లాలు తెలుగు జిల్లాలు హైదరాబాదు, సికిందరాబాదు నగరాలు ఆంధ్రనగరాలు. కాకతీయ సామ్రాజ్యమునకు కేంద్రమై యలరారిన ఓరుగల్లు హైదరాబాదు రాష్ట్రాంతర్గతము. తెలుగు దేశ చరిత్రలో తెలుగు వాఙ్మయ చరిత్రలో హైదరాబాదులోని ఎనిమిది జిల్లాలకు అత్యధికమైన ప్రాముఖ్యత గలదు. నిజానికి మొట్టమొదటిసారి తెలుగు జాతీయతకు రూపురేఖలు దిద్దబడినది హైదరాబాదు రాష్ట్రములోనే యనిచెప్పినచో అతిశయోక్తికాజాలదు. సుప్రసిద్ధ చరిత్ర పరిశోధకులైన శ్రీమల్లంపల్లి సోమశేఖరశర్మగారు "మనది ఆంధ్రదేశం; మనమంతా ఆంధ్రులమనే జాతీయాభిమానము మొదటిసారి మనకు కాకతి గణపతి దేవరాయుల కాలంలో కలిగిందని, ఆ రాజన్యుడే ఆంధ్రులందరిని ఒక్కరాజ్యంలోనికి తీసుకుని రావలెనని మొదటిసారి ప్రయత్నించినాడని" గ్రంథస్థము కావించినారు.

కాకతి గణపతి దేవుని రాజ్యపాలనలో మహోజ్వలంగా వెలిగిన ఆంధ్రరాజ్యలక్ష్మితోపాటు ఆంధ్రసారస్వతము ఆంధ్రశిల్పము మూడుపూవులారుకాయలుగా కాచి వృద్ధి బొందినది. ఆంధ్రశిల్ప కళాలక్ష్మి వేయి వన్నెలను దిద్దుకొని మురిసిపోయినది. మార్కోపోలో వంటి విదేశయాత్రికులను దిగ్భ్రమ జెందించిన ఆంధ్ర నగర వైభవము అనుపమానము. ఉత్తమశిల్పమునకు పట్టులగు సౌధములచే నలరారిన ఆ విశాల రాజవీధులు, శత్రురాజులకు దుర్భేద్యమై నిలచిన ఆ కోటలు ఆ నాడు ఆంధ్రక్షితీశు మొగసాలపై మ్రోగిన ఘంటా ఘణత్కారములు ఆ పూటకూటింటిలోని కప్పురభోగి వంటకము, కమ్మని గోధుమపిండి వంట, ఆ చిత్రశాలలు ఏకశిలానగర నాగరిక జీవితమునకు ప్రతిబింబములై నేటికిని క్రీడాభిరామమున అక్షరరూపములో శోభిల్లుచున్నవి ఇట్లు ఆంధ్ర దేశమునకు ఆంధ్రసంస్కృతికి కేంద్రమై వెలిగిన ఆంధ్ర

నగరము తెలుగు జాతీయతకు వన్నెచిన్నెలు దిద్దుట లో ఆశ్చర్యములేదు.

ఒక్కమారు తెలుగు సాహిత్యచరిత్రను అవలోకించితిమేని, తెలంగాణమునకు ఆంధ్రవాఙ్మయచరిత్ర లోనున్న ప్రత్యేకస్థానము కన్నులకుగట్టును. దేశకాల పరిస్థితులవలన రచయితలకు రచనలకు కొంతకాల మజ్ఞాతవాసము కలిగినది. తెలంగాణమందలి గ్రామాలలో తాళపత్రగ్రంథములు లేనిపూరు లేనేలేదని చెప్పిన అతిశయోక్తి కాజాలదు. ఆధునికకాలమున ఇక్కడి సారస్వతోద్యమవ్యాప్తిని పరిశీలించునప్పుడు రాజకీయపరిస్థితులను మనము దృష్టిలోనుంచుకొన వలసియున్నది. బ్రిటిషువారు ఏమి జేసినప్పటికిని ఏ యుద్దేశముతో చేసినప్పటికిని బ్రిటిషు ఇండియాలో విద్యావ్యాప్తికై జరిగిన కృషిని నిరోధించ లేదనియే చెప్పవలెను. సారస్వత సభలను బ్రిటిషు పరిపాలన నిషేధించలేదు. గ్రంథాలయాల స్థాపనకు బ్రిటిషు ప్రభుత్వము ప్రతిబంధకములను కల్పించలేదు. బ్రిటిషు ఇండియాలో రాజకీయాలతో సంబంధము లేని సారస్వత కృషి జరుగుటకు కావలసినంత యవకాశము దొరికినది. అందుచేత కేవల సారస్వతోపాసకులైన వారి కృషి నిరంతరాయముగా జరిగినదని యే చెప్పవలయును. ఆధునికాంధ్ర వాఙ్మయ నిర్మాతలైన వీరేశలింగ ప్రభృతుల జీవితాలు ఇందుకు నిదర్శనములు. సర్కారు జిల్లాలలో సారస్వత సేవకు తమ జీవితాలను అంకితము జేసిన మహాశయులలో అత్యధిక సంఖ్యాకులు రాజకీయాలతో ప్రమేయము కలిగించుకొలేదు. అందువలన అచ్చట రాజకీయ కార్యకర్తలు సారస్వతోపాసకులు విడివిడిగా కృషిజేయుట జరిగినది. కాని తెలంగాణములో ఇది సాధ్యము కాని సంభవము కాని కాలేదు. ఇక్కడి ప్రజల మాతృభాషను అణచివేయుటయే అప్పటి ప్రభుత్వము యొక్క ముఖ్యోద్దేశమై యుండెను. కేవల సారస్వతోద్యమము, అనుమాటకు అవకాశము లేని పరిస్థితులను ఇక్కడి ప్రభుత్వము కలిగించినది. గ్రంథాలయాల స్థాపనయే బహు దుస్తర కార్యముగా నుండెను. వీని నిర్వహణ బాధ్యతను వహించిన కార్యకర్తలు ఎన్నియో ఇబ్బందులకు గురి చేయబడిరి. సారస్వత సమావేశాల పైనగూడ అనేక విధాలైన నిర్బంధాలు ప్రయోగింపబడి యుండెను. ప్రజల మాతృభాషల వ్యాప్తికి ఏ కొంచము అవకాశ మిచ్చినప్పటికిని అందువల్ల స్వతంత్రభావాలు వ్యాప్తిజెంది రాజకీయముగా తమ కొంప మునిగిపోవు నను దృఢనిశ్చయములో కవి సమ్మేళనాలు సారస్వత సభల యెడల గూడ ఇక్కడి ప్రభుత్వము నిర్బంధ విధానము ననుసరించినది. ఏ చిన్న సమావేశము చేయ దలచి నప్పటికిని ప్రభుత్వము యొక్క అనుమతి అవసరమై యుండెను. ఈ అనుమతి మిక్కిలి దుర్లభమై యుండెను. ఈ వాగ్బంధన శాసనము యొక్క పైశాచిక తాండవము వలన రాజకీయ కార్యకర్తలు సారస్వతోపాసకులు విడివిడి వర్గాలుగా నైనను చీలిపోయి పనిజేయు నవకాశ మైనను దొరకలేదిక్కడ. సమావేశ స్వాతంత్ర్యము, వాక్స్వాతంత్ర్యము, రచనా స్వాతంత్ర్యము హైదరాబాదీయు లందరియొక్క ముఖ్యాశయమై యుండెను. ఈ యాశయముకొరకై ప్రతివారును కృషిజేసియుండిరి. ఈ కృషి ప్రభావము సారస్వతరంగమున గూడ ప్రత్యక్ష మగుచున్నది

విజయనగరసామ్రాజ్య పతనము తరువాత వీరేశలింగము పంతులుగారికిని తెలుగుభాషలో జరిగిన సారస్వతకృషి స్వల్పమైనదనియే చెప్పవచ్చును. ఈ కాలములో సమస్తాంధ్రదేశమునందలి సారస్వతము నకును గ్రహణము పట్టినదని చెప్పిన యతిశయోక్తి కాజాలదు. ఈరాహుకేతువుల పీడనుండి తెలుగుదేశమును విముక్తిగావించి తెలుగుతోటలో క్రొత్తపాదులను నిర్మించిన మార్గదర్శి వీరేశలింగము పంతులు. వీరేశలింగముసంస్కృతాంధ్రములు చక్కగాపఠించి ఆంగ్ల సారస్వత పఠనముచే ప్రభావితుడైన ఉపజ్ఞాశాలి. ఆయన సారస్వత క్షేత్రమున అడుగుబెట్టిన సమయమున తెలుగుదేశమున రెండు ముఖ్యమైన విద్యార్థివర్గాలు ఏర్పడియుండెను. మొదటివారు సంస్కృత పండితులు, రెండవవారు ఆంగ్లవిద్యాంసులు. ఈయిరుపక్షాలమధ్య సరియైన సమన్వయము లేకుండెను. ఉభయపక్షాలకు గూడ తెలుగుతల్లిమీద ఏమంత ప్రేమ యుండియుండలేదు. ఆంధ్ర భాషాభివృద్ధికై కృషి జేయవలెనను పట్టుదల వారికిలేకుండెను. ఈ పరిస్థితు తెలుగుదేశమున శ్రీ వీరేశలింగము తన పాంచజన్యమును పూరించెను. ఆంగ్లభాషద్వారా విద్యాభ్యాసము గావించి ఆ భాషలోగల వివిధవాఙ్మయ విశేషములను చవిజూచిన తెలుగువారిని ఆయన ఆంధ్ర భాషా పునరుద్ధరణము చక్కగా ఆకర్షించినది. కేవల సారస్వత కృషికై హైదరాబాదులోగల నిర్బంధాలు బ్రిటిషు ఇండియాలో లేకపోవుటవలన ఒక్కమారుగా తెలుగుదేశమునందు సారస్వతోద్యమము వెల్లువయై ఉప్పొంగినది. ప్రభుత్వోద్యోగాల యందుండు విద్యా

ధికులుగూడ ఈ మహాప్రవాహమునందు స్నానముచేసి కలము కసరత్తులను గావించినారు.

హైదరాబాదులోని పరిస్థితులు మరొకవిధముగా నుండెను. ఉరూదు సంస్కృతాంధ్ర పండితులున్నప్పటికి వారు పరస్పరము సమావేశమై బాహ్యప్రపంచముతో సంబంధము కలిగించుకొను నవకాశము లేకుండెను. మదరాసు విశ్వవిద్యాలయమున ప్రాంతీయ భాషలకు స్థానమీయబడినందువలన బ్రిటిషు ఇండియాలోని ఆంగ్ల విద్యార్థులకు తమ మాతృభాషలతో పరిచయ మేర్పడియుండెను. హైదరాబాదు రాష్ట్రమున రాజభాష ఉరుదూ. విద్యావిధానమంతయు ప్రాథమికతరగతులనుండి విశ్వ విద్యాలయ తరగతులవరకు ఉరుదూద్వారా జరుపుచు, నే యితర రాష్ట్రములలో లేని క్రొత్త విద్యాపద్ధతి హైదరాబాదుప్రజల నెత్తి మీద రుద్దబడినది. ఉద్యోగములు మొదలైన ప్రభుత్వ కరుణాకటాక్షములుగూడ నూటికి తొమ్మిదిమందిలేని అల్పసంఖ్యాకులమీదనే ప్రసరించినందువలన ఉరుదూ ద్వారానైనను ఉన్నతవిద్య నభ్యసించవలెనను అపేక్ష ప్రజలలో కలుగలేదు. ఇందుకుతోడు ప్రజాసామాన్యముయొక్క ఆర్థికదారిద్ర్యమును వృద్ధిచేసినది. ఈ విధముగా సమస్త భారత మహాసముద్రములో హైదరాబాదురాష్ట్రముక ప్రత్యేకద్వీపముగా సిద్ధమై అందు నివసించుప్రజలను నాగరకప్రపంచమునుండి వేరుచేసినది. తత్ఫలితముగా శతాబ్దాంతమునుండి ఈ శతాబ్దాంతమువరకు హైదరాబాదులోని కొద్దిమంది విద్యావంతులలో రెండు ప్రస్ఫుటమైన వర్గాలేర్పడియుండెను. పల్లెటూళ్లలో గ్రాస వాసోదైన్యమునకు గురియై కృశించుచుండిన సంస్కృతపండితులు ఆంధ్రకవులు మొదటివర్గము. ప్రభుత్వ వ్యవహారాలకొరకు కొలదియో గొప్పయో ఉరుదూభాషా ప్రావీణ్యము దానికితోడు ఫార్సీభాషా పరిచయమును అలవరచుకొన్న లౌకికులు రెండవవర్గము.

ఈ సందర్భమున నింకొక ముఖ్యవిషయముగూడ గమనించవలెను. ఆంగ్లభాష ఒక మహాసముద్రము వంటిది. ప్రపంచ విజ్ఞానభాండారమునకు ప్రవేశము కలుగజేయు తాళముచెవి ఆంగ్లభాష. పాఠకుల నుత్తేజితులనుజేయు సామర్థ్యము ఆంగ్లభాషకు కలదు. కాని ఉరుదూ భాష ఇట్టిది కాదు. ఉరుదూవయః పరిమాణము మూడు నుండి నాలుగు వందల సంవత్సరాలకు మించియుండదు. ఉరుదూ కవిత్వము గోలకొండ బీజాపూరు రాజధానులందు పదహారవ శతాబ్దము యొక్క చివరను. పహేడవ శతాబ్దియొక్క ఆదియందును, ప్రారంభమైనది. ఉరుదూ సారస్వతమునకు శృంగార కవిత్వము ప్రబంధ పోకడలు సూఫీతత్త్వ ప్రతిపాదకమైన సాహిత్యము ప్రధాన లక్షణములు కావున ఈ ఉరుదూ సారస్వతమునకు పఠితలను ఆంగ్లభాషవలె ఉత్తేజితులనుచేసి విజ్ఞానము ప్రసాదించు సామర్థ్యము లేనందువలన ఇది చెప్పదగిన గొప్ప పరిణామాలను ప్రాంతీయ భాషలలో కలుగ జేయలేక పోయినది.

హైదరాబాదు రాష్ట్రములోని తెలుగుసీమవంక తమ దృష్టిని ప్రసరించి ఆధునిక యుగమున ఇక్కడి సారస్వతోద్యమమునకు నిజమైన పునాదులు వేసినవారు స్వర్గీయ శ్రీ కొమర్రాజు వేంకట లక్ష్మణరావుగారు. శ్రీ వేంకట లక్ష్మణరావుగారు మహారాష్ట్రదేశముతోను భాషతోను గాఢమైన సంబంధము పరిచయము కలిగిన విద్వాంసులు. చరిత్ర పరిశోధన విజ్ఞాన ప్రచారము వారి ఆశయాలైయుండెను. ఈ ప్రత్యేక ఆశయాలు కలిగిన లక్ష్మణరావుగారు తెలంగాణ క్షేత్రములో నాటిన సాహిత్య వృక్షము, వానికి అనుగుణమైన ఫలములనే లభింపజేసినది. ఈ శతాబ్దారంభమున హైద్రాబాదు రాష్ట్రమునందు వారు గ్రంథాలయోద్యమ రూపమున భాషాప్రచారము ప్రారంభించిరి. హైద్రాబాదులోని శ్రీకృష్ణదేవరాయాంధ్ర భాషా నిలయము 1901 హనుమకొండలోని రాజనరేంద్ర భాషానిలయముల 1904 స్థాపనకు లక్ష్మణరావుగారి కృషి ప్రోత్సాహములే ముఖ్యకారణములు. లక్ష్మణరావుగారు తమ విజ్ఞాన చంద్రికా గ్రంథమండలిని 190 వ సంవత్సరమున హైదరాబాదు నగరమునందే స్థాపించిరి. ఈ గ్రంథమండలి మొదటి నాలుగు ప్రచురణములు హైదరాబాదునుండియే వెలువడినవి. తరువాత 1908 సంవత్సరమున విజ్ఞాన చంద్రికా గ్రంథ మండలి కార్యాలయము హైద్రాబాదునుండి మార్చుట జరిగినది. లక్ష్మణరావుగారు చూపించిన మార్గమున హైద్రాబాదు రాష్ట్రమందు ఆంధ్రవాఙ్మయ రథము నడిపించుటకు నడుముగట్టిన సారథి మాడపాటి హనుమంతరావు పంతులుగారు. ఒక్క వాఙ్మయోద్యమముకే కాక రాజకీయోద్యమము మొదలైన ఇతర ఉద్యమాలకు కూడ మార్గదర్శకులు శ్రీ హనుమంతరావుగారే. భారత స్వాతంత్ర్యోద్యమ చరిత్రలో కొందరి మహనీయుల జీవితాలను పరిశీలించి నపుడు మనదేశము పరాధీనదేశము కాకుండినచో వారు రాజకీయ రంగమున అడుగుబెట్టక విజ్ఞాన ప్రపంచము

నందు మాత్రమే విహరించెడి వారని నిస్పష్టము కాగలదు. ఇట్టి శ్రేణిలో చేర్చదగినవారు శ్రీ హనుమంతరావు పంతులుగారు. వీరు హైదరాబాదు రాష్ట్రము నందుగాక మరొక ప్రాంతమున జన్మించి యుండినచో తమ జీవితమును సాహిత్య వ్యవసాయమునకు విద్యావ్యాప్తికి పూర్తిగా వినియోగించెడివారు. హైదరాబాదు రాష్ట్రములోని ప్రత్యేక పరిస్థితులే వారి ప్రజాహిత జీవనమునకు రాజకీయవాసన కలిగించినవి. హనుమంతరావుగారు ఇంగ్లీషు, ఉరుదూ, ఫార్సీ భాషలయందు ప్రవీణులు. లక్ష్మణరాయ సాహచర్యముచే ప్రభావితులు. తెలంగాణ పరిస్థితులను చక్కగా అవగాహన చేసుకొనిన ఆంధ్ర భాషా ప్రియులు. వారు దేశభాషల పైన ప్రభుత్వమునకు గల సవతితల్లి ప్రేమను గమనించిరి. ఆంధ్రచరిత్రకు పయుక్తములుగా గల అనేక శాసనములు ఊరూరపడి యుండుటను తిలకించిరి. తాటియాకు గ్రంథాలు వేనవేలుగా జీర్ణించి పోవుట పరికించిరి. నాగరక జీవిత సౌధమునకు ఉరుదూ భాషయే సింహద్వారముగా భావింపబడుట నవలోకించిరి. పల్లెలలో అజ్ఞాతవాసము చేయుచున్న కవిపండితుల యెడల ఒకమారు తమ దృక్కులను ప్రసరించిరి. ఈ పరిస్థితులలో ఆంధ్ర భాషోద్ధరణకు గ్రంథాలయాలే ముఖ్యసాధనములని గ్రహించి జిల్లాలలో విరివిగా గ్రంథాలయాలను స్థాపించుట ద్వారా భాషా ప్రచారములు గావించిరి. కొంత కాలమునుండి నిద్రావస్థలో నున్న ఆంధ్రులను ఈ గ్రంథాలయోద్యమము మేలుకొలిపినది. గ్రంథాలయ సమావేశాలు, వార్షికోత్సవాలు, వాఙ్మయ ప్రదర్శనమునకు రచయితలలో ఉత్సాహమును పురికొలుపుటకు చక్కగా తోడుపడినవి. యువకుల నేకులు సాహిత్యసేవకు కంకణబద్ధులైనారు. గ్రంథమాలలు, పత్రికలు బయలుదేరి భాషాప్రచారము ప్రారంభించినవి. శ్రీ సురవరము ప్రతాపరెడ్డిగారివంటి ఆంగ్ల విద్యాధికులు జీవితములో ఆర్థికముగా అభివృద్ధికి రాగల అనేక అవకాశాలను జారవిడుచుకొని సాహిత్యసేవకు భాషా ప్రచారమునకు పత్రికా రచనద్వారా దేశసేవకు తమ జీవితమును అంకితము గావించిరి. తెలంగాణలో ప్రజాభిప్రాయమును దిద్ది తీర్చుటయందు నిర్భయముగా అభిప్రాయాలు ప్రకటించి ప్రజలకు అండగానిలిచిన గౌరవము గోలకొండ, పత్రికకు యియ్యవలసి యున్నది.

హనుమంతరావుగారు స్వయముగా చక్కని రచయితలు. తెలుగుభాషలో వ్యాసకర్తలు ఈనాటికిని మిక్కిలి అరుదుగానున్నారు. చక్కని-చిక్కని వచన శైలిలో విషయ పరిపూర్ణతగల వ్యాసములను వ్రాయ సమర్థులైన కొద్దిమంది ఆంధ్ర రచయితలలో హనుమంతరావుగారికి ప్రత్యేకమైన స్థానముగలదు. బంకించంద్ర ఛటర్జీ వ్రాసిన ఆనందమఠమను నవలకు తెలుగు అనువాదము 'గ్యారీబాల్డీ జీవితచరిత్ర, రోమకసామ్రాజ్యచరిత్ర, శ్రీ చింతామణిరావు వైద్యాగారి ఎపిక్ ఇండియా అను ఆంగ్ల గ్రంథములకు క్షాత్రకాలపు హిందార్యులను తెలుగు పరివర్తనములు హనుమంతరావుగారి తొలిరచనలు. ఈ రచనలు హనుమంతరావుగారి ఆశయాలు, వానిమీద లక్ష్మణరావుగారి ప్రభావము స్పష్టముగా తెలుపుచున్నది. తెలుగుభాషలో మంచి వచనగ్రంథములు లేకపోవుటచేత ఆలోటును దీర్చవలెనన్నది మొదటియాశయము. ఆంగ్ల, వంగ, మహారాష్ట్రాది ఆంధ్రేతర వాఙ్మయాలలో జరుగుచున్న సాహిత్య ప్రచారమునుజూచి ఆ విధముగానే మన భాషలోగూడ చరిత్ర విజ్ఞానము మొదలైన విషయాలనుగూర్చి గ్రంథరచన చేయవలయుననునది రెండవ ఆశయము. ఆంగ్లాది పాశ్చాత్యభాషలయందలి నూతన వాఙ్మయరీతులను, విజ్ఞానమును తెలుగులో దిగుమతి చేయవలయుననునది మూడవ ఆశయము. నేడు హనుమంతరావుగారు రాజకీయముగా అస్త్రసన్యాసము గావించినప్పటికి ఇట్టి ఆశయాలతో సాహిత్యసేవ కావించుచునేయున్నారు. లక్ష్మణరావుగారి మరణము తరువాత విజ్ఞానచంద్రికాగ్రంథమండలి ఆగిపోయినది. గ్రంథమండలి అంతర్ధానముతోపాటు, తెలుగులో విజ్ఞాన వాఙ్మయ ప్రకటనప్రయత్నాలు సన్నగిల్లినవి. తెలంగాణముననేకాక సమగ్రాంధ్రదేశమున జరిగిన సాహిత్యకృషిని సమీక్షించినచో మనభాషలో వివిధ విషయాలనుగురించి విజ్ఞానమును ప్రసాదించగల గ్రంథజాలము మిక్కిలి తక్కువయనియు మహారాష్ట్ర వంగ, హిందీభాషలతో పోల్చినప్పుడు మనము చాలా వెనుకబడి యున్నామనియు ఒప్పుకొనకతప్పదు. ఇది హనుమంతరావుగారికి హృదయవేదనగలిగించినది. ఈలోటు నివారించుటకే వారు ఆంధ్ర చంద్రికాగ్రంథమాలను స్థాపించిరి. ఆ గ్రంథమాలయొక్క సకలవ్యవహారములను తామే నెరవేర్చుచు గ్రంథప్రకటన గావించుచున్నారు. ఇప్పటివరకీ గ్రంథమాలలో విస్మృత సామ్రాజ్యములు, ఆంధ్రోద్యమచరిత్ర రెండు సంపుటములు, ఆంధ్ర సాహిత్యచరిత్ర సంగ్రహము, ప్రాచీ

సాంధ్రనగరములు, రాజకీయ పరిజ్ఞానము, అను పుస్తకాలు వెలువడినవి. త్వరలోనే ఆర్థిక భౌతిక విజ్ఞానములగూర్చి గ్రంథములు కొన్ని వెలువడనున్నవి. చారిత్రిక దృక్పథము, విజ్ఞాన వాఙ్మయ ప్రచారము అను హనుమంతరావుగారి ముఖ్యాశయములు ఈ గ్రంథమాల ప్రచురణములలో ప్రతిబింబితములగుచున్నవి.

తెలుగు భాషలో హనుమంతరావు గారికి ప్రత్యేక విశిష్టస్థానము నీయగలిగినది వారికథానికా రచన. ఆధునిక ఆంధ్రవాఙ్మయమున కథానికా రచనకు మార్గదర్శకులైన కీర్తి గౌరవములు హనుమంతరావుగారికి చెందవలసియున్నవి. సుమారు నలుబది సంవత్సరాల క్రిందట కృష్ణాపత్రికలో వీరు వరుసగా 13 కథానికలను ప్రచురించి ఆంధ్ర కథానికకు త్రోవ జూపించి యున్నారు.

ఇది యిట్లుండగా శ్రీ లక్ష్మణరావుగారు చూపించిన మార్గాన హనుమంతరావుగారొక గొప్ప సారస్వతోద్యమమునకు దృఢమైన పునాదుల నేర్పరచిరి. ఇతర ప్రాంతాల సారస్వత కృషిని తెలంగాణ సారస్వతోద్యమముతో పోల్చినప్పుడు కొత్తప్రత్యేకతలు కన్పట్టుచున్నవి. తెలంగాణలో సారస్వతకృషి ఒక నిర్మాణాత్మక ఉద్యమముగా కొనసాగినది. ఇతర ప్రాంతాలలో సారస్వత కృషి వ్యక్తులను ఆశ్రయించినది. తెలంగాణా సారస్వత కృషి ప్రజలను మేల్కొలుపు ఒక మహోద్యమముగా సంస్థలను ఆశ్రయించి కొనసాగినది.

## పండిత కవులు

తెలంగాణములో కవులయొక్కయు పండితులయొక్కయు కొరత ఎన్నడు లేకుండెను. ప్రచారము ప్రకటనము ఇక్కడి ప్రత్యేక పరిస్థితులవలన లోపించినందున నివురుగప్పిన నిప్పువలె కవులు పండితులు దాగుకొనియుండిరి. స్థాలీపులాక న్యాయముగా ఈ సందర్భములో వీరిని కొందరిని ప్రశంసించుట అవసరము. శ్రీ వెల్లాల సదాశివశాస్త్రిలవారు కొల్లాపుర సంస్థానవాస్తవ్యులు. బహుగ్రంథకర్తలు, మహాపండితులు సంస్కృతములో చంపువులు శాస్త్ర చర్చలు కావించిన చాలాగొప్పవైయాకరణి ఈయన. తెలుగులో చంద్రికా పరిణయమునకు వ్యాఖ్యాత. వీరి రచనలలో పేర్కొనతగినవి- ఆంధ్రుల చరిత్ర విమర్శనము, సరస భూపాలీయమును గూర్చి కావ్యాలంకార సంగ్రహమను తెలుగు వచన గ్రంథమును, నామిరెడ్డిచరిత్ర (శాసనములపై చరిత్ర) అనునవి. ఈ పండిత శ్రేణిలో పేర్కొనదగిన మరొకరు శ్రీ బుక్కపట్నము శ్రీనివాసాచార్యులవారు. వీరిది విద్వత్కవికుటుంబము. ఎనిమిది తరములుగా వీరి వంశమువారు కవులు- సుప్రసిద్ధులైన కిరీటి వేంకటాచార్యులవారు వీరి పూర్వులలో నొకరు. శ్రీనివాసాచార్యులవారు తమ ఏడవ సంవత్సరమునుండియే కవిత్వము చెప్ప నేర్చి పదునైదవ యేట బాలకవి బిరుదాంకితులైరి. తరువాత మైసూరు సంస్థానాస్థానమందు బాలసరస్వతి బిరుదమందిరి. నవద్వీపములో తర్కతీర్థ బిరుదమందిరి. ఉత్తర భారతమందలి దర్భాంగ, జోధ్పూరు, గవాలియారు, ఇందోరు, ధారానగరు, జమ్మూ మొదలగు అనేక సంస్థానాలలో దిగ్విజయము గాంచినారు. ప్రాకృతములు సంస్కృతము ఆంధ్రము అష్టభాషలలో అనువుగా శతఘంట కవనము చేయువారు. మద్రాసు, కడప, ప్రొద్దుటూరు, బనగనపల్లి, పెనుగొండ, తాడిపర్తి, సురపురము మొదలగు స్థలములలో చాలా అవధానములు గావించినారు. వీరు బహు గ్రంథకర్తలు. రచనలు విశేషముగా సంస్కృతమున నున్నవి. వీరి కుమారులైన జాతకవిద్వాన్ వేంకటాచార్యుల వద్ద వీరి గ్రంథాలు కలవు. ఈ వేంకటాచార్యులవారి నెరుగని పండితులు, కవులు ఆంధ్రదేశమున లేరు. ఆంధ్రనాటక పితామహులగు ధర్మవరము కృష్ణమాచార్యులవారును, ఉత్తర హిందూస్థాన హిందూ సంస్థాన కవీశ్వరులును, వీరిని ప్రశంసించిరి. శ్రీ తిరుపతి వెంకటకవులు వీరిని కొనియాడుచు పద్యములను వ్రాసిరి.

హిందూ, మద్రాసుమేలు, స్టాండర్డు వంటి ఆంగ్లపత్రికలు వీరి ఆశుకవితను గాంచి అద్భుతపడి అనేకరీతులుగా స్తుతించిరి. మైసూరులోని వైష్ణవ పీఠమునకు అధిపతులుగా వెల్లిన పరకాలస్వాముల వారు గద్వాల వాస్తవ్యులు. గొప్ప సంస్కృతాంధ్ర పండితులు, శతాధిక గ్రంథకర్తలు. గద్వాల వాస్తవ్యులే యైన పుల్లగుమ్మి వెంకటాచార్యులవారు గొప్ప వైయాకరణులు. సంస్కృతాంధ్ర రచయితలు. అత్తాకూరి మల్లికార్జునశాస్త్రిగారు రాయచూరు వాస్తవ్యులు, శతావధానులు. గణిత శాస్త్రమున ఎన్నికోట్ల సంఖ్యలైనను నోటితో లెక్కించి చెప్పగల సమర్థులు. చాలా గొప్ప జ్యోతిశ్శాస్త్రవేత్తలు. వట్టెము వాస్తవ్యులగు పాపకవి తెనుగుకవి. వనపర్తి వాస్తవ్యులగు విక్రాల సోదరులు గొప్ప పండితకవులు. కర్నమడకల అనంతాచార్యులవారు గద్వాల ఆస్థానపండితులుగా నుండిరి.

న్యాయ వేదవేదాంతవ్యాకరణ మీమాంస సాహిత్యము లందు గొప్ప ప్రవీణులు. కాశీనుండి శివకుమార పండితులవారు గద్వాలకు వచ్చి అనంతాచార్యులవారు లేరనివిని తమ పాండిత్యప్రకాశమునకై సభను జయించుటకు ప్రభులయాజ్ఞనుబొంది ఈ సభలో తమను జయించువారు లేరని శపథముచేసి అందరిని ఓడించిరి. తరువాత రాజుగారు అనంతాచార్యులవారిని పిలిపించిరి. వారు వీరి వాదమును ఒక్క పూర్వపక్షము ఖండించినంతనే శివకుమార పండితులు, ఇది అనంతాచార్యులవారికి దప్పమరొకరికి సాధ్యముకాదని తెలిపిరట. శ్రీ పత్రి విశ్వేశ్వరశాస్త్రిగారు చక్కని కవిత్వము చెప్పగల గొప్ప పండితులు. రామాయణ సంగ్రహము వారి రచనలలో పేర్కొనదగినది. ప్రాస్తావికముగా వీరు చెప్పిన పద్యములు మనోహరమైనవి. కొల్లాపురమునుండి వెళ్ళిపోవలెనను ఉద్దేశమును ప్రకటించుచు వెళ్ళిపోవుటకుముందుగా ఆశువుగా చెప్పిన

"స్థానబలంబునన్ హృదయసార మెఱుంగని దుష్టవంశసం
తానము విఱ్ఱవీగెడు కతాన పరస్పరఘర్ష జాతమై
శ్వానరవిస్ఫులింగములు బర్వి వనంబ ఖిలంబుగాల్చెడున్
కానదొలంగి యీ సుఖముగాంచుమి చందన! లోకనందనా!"

ఈపద్యము పేర్కొనదగినది గోపాలపేట రామచంద్రాచార్యులవారు శతావధానులు; ఆనందరామాయణ ఆంధ్రగ్రంథకర్తలు-మహాభక్తవిజయ గ్రంథకర్త మండడి వేంకటకృష్ణకవి వనపర్తివాస్తవ్యులు-చక్కని కవులు. దివ్యవాణిపత్రికాసంపాదకులైసనాతనధర్మ ప్రచారమునకు కంకణముగట్టిన చివుకుల అప్పయ్యశాస్త్రిగారు సికింద్రాబాదునుండి గర్గభాగవతాది బహుగ్రంథములను వ్రాసి ప్రకటించిరి.

రెండు సంవత్సరాల క్రింద గతించిన శ్రీ చిదిరెమఠము వీరభద్రశర్మగారు నల్లగొండ జిల్లా చర్లపల్లి వాస్తవ్యులు. కాశిలో వీరొక పీఠమునకు అధిపతులైనారుకూడ. వేదతీర్థ కావ్యతీర్థస్మృతితీర్థధర్మాచార్య, సాహిత్య విశారద, మున్నగు బిరుదాంకితులు. మహారాష్ట్ర కర్ణాటక సంస్కృతాంధ్రములు బాగుగా తెలిసి కవిత్వము చెప్పగల సమర్థులు. మంచి విమర్శకులు, ప్రామాణికులైన పండితులు, వక్తలు.

వీరందరు ఈ పాతిక శతాబ్దములో గతించినవారు.

ఇప్పటికి తెలంగాణ జిల్లాలలో వివిధశాస్త్ర పరిజ్ఞాతలు ఉద్దండ పండితులెందరో కలరు. వీరిలో వట్టెము నరసింహశాస్త్రి గారు, ప్రత్యేకముగా పేర్కొనదగినవారు. వీరు గొప్ప వైయాకరణి. శ్రీ అయితమురాజు కొండల్ రావుగారు బహు భాషావిశారదులు. ప్రస్తుతము ప్రభుత్వ విద్యాశాఖనుండి ఉపకార వేతనము పొంది హైదరాబాదులో నివసించుచున్నారు. సంస్కృతాంధ్రాంగ్లములందేకాక ఉరుదూ, ఫార్సి, అరబ్బీ, కర్ణాటాది బహుభాషల యందు పాండిత్యము గడించి ఉరుదూ తెనుగు నిఘంటువును వ్రాసిరి. ఈ పండితులలో వక్తలు, హాస్య రసపూరితముగ సంభాషించగల నేర్పరులుకూడ కలరు. మహబూబునగరము లోని అచ్చంపేట వాస్తవ్యులు గొప్ప వైయాకరణులు నగు నరసింగయ్యగారు ఇట్టి చమత్కార సంభాషణలలో నేర్పరులు. వీరిని ఒకరు తాంబూలము వేసుకొమ్మని కోరగా తాము పతితద్విజులమని చెప్పి తమకు దంతములు లేకపోవుటను శ్లేషించిరి. గద్వాలలో ఆస్థాన కవీశ్వరులుగా నుండి గతించిన శ్రీ గాడేపల్లి వీర రాఘవశాస్త్రి గారు అద్వితీయమైన ధార, గొప్ప ప్రతిభ గలిగిన ఉద్దండ కవీశ్వరులు. వీరి అవధానములు, సమస్యా పూరణములు శ్రీనాథ తెనాలి రామకృష్ణాది పూర్వకవీశ్వరులను స్మరింప జేయునవియై యున్నవి. వీరి కవిత్వము ఇతరుల కవిత్వము వలె సులభమైనదే యని ఒకరు ఆక్షేపించి నప్పుడు వీరు

సులభంబైన సమాసమాయెనట దిక్శుద్ధాంతకాంతానిర
ర్గళ లావణ్యమయ ప్రభావ విహవత్కల్లోలమాలాతిని
ర్మల డిండీరకణాయమానసుయశోరామామనోహారి వా
గ్విలసద్భూషణునన్నుగంగరాకొ దేవిఎంతమాటాడెదూ.

అని యాశువుగా జెప్పిన ఎనిమిది పద్యములు వీరి నిరర్గళ కవితా ధోరణిని నిరూపించుచున్నవి. అనేక అవధానాలు గావించి దుష్కర ప్రాసలతో గూడిన వివిధసమస్యలను పూరించి వీరు సారస్వత జైత్రయాత్రను గావించిరి. ఒకసభలో 'పాండిత్య హీనాః కవయః' అని ఒకరెత్తిపొడచి నప్పుడు వీరు

వ్యాసుండన్న పురాణకర్త అతడా పాండిత్యహీనుండె కా
భాసుండన్న మహాకవీంద్రుడతడా పాండిత్య హీనుండు వా
గ్వ్యాసంగుండగు భట్టబాణుడతడా పాండిత్యహీనుండు.

అని యేబదిరెండు పాదముల శార్దూల వృత్తములో

కస్త్రీకీవు డీకొందువా ? నీ సంసారము గుట్టు
**లో** దలచి వందేయించు వాకొందువా ?

అని ప్రశ్నించిరట. ఈ కవి అనేక సమస్యలను పూరించిరి. వానిలో ఉదాహరణకై, "దారము లేని హారము సుదాగత నీ కెవరిచ్చిరమ్మ రో ?" అను సమస్యను.

సారస గాత్రి యొక్కతె నిశాసమయంబున మంచి ముత్తెముల్
గూరిచి తా ధరించి తనుగూడెడు నాథుకవుంగిలింప జే
కూరను గుర్తులివ్వగని కోమలి కట్టని రెల్ల నెచ్చెలుల్
దారములేని హారము సుదారత నీ కెవరిచ్చిరమ్మ రో ?

దీనికే పూర్వకవులు మరికొందరు పచ్చలా దారము లేని హారమనియు మందారము లేని హారమనియు పూర్తిచేసిరని చెప్పినప్పుడు వీరిపూరణములోని స్వారస్యము స్పష్టము కాగలదు. కవిశ్రేణిలో చేర్చదగిన మరొకరు కీ॥ శే॥ మాదిరాజు విశ్వనాథ రావుగారు. వారు అరబ్బీ, ఫార్సీ, ఉర్దూ, ఇంగ్లీషు, సంస్కృతాంధ్రాది బహుభాషా విశారదులు. ప్రస్తుతము హైద్రాబాదు ప్రభుత్వశాఖలో ఉన్నతోద్యోగము నందున్న రావుగారు ఇటీవలనే కీర్తిశేషులైరి. ఈ ప్రాంతములో లక్ష్మణశాస్త్రిగారితో కలసి వీరు కర్ణసుందరి యను నాటకమును, బిల్హణుని విక్రమాంకదేవచరిత్ర ప్రబంధమును తెనుగులో వ్రాసియున్నారు. విశ్వనాథ కవితావ్యాసంగమును ఇతరులలో వ్యాప్తిజేయుటకు శ్రమించి తాము ఇతరులతో జేయు పరస్పర ఉత్తరప్రత్యుత్తరములు కూడ పద్యరూపమునసే జరుపుచు ఒక కవిత్వ ఉద్యమమును కొల్లాపురములో లేవదీసిన స్నేహలతా కవితాసంఘనిర్వాహకులు శ్రీ రామసుబ్బారాయుడుగారు, ప్రత్యేకముగా ప్రశంసనీయులు. నల్లగొండ జిల్లాలో శ్రీ గవ్వా అమృతరెడ్డి శ్రీరంగులఅయి రెడ్డిగార్లు మనోరకవిత్వమును వ్రాసినారు శాయిరెడ్డిగారి 'కాపుబిడ్డ' చక్కని ఖండకావ్యముల సంపుటి.

ఈ విధముగా ఈ శతాబ్దియందు శ్రీ మాడపాటి హనుమంతరావుగారు నవీనపద్ధతులద్వారా సారస్వతోద్యమ వ్యాప్తికి కృషిజేయుచుండగా మరొకవంక విద్వత్కవిసింహములు సంస్థానాధీశ్వరుల ఆస్థానాలలో వీరవిహారములు గావించినవి. ముఖ్యముగా వనపర్తి, ఆత్మకూరు, గద్వాలసంస్థానములు కవి పండితుల పోషణకు ప్రసిద్ధిగాంచినవి. గద్వాల సంస్థానాధీశ్వరులు కీర్తిశేషులునగు సీతారామ భూపాలుడు గావించినన్ని కవిపండిత సన్మానములు, యెన్నడు యే ఆస్థానమునందును జరుగలేదని బహుపండితుల అభిప్రాయమై యున్నది. రసికులు భాషాపోషకులు విద్యాప్రియులునగు ఆధునిక సంస్థానాధీశ్వరులలో వారు మున్నెన్నదగినవారు.

## నవయుగారంభము

ఈ శతాబ్దిలో శ్రీ హనుమంతరావుగారి పిలుపును అందుకొని భాషాసేవకు యువకులనేకులు ముందుకువచ్చి పత్రికలద్వారా, గ్రంథాలయాలద్వారా సారస్వతసభలద్వారా, గ్రంథమాలలద్వారా, విశేష కృషిని గావించిరి. ఈ సందర్భములో శ్రీ సురవరము ప్రతాపరెడ్డిగారినామము ప్రత్యేక ప్రశంసనీయము. శ్రీ సురవరము ప్రతాపరెడ్డిగారు బహుముఖముల వాఙ్మయసేవ గావించిన భాషాతపస్వి. ఆయనను రాజకీయనాయకుడుగా పత్రికాసంపాదకుడుగా సకలాంధ్రదేశము గుర్తించినది. కవిగా, నాటకరచయితగా, కథకుడుగా, పరిశోధకుడుగా, పండితవర్యుడుగా ఆయన యావదాంధ్ర దేశఖ్యాతిని గాంచిరి. ప్రతాపరెడ్డి ఒక వ్యక్తిగాదు, ఒక మహాసంస్థ, ఎందరో రచయితలను వాఙ్మయరంగమునకు లాగుకొని వచ్చి ముందుకు నెట్టినాడాయన. తెలంగాణమును మేలుకొలిపిన వైతాళికులలో ముఖ్యుడాయన. నీలగిరి, తెలుగు పత్రికలు, సుజాత యీ రాష్ట్రమున సారస్వత ప్రచారమునకు స్తుతిపాత్రమైన కృషి గావించినవి. నీలగిరి, నల్లగొండనుండి వెలువడినది. తెలుగుపత్రిక వరంగల్లు జిల్లా మానుకోట తాలూకాలోని ఇనుగుర్తి యను చిన్నగ్రామమునుండి ఒద్దిరాజు సీతారామచంద్రరావు రాఘవరంగారావు అను సోదరుల సంపాదకత్వమున వెలువడినది. ఈ సోదరులు విశేష ప్రతిభావంతులు. అనేకవిధాలైన వాఙ్మయనిర్మాణము చేయగలిగిన దక్షులు. జోడుగుఱ్ఱముల వంటి యీ సోదరకవులు, ఏకాంకికలు, కథలు, నాటకములు, వ్యాసములు, విమర్శలు, పుంఖానుపుంఖముగా తెలుగు పత్రిక ద్వారా తెలంగాణమున ప్రకటించి విశేష భాషా ప్రచారము గావించిరి. ఆనాటి నీలగిరి, తెలుగుపత్రికల సంపుటాలను ఒకమారు పరిశీలించినచో యువక ప్రతిభకు, అజ్ఞాత రచనలకు, యీ పత్రికలు యే విధముగా దోహదము గావించినవో స్పష్టము కాగలదు.

శేషభట్టరు రామానుజాచార్యులవారు భావోద్వేగముతో కూడిన ఖండకావ్యముల నెన్నింటినో రచించి, ఉత్తమకవిశ్రేణిలో ప్రత్యేక స్థానము

సంపాదించుకొనిరో వీరు హాస్యరసాత్మక పద్యములు వ్రాయుటలో దిట్టలు. వీరేశలింగకవి కంఠాభరణగ్రంథ మాలాధిపతులు. వీరి రచనలు, సుజాత, తెలుగుపత్రిక, నీలగిరి పత్రికలలో ప్రకటితము లైనవి. వీరి రచనలు నేడు వారి గృహమున అజ్ఞాతవాసము చేయుచున్నవి. సుజాత, శ్రీ పి. యన్. శర్మగారి సంపాదకత్వమున హైదరాబాదునుండి వెలువడినది. శ్రీ శర్మగారిప్పుడు హైదరాబాదులో ఉన్నతోద్యోగము నందున్నారు. ఈ పత్రిక ఇరువది యువకులలో అపారమైన ప్రబోధము కలుగజేసి ఎందరో రచయితలను, కవులను ఉద్భవింపజేసినది. సుప్రసిద్ధులైన శ్రీ గుడిపాటి వేంకటాచలము గారి రచనలను మొట్టమొదటి సారిగా ప్రకటించిన గౌరవము సుజాత పత్రికకు యీయవలసి యున్నది.

ఈ విధముగా హైదరాబాదులో జరిగిన ప్రబోధ ఫలితముగా ఆధునిక సారస్వతమునకు తెలంగాణ క్షేత్రములో బీజావాపనమైనది. ఎన్నియో పాదులు కల్పించబడినవి. ఆ పాదులలో ప్రభవించిన సాహిత్య వల్లి క్రొత్త క్రొత్త పూవులనేకము విరియబూచి కమ్మతావులను వెదజల్లినది.

యువకులు సారస్వత రంగమున నూతన మార్గముల నన్వేషింపసాగినారు. ఈ ఉద్యమము ఇరువదవ శతాబ్దములో బిగింపబడిన కళాశాలలను గూడ కొంతవరకు కదలించినది. ఉన్నత విద్యనభ్యసించు యువకులు కొందరు సాహిత్యరంగమున ముందంజవేసిరి. వీరిలో కొందరిని పేర్కొనుట యీ సందర్భమున అవసరమైయున్నది. నిజాం కళాశాలలో విద్యనభ్యసించుచున్న శ్రీ సిరిగూరి జయరావు ఇట్టి యువకులలో పేర్కొనదగినవారు. ఈయన తెలుగులో ఆధునిక పద్ధతిని ఉత్కృష్టమైన కవిత్వము వ్రాసినారు. తిక్కననుగూర్చి యీయన వ్రాసిన గేయము తెలుగు వారు నిద్దురమేలుకొనవలెనని సీస పద్యములలో జేసిన ప్రబోధము ఇతర సారస్వత వ్యాసములు తెలుగు సరస్వతికి మంచి కానుకలు.

ఒకపంక నాంగ్లేయ సుకుమారి యిచ్ఛగిం
పులతోడ వలపింపదలచుచుండ
మూసుగులో దాగిలి మూతలాడుచు నుర్దు
భాషావనిత వలల్ బరచుచుండ
అప్సరోభామినినంచు సంస్కృత కాంత
పాలిండ్లు పొంగార పై బడంగ
తగుదునమ్మా యంచువగలాడి గ్రామ్యంపు
గులుకు మిటారి తళుక్కులు నటింప
హిందీ కన్యను పెండ్లాడుమీయటంచు
పెద్దలందరు బలవంత పెట్టనకట !
చిన్నతనమునుండి నెచ్చెలిగనున్న
తెలుగుకన్నియ మద్దులు తీర్చుటెపుడో.
చనుబాలు త్రాగునాడను రాగమొలుకంగ
అమ్మాయటంచు మాటాడునాడు
గోళికాయల నాడుకొనునాడు తగవులా
టలలోన తిట్టులు పలుకునాడు
అత్తింటికేగిన క్రొత్తలో నురదలి
హాస్యోక్తులకు బదులాడునాడు
ముసలి ముత్తాత నీరసముగా వెడలిపో
రొదనంచు కడమాట వదలునాడు
చచ్చెనో, మొదలెరుంగదో పచ్చిపట్టి
యాపుమాసెనో అన్యభాషా పిశాచి
ఘోర రొదనుండి దాపురమాయె నీకు
తెలుగు కాపురమునకు పెద్ద తెగులువోలె.

శ్రీ జయరావు తరువాత ఐ. సి. యస్. పరీక్షలో విజయముపొంది ఉన్నతోద్యోగము నందుండగా పిన్న వయసుననే మృత్యుదేవత ఆయనను కబళించినది. జయరావువలెనే ఎన్నో ఆశలు గొలిపి అకాలమరణము వాతబడిన వారు కోదాటి రామకృష్ణారావు. ఈయున కలము ఖండకావ్యరచనయందు వ్యాసరచనయందు నిగ్గులు దీరినది. తెలుగుపత్రిక, సుజాత మొదలైన పత్రికలను ఈయన రచనలు అలంకరించినవి. ఇంచుమించుగా వీరిద్దరితో సమకాలికుడు శ్రీ మామునూరు నాగభూషణరావు. ఈ కవికోకిలము కొంతకాలము తెలంగాణ సారస్వతోద్యాన వనమున మధురమధురముగా గూసి నేడు మౌనముద్రను వహించినది. చక్కని కవిత్వము వ్రాయుటేగాక శ్రావ్యముగా పాడగలసమర్థుడీయన. సారస్వత చంద్రికా గ్రంథమాలను స్థాపించి యీయన వెన్నెలపువ్వులను మనోహర ఖండకావ్య సంపుటినొకదానిని ప్రకటించినారు. ఈ సంపుటి ఈయన అభిరుచి ప్రాశస్త్యమునకు రసహృదయమునకు ఉజ్వలోదాహరణము. శ్రీ భండారు వీరరాజేశ్వరరావు యీకాలమున పేర్కొనవలసిన మరొక యువకవి. అర్ధ్రిపురుగు పసిపాపవంటి ఖండకావ్యములు యీయనకు సకలాంధ్ర దేశకవిమండలియందు ఉత్కృష్టస్థానము నొసగుచున్నవి. ఇదేకాలమున సారస్వతరంగమున ప్రవేశించిన మరొకవ్యక్తి శ్రీ ఉదయరాజు శేషగిరిరావు. ఈయన సంస్కృతాంగ్ల అరబ్బి పార్సీ మొదలైన బహు

# తెలంగాణసీమ

శ్రీ కేశవపంతుల నరసింహశాస్త్రి "శిరోమణి"

సీ॥ శాతవాహనుల రాజ్యశ్రీకి ముత్యాల గొడుగుపట్టుటకు ముందడుగు వేసి,
పులకేశి దక్షిణ భూచక్రవర్తిత్వ భాగ్యంబు నిల్పఁగాఁ బాజుదీరి,
రాష్ట్రకూటుల శౌర్యరమ మాల్యఖేటాన దీపింప రత్నాలదిమ్మె గట్టి,
పశ్చిమ చాళుక్య భండనశతములం దరి వీరకంఠముల్ తఱిగిపోసి.
గీ॥ వీరవరులైన కాకతిచేత్రరాజ, పోలరాజుల గెలిపింప వాలుఁదాల్చి,
తరతరంబున శౌర్యబంధుర యశంబుఁ గన్న గుణభూమ మా తెలంగాణసీమ. 1

సీ॥ చాళుక్యయశము పీసరవోవ రాజేంద్ర చోడుండు తమిళులఁ జొన్పునాఁడు
త్రిభువనమల్లుని తీవ్ర ప్రతాపాగ్ని వేంగిపై మంటలు విసరునాఁడు,
తమిళ కన్నడరాజ్యరమలు గోసిగపట్లఁ దెలుఁగు పంటవలంతి నలుగునాఁడు,
వెలనాడు, వేఁగినాడల పాకనాడుగా నాంధ్రదేశము తునుకలైననాఁడు,
గీ॥ ఓరిమి వహించి, శౌర్యంబు నుగ్గఁబట్టి, తఱినివేచు తెలంగాణ బిఱుదు మగలు
గణపతి క్ష్మాపసింహంబు ఖణిఖణిల్లు, మనుట తడవుగ దిక్కుల సణఁచినారు. 2

చం॥ రణమహి వెన్నుఁజూపని పరాక్రమ దీక్షవహించి మత్త వా
రణ జవనాశ్వ సద్భట పరంపర తోడుగ జైత్రయాత్రలన్
గణపతిదేవువెంట నరిగాపులుగా, బడవాళ్ళుగా, మహో
ల్బణమగు కాలిబంటులుగఁ బర్విన దీ తెలంగాణ పేరులే. 3

మ॥ అదిగో యాదవు, లల్లదే హొయిసల వ్యాకీర్ణ సేనల్; మహా
మ్మదు ఘోరీ తఱివేచి దక్కను జయింపన్ వచ్చునేమో యటం
చెద ఘూర్ణిల్లు తెలుంగువారి కభయంబీనెంచి సర్వాంధ్ర సం
పదఁ గాపాడిన కాకతీయులఁ దలంపన్ మేను కంపించెడిన్. 4

మ॥ సకలాంధ్రావని కొక్క శాసనముగా సామ్రాజ్య సంస్థాప నో
త్సుకుఁడై ఖడ్గముఁబట్టు శ్రీ గణపతీంద్రున్ గూడి కాళింగులన్
జకిత స్వాంతులఁజేసి; తక్కు దొరలన్ స్వాధీనమందుంచి; కాం
చికి ముట్టన్ దమగుఱ్ఱముల్ నడిపి వాసింగాంచిరీ దేశజుల్. 5

భాషలలో ప్రవీణుడు. చక్కని కవిత్వము వ్రాయగల ప్రతిభావంతుడు. మనోరమయను ఖండకావ్యము యీయన రచనలలో పేర్కొనదగినది. గార్లపాటి రాఘవరెడ్డి యీ యుగమునకుచెందిన మరొక విద్వత్కవీశ్వరుడు.

ఈ విధముగా ప్రతిభావంతమగు కవితా వ్యాసంగము ఒకవంక జరుగుచుండగా మరొకవంక కథానికల రచనయందు తెలంగాణ యువకులు ముందుకు రాసాగిరి. ఇట్టి యువకులలో శ్రీ నందగిరి వేంకటరావు ముఖ్యుడు. ఈయన ఆనాటి పత్రికలలో అసంఖ్యాకములగు కథలను ప్రకటించినాడు. హైదరాబాదులో జరిగిన మొదటి అఖిలాంధ్ర కథకుల సమావేశమునకు అధ్యక్షత వహించినాడు. నందగిరి చక్కని వ్యావహారిక భాషతో కథానికా రచన చేయగలిగిన సమర్థుడు. స్త్రీ పురుష సంబంధ సమస్యలగు ఈయన కథానికలలో ప్రాధాన్యత కనబడుచుండును. సకలాంధ్ర కథకులలో మొదటి శ్రేణికి చెందదగిన కథకుడీయనయని చెప్పిన అతిశయోక్తి కాజాలదు. విద్వాంసులై, పరిశోధకులై కథానిక రచన వంక తమ దృష్టి ప్రసరించినవారు సురవరము ప్రతాపరెడ్డి గారు. వీరి కథలు ప్రతాపరెడ్డి కథలు అని పుస్తక రూపముగా ప్రకటింపబడినవి. ఈ కాలమున వచన రచనలు గావించిన వారిలో ముఖ్యులు నేడు హైదరాబాదు విద్యాశాఖామంత్రిగానున్న ప్రఖ్యాత ఆంధ్ర నాయకులు శ్రీ బూర్గుల రామకృష్ణారావు గారు. వీరు బహుభాషా విశారదులు, కవులు, విమర్శకులు, వక్తలు. ఇంగ్లీషులో గ్రే వ్రాసిన ఎలిజి మరియు ఉమర్ ఖయ్యాం రుబాయీలను వీరుమనోహరమైనపద్యములలో ఆంధ్రీకరించి యున్నారు. వీరుపార్సీ వాఙ్మయ చరిత్ర, ఎంకి పాటలు మొదలైన ఆధునిక రచనలను గూర్చి వీరు వ్రాసిన వ్యాసములు మన తెలుగు విమర్శనమున అగ్రశ్రేణిలో నుండదగినవి. రామకృష్ణారావు గారు చరిత్ర పరిశోధకులుగూడ. అప్పకవి నివాసస్థానము గూర్చిన చర్చలలో వీరు పాల్గొని అప్పకవి తెలంగాణ ప్రాంతము వాడని వీరు నిరూపించియుండిరి

శ్రీ మాడపాటి హనుమంతరావుగారికి సమకాలికుడై హైదరాబాదాంధ్రుల అభ్యుదయమునకై అపారమగు సేవ గావించినవారు శ్రీ ఆదిరాజు వీరభద్రరావు గారు. కీర్తిని కాంక్షింపక సేవయే ప్రధానముగా భావించిన వారిలో వీరు అగ్రగణ్యులు. వీరు లక్ష్మణరావుగారిఅనుచరులు. హనుమంతరావు పంతులుగారికి కుడి భుజమువంటివారు. హైదరాబాదలోని కృష్ణదేవరాయాంధ్ర భాషానిలయము యొక్క పెంపు సొంపులకు కారణభూతులైన పెద్దలలో వీరుముఖ్యులు. యీనిలయరజతోత్సవసంచికను సంపాదకులై దానినిసర్వాంగసుందరముగా విజ్ఞానదాయకముగా సిద్ధముచేసియుండిరి. లక్ష్మణరాయ పరిశోధక మండలికి కార్యదర్శులై పెక్కు శాసనాలను అనేక చరిత్రాంశములను బహిరంగ పరచినారు. ఇంకను చరిత్రాత్మకములు, భాషా విషయకములు, విజ్ఞాన దాయకములునగు వ్యాసములనేకములను వ్రాసి ఆంధ్రవచన రచయితలందు విశిష్టమగు స్థానము నాక్రమించియున్నారు. నేడు హైదరాబాద రాష్ట్రమునందలి చారిత్రక ప్రదేశములు చరిత్రపరిశోధన భాషా వ్యవసాయము ఇంతయేల ఆంధ్రోద్యమము యొక్క ఏ విషయమును గురించి యైనను సమగ్ర విజ్ఞానము గలిగిన వారు శ్రీ వీరభద్రరావు గారను టలో అతిశయోక్తి యేమియును లేదు. ప్రచ్ఛన్నముగా వీరు చేసిన భాషాసేవ ఎంతయో కలదు. వీరివి అనేక అముద్రిత రచనలు కలవు. ముద్రిత రచనలలో పేర్కొనదగినది ప్రాచీనాంధ్ర నగరములను గ్రంథము.

ఈ కాలమున పత్రికలలో రచనలు గావించి, సభలలో ఉపన్యాసాలు జేసి సంస్థల నిర్వహణ బాధ్యత వహించి సారస్వత సేవకు కృషిచేసిన విద్యాధికులలో శ్రీ గాడేపల్లి సూర్యప్రకాశ రావు గారు, శ్రీ నరిపెల్లి విశ్వనాథ శాస్త్రిగారు, శ్రీ ఇల్లందల సీతారామ రావు గారు, శ్రీ లోకనంది శంకర నారాయణ రావు గారు మొదలైనవారుముఖ్యులు. సాహిత్యరంగమునందే కాక కళారంగమున యీ కాలమున ప్రశంసనీయమగు సేవ జరిగినది. శ్రీ మార్చాలరామాచార్యులు వారు మంచి చిత్రకారులుగా పేరుపొందిరి. వీరి చిత్రములు 'సుజాత, మొదలైన పత్రికలలో ప్రకటితమైనవి. నాట్యకళ అభివృద్ధికై యువకులు కొందరు నడుముకట్టి కళాసమితులను స్థాపించిరి. సికిందరాబాదలోని 'జగదీశ నాట్యమండలి' వీనిలో యెన్నదగినది. ఈ నాట్యమండలిలో ముఖ్య పాత్రధారులు బుచ్చయ్యగారు. ఈమండలివారు మదరాసు, బెజవాడ, గుంటూరు, సింగరేణి, సికిందరాబాదు మొదలైన పట్టణాలలో నాటకాలు ఆడిమెప్పులు పొందిరి.

ఈ విధముగా ఆధునిక యుగమున అన్నిరంగములందు హైదరాబాదాంధ్రులు ముందుకు వచ్చి కృషిని

గావించిరి. ఈ కృషికి పత్రికలు, గ్రంథమాలలు, గ్రంథాలయాలు, మిక్కిలి సహాయకారులైనవి.

## సారస్వతోద్యమములు

ఈ రాష్ట్రమున మొదటి పత్రిక హితబోధిని. ఇది క్రీ. శ. 1913 లో మహబూబు నగరము నుండి శ్రీనివాస శర్మగారి సంపాదకత్వమున వెలువడినది. ఈకాలముననే అవతరించి సేవజేసిన పత్రికలలో ఆంధ్రమాత, నీలగిరి, తెలుగు, గోలకొండ, శైవ ప్రచారిణి, మీజాన్, దివ్యవాణి, సుజాత, ఆంధ్రాభ్యుదయము, దేశబంధు, దక్కన్ కేసరి, పూలతోట, మద్యపాన నిరోధక పత్రిక, తెలుగుతల్లి, ఆంధ్రకేసరి, విభూతి, పేర్కొనదగినది. గ్రంథమాలలలో గోలకొండ కిన్నర, దివ్యవాణీ సుకృతి ప్రాసాదము మాతృభారతి, ఆంధ్ర శ్రీ, కాకతీయ, పూలతోట, వీరేశలింగ కవి కంఠాభరణ, కృషిప్రచారిణి, శివధర్మగ్రంథమాల, విజ్ఞానప్రచారిణి, వెంకటేశ్వర, అణా, దేశోద్ధారక, ఆంధ్రకేసరి; సాహితీమేఖల, సాధనసమితి, కావ్యమాల, మొదలైనవానిని పేర్కొనవలసియున్నది. సారస్వత సంస్థలలో విజ్ఞానవర్ధిని పరిషత్తు, వైతాళిక సమితి, ఆంధ్ర వాఙ్మయ సేవాసమితి, కాకతీయకళా సమితి, యెన్నదగిన సేవగావించినవి. ఇవిగాక గోలకొండ కవులసంచిక, కృష్ణదేవరాయల గ్రంథాలయ రజతోత్సవ సంచిక, శబ్దానుశాసనాంధ్రభాషా నిలయ రజతోత్సవసంచిక, పోతనవర్ధంతి సంచిక, హనుమంతరాయషష్టిపూర్తిసంచిక మొదలైనవి సానికుల రచనలను యేరి కూర్చి ప్రకటించినవి.

ఈ విధముగా జరుగుచుండిన సారస్వతసేవకు ప్రోత్సాహకరములైన మూడు ముఖ్యవిషయాలను ఇక్కడ పేర్కొనవలసి యున్నది. హైదరాబాదులో ఆంధ్రబాలికలకు మాతృభాషలో విద్యాభ్యాస సౌకర్యము గలిగించి, మహిళామణులలో ఆంధ్రసారస్వతాసక్తి కలిగించిన సంస్థ హైద్రాబాదు నారాయణగూడెములోని ఆంధ్రబాలికా పాఠశాల. ఈ బాలికా పాఠశాలయందు విద్యాభ్యాసము గావించిన బాలికలు తరువాత విదుషీమణులుగా రచయిత్రులుగా ప్రఖ్యాతి గాంచినారు.

క్రీ. శ. 1940 వరకు హైదరాబాదులో తెలుగు దిన పత్రికను స్థాపించి నిర్వహించు ప్రయత్నాలు అప్పటి ప్రభుత్వ నిర్బంధము వలన సాగలేదు. పత్రిక అనుమతి కొరకు ప్రముఖులు ప్రయత్నించి విఫలులైరి. కాని యెట్లో తుదకు 1940 సంవత్సరమున తెలంగాణ పత్రికను నిర్వహించుటకు అనుజ్ఞ లభించినది. ఈ దిన పత్రికద్వారా ఇక్కడి సారస్వతోద్యమమునకు మంచి దోహదము కలిగినది. ఇదే సందర్భములో హైదరాబాదులో జరిగిన మరొక సంఘటనను ప్రత్యేకముగా స్మరించవలసి యున్నది. హైదరాబాదులో ఆంధ్రోద్యమము గ్రంథాలయోద్యమముగా ప్రారంభమైయుండెను. కాని క్రమక్రమముగా యీ ఉద్యమము రాజకీయ ఉద్యమముగా పరిణమించినది. అందుచేత తెలంగాణములోని ఆంధ్రులకొరకు మరొక సారస్వత సంస్థను స్థాపించు అవసరము కలిగెను.

## ఆంధ్ర సారస్వత పరిషత్తు

శ్రీ మాడపాటి హనుమంతరావు, శ్రీ సురవరము ప్రతాపరెడ్డి మొదలైన పెద్దలు 'ఆంధ్ర సారస్వత పరిషత్తును, స్థాపించిరి. ఇది యొక చారిత్రాత్మకమైన సంఘటన. ఆంధ్రదేశము నందలి ఇతర సారస్వత సంస్థలవలె గాక యీ పరిషత్తు ప్రత్యేక ఆదర్శాలతో ఆశయాలతో నిర్మాణాత్మక కార్యక్రమముతో అవతరించినది. ప్రజాసామాన్యమునందు భాషాప్రచారము గావించు మహోద్దేశముతో పరీక్షల నిర్వహణను సాధనగా తీసికొని యీ పరిషత్తు కృషిని ప్రారంభించినది. వాగ్బంధన శాసనాది నిర్బంధముల వలన యీ పరిషత్తు కృషి ఆదిలో యెక్కువగా జరుగక పోయినప్పటికిని, పోలీసుచర్య ముగిసిన తరువాత ఇది తెలంగాణములో ఒక మహోద్యమముగా వ్యాప్తి జెందెను, వేలకొలది ప్రజలను అక్షరాస్యులుగా జేయుచు భాషాప్రచారము గావించుచున్నది. పరిషత్తు పక్షమున సంవత్సరమునకు రెండు పర్యాయములు జరుగు పరీక్షలలో ఒక్కొక్క పరీక్షయందు ఆరువేల మంది అభ్యర్థులు పాల్గొనుచున్నారని చెప్పినచో, పరిషత్తు పరీక్షలు తెలంగాణ జిల్లాల్లోని రెండువందల కేంద్రాలయందు జరుగుచున్నవని చెప్పినచో, పరిషత్తుకు నేడు రెండువందల శాఖలుకలవని చెప్పినచో, యీ ఉద్యమ స్వరూపము మీరు కొంత ఊహించవచ్చును.

ఈ విధముగా తెలంగాణమున గత దశాబ్దమున ఒక మహోద్యమము ప్రారంభమై వ్యాపించుచున్నది. యువకులు, నూతన రచనలద్వారా తెలుగు సరస్వతిని ఆరాధించుచున్నారు. పెద్దలు విజ్ఞానవాఙ్మయ ప్రకటనకై కృషిజేయుచు యువకులను ప్రోత్సహించు

చున్నారు. ఈ కాలమున వాఙ్మయ సేవకు కటిబద్ధులైన యువకులలో కవులు, కథకులు, వ్యాసకర్తలు, గ్రంథకర్తలు అనేకులు కలరు.

ఈనాటి కవులలో పేరెన్నిక గన్నవారు శ్రీవానమామలై వరదాచార్యులవారు. వీరిది విద్వత్కవి కుటుంబము. తండ్రిగారు గొప్పపండితులు, శాస్త్రవేత్తలు. సోదరులందరు పండితకవులు. శ్రీ వరదాచార్యులవారు తమ కావ్యపఠనముద్వారా ఎన్నివేల మందిగల సభనైనను రంజింపజేయగలరు. మధురమైన వారికవిత్వమునకు శ్రావ్యమైన కంఠము వన్నె పెట్టుచున్నది. వీరి ఖండకావ్యములు మణిమాల, యను గ్రంథరూపమున ప్రకటితములైనవి- పోతన మహాకావ్యమును వీరు ఇటీవలనే రచించియున్నారు. ఈ గ్రంథము ప్రకటితమైనచో, ఆధునికాంధ్ర వాఙ్మయములలో దీనికొక ఉత్కృష్టస్థానము లభించగలదు.

దాశరథికృష్ణమాచార్యులు, యువకవి-కవిత్వములో యీయన పోగిలిగి నన్ని పోకడలు పోగలవారు ఆంధ్రదేశములోనే మిక్కిలి తక్కువయని చెప్పవచ్చును. యువకుడైన యీయనకు ఉజ్వలమైన సారస్వత భవిష్యత్తుకలదు. అభ్యుదయ కవులలోనేకాక పండితకవులలోకూడ దాశరథకి ప్రత్యేకస్థానముకలదు- 'అగ్నిధార, రుద్రవీణ' యను రెండు ఖండకావ్య సంపుటములు యీయన ప్రకటించియున్నారు. బెల్లంకొండ చంద్రమౌళిశాస్త్రి బహుముఖాలుగా లేఖినీ విన్యాసము చేయగలదక్షుడు- కవిత్వము, కథానికరచన, ఏకాంకికారచన మొదలయిన వివిధ వాఙ్మయ వీధులలో యీయన విహరించుచున్నారు. ఈ సందర్భమున చందూరు ప్రాంతమునందలి సాహితీమేఖల వారి కృషి ప్రత్యేకప్రశంసనీయము. ఈ సాహితీమేఖల కవులందరు యువకులు. నిండుజవ్వనమున నున్నవారు. సంస్కృతాంధ్రములలోనేగాక ఆంగ్లభాషలోకూడ మంచిపరిచయముకలిగినవారు. ఈకవులలో శ్రీపులిజాల హనుమంతరావు, ధవళా శ్రీనివాసరావు, సిరప్రగడ భార్గవరావు, ప్రత్యేకముగా సంస్మరణీయులు. గుమ్మపాలల్లోని గోరెచ్చదనము, అరటిపూవులలోని అందంపుసిగ్గు బీరపూవులవోలెవిచ్చుభావాలు, పరుగెత్తు పినలేడి పరువంపుశైలి, వీరి కవితాకాంతకు అత్యంత ప్రియమగు సామగ్రి. శ్రీమతి సోమరాజు ఇందుమతీదేవిని యీ కాలమున కృషిచేసిన కవయిత్రులలో పేర్కొనవలసియున్నది. సుకుమార భావ పుష్పాలను లలితపదసూత్రములో సుందరహారముగా యేరికూర్చుటలో యీమెకు ప్రత్యేకవిన్నాణముగలదు. ప్రేయసినిగూర్చి ప్రియులభావాలను ప్రకటించుకవిత్వము మన ఆంధ్రవాఙ్మయమున సమృద్ధముగా గలదు. కాని ప్రియునిగూర్చి ప్రేయసి భావాలను చిత్రించు కవిత్వములేని కొరతను శ్రీమతి ఇందుమతీదేవి తీర్చినదని చెప్పవచ్చును. శ్రీ కప్పగంతుల లక్ష్మణశాస్త్రి, శ్రీ కేశవపంతుల నరసింహశాస్త్రి, పెరవల్లి లింగయ్యశాస్త్రి విద్వత్కవీశ్వరులు. గడియారము రామకృష్ణశర్మ చరిత్ర పరిశోధకులే గాక చక్కని కవిత్వము వ్రాసిన సారస్వతోపాసకులు.

## ప్రగతి సాహిత్యము

నెల్లుట్ల రామకృష్ణకవి ఓరుగల్లు ప్రాంతీయుడు. మూర్తీభవించిన ఆవేశము యీయన కవిత్వము. ఈయనలో స్వకులాభిమానము హెచ్చు. ఆంధ్రభారతి మాయింటి ఆడుబిడ్డయని యీయన చెప్పుకొనినాడు. ఖండ కావ్యరచనలో యీయన అందెవేసినచేయి. ఈయన కవిత్వమున భావాలు హృదయమునుండి సూటిగా దూసికొని వచ్చుచుండును. 'నీకొదమ కవిత్వము వాఙ్మయ మదవతికి విభూషణంబు మధుర కవీశ' అని యీయినను శ్రీ జాషువగారు ప్రస్తుతించి యున్నారు. ఈయన సూరబాలకావ్యమును సమీక్షించుచు పురాతనాధునాతన కవీశ్వరులకు మధ్యవర్తి యనదగిన సాహిత్యవేత్త యీయనయని 'గోలకొండ పత్రిక' అభిప్రాయబడినది-

ఈకాలమున గేయరచన యిక్కడి యువకులను యెక్కువగా ఆకర్షించినది- ఈ గేయకవులలో దాశరథికి సమున్నతస్థానము గలదు- కాళోజి నారాయణరావు యీ గేయకవులలో అగ్రతాంబూలమునకు అర్హుడు. కాళోజి రాజకీయరంగమున ప్రథమశ్రేణిలో నిలిచి అనేక పర్యాయములు శ్రీకృష్ణ జన్మస్థానము నలంకరించిన దేశభక్తుడు. ఈయన హృదయమునకు సమ్మెట పోటైన ఒక్కొక్క రాజకీయ సంఘటన యీయన కలమునుండి ఒక్కొక గేయముగా వెలువడినది. రసవిహీనములై ఎవరికినిచేపనిరాకుండినచనులగు రాజకీయాలు యీయనకలమునుండి సుధాధారలను ప్రవహింప జేసినవి. నల్లగొండలో చెలరేగిన నాజీశక్తుల నగ్నన్రృత్యమును గూర్చి యీయన వ్రాసిన గేయము తెలంగాణ జిల్లాలోని ప్రజాసామాన్యమును ఆకర్షించి, పొలాలలో పనిచేయు కార్మికుల రసనాగ్రములమీద తాండవించినది. ఈయన కవితలో ఒక ప్రత్యేకమైన ఉక్తివైచిత్రిము, భావోద్రేకము ప్రస్ఫుటముగా గోచ

తమగుచుండును. "యుద్ధము మూలమున చెలామణులకు ఉబ్బులరోగము వచ్చినది." ఇట్టివి ఉక్తివైచిత్రిమునకు నిదర్శనము. కాళోజి సహజకవి; ప్రజాకవి అంతేకాదు ఈయన కథకుడు గూడ. లంకాపునరుద్ధరణ అను యీయనకథ వ్యంగ్యవిమర్శద్వారా సమకాలిక పరిపాలనా విధానమును బాగుగా తూర్పారబట్టినది. ఈ గేయకవులలో వెల్దుర్తి మాణిక్యరావుకొక ప్రత్యేక స్థానముగలదు. ఈయన బాలవాఙ్మయ నిర్మాణమందు గూడ దక్షుడు. వెల్దుర్తి, కాళోజి కవులలో అనేకమైన పోలికలుగలవు. పొట్లపల్లిరామారావు యీ యుగమునందలి కవులలోను, కథకులలోను విశిష్టస్థానము నాక్రమించుచున్న వ్యక్తి. ఈయన కథలు, గేయాలు, అనేక పత్రికలలో ప్రకటితమైనవి. ఈయన రచనలందు హృదయావేదన ఉద్రేకము ప్రముఖముగా గన్పట్టుచుండును. ఈయన వ్రాసిన సైనికుని జాబులు మన వాఙ్మయములో ఒక క్రొత్తరకమైన రచన. ఆధునిక లేఖావాఙ్మయమునకు మేలిఅలంకారము. ఈ నాటికవులలో శ్రీ పల్లాదుర్గయ్య, శ్రీ ఓటుకూరి రంగారావు, శ్రీ చిల్లర భావనారాయణరావు శ్రీ భాగి నారాయణ మూర్తి, శ్రీ బి. రామరాజు, శ్రీ భూపాలరావు, శ్రీ రాఘవాచార్యులు, శ్రీ పి. వి. నరసింహారావు, శ్రీమతి పర్వా జానకీదేవి, శ్రీ అడ్లూరి అయోధ్యరామకవి, శ్రీ గార్లపాటి రాఘవరెడ్డి, శ్రీ పాములపర్తి సదాశివ రావు, శ్రీ రామగోపాల రావు, నెల్లుట్ల వేంకటేశ్వరరావు, దేవులపల్లి వేంకటేశ్వరరావు, మూటుకూరి వేంకటేశ్వరరావు, గవ్వా మురహరిరెడ్డి మొదలైనవారు ప్రత్యేకముగా ప్రశంసనీయులు.

## చిన్న కథలు

ఈ కాలమున యువకులనేకులు కథానికను ఉపాసించిరి. వారిలో శ్రీ భాస్కరభట్ల కృష్ణారావు అనేక కథలను వ్రాసి యావదాంధ్ర ప్రఖ్యాతిని పొందిన యువకుడు. ఈయన వ్రాసిన కథలు కొన్ని వందలకు పైగా నుండును. కమ్మని వ్యవహారిక భాషలో కథానికను ఒక కళాఖండముగ దిద్ది తీర్చు నేర్పు యీయన కలమునకు గలదు. శ్రీ పొట్లపల్లి రామారావు కథలు, సామాన్యజనుల జీవితము నందలి ఒడుదుడుకులను నిమ్నోన్నతములను, సమాజమందలి అన్యాయములను చిత్రించుచు సాంఘికాభ్యుదయమును ప్రబోధించుచున్నవి- పొట్లపల్లి, భాస్కరభట్లలు, తెలంగాణ కథానిక సాహిత్య గగనమున దేదీప్యముగా వెలుగుచున్న తారలు. ధరణికోట శ్రీనివాసులు సాంసారికసంఘటనలు, రమ్యముగా చిత్రించు నేర్పు గల కథకుడు- ఈయనకు శ్రీ మునిమాణిక్యము భావనాగురువని చెప్పవచ్చును. బూర్గుల రంగనాథరావు సుప్రసిద్ధ కవి; కథకుడు- సారస్వతోపాసకుడు. ఈయన కథలు వాహ్యాళి అను సంపుటరూపమున వెలువడినవి- మధ్యతరగతి కుటుంబాలలో దైనందిన సంఘటనలను తెలంగాణ వ్యావహారిక భాషలో మనోహరముగ తన కథలయందు యీయన చిత్రించినాడు - భాగి నారాయణ మూర్తి గేయ కవియేగాక మంచి కథకుడుగూడ. సుప్రసిద్ధకథకులైన నందగిరి వెంకటరావుగారి ధర్మపత్ని శ్రీమతి నందగిరి ఇందిరాదేవి తమ రచనలద్వారా సకలాంధ్ర కథకులలో ఒక ఉన్నత స్థానము నాక్రమించుచున్నది. కొంచెము ఆలస్యముగా సారస్వత జీవనము ప్రారంభించినప్పటికిని ఉత్తమ కథకులలో చేరదగిన సోదరీమణి శ్రీమతి ఇల్లిందల సరస్వతీదేవి. ఈ మధ్యనే యీమెను కథలు పండుగ బహుమానమను పేరుతో ప్రకటింప బడినవి. తెలంగాణ కథకులలో శ్రీమతి భారతీ రత్నాకరాంబ, నెల్లూరి కేశవస్వామి, ఇటికాల నీలకంఠరావు, వెల్దుర్తిమాణిక్యరావు, తా - రా - స్వామి, మానేపల్లి తాతాచారి మొదలైన వారిని యిక్కడ పేర్కొనవలసియున్నది.

## వ్యాసములు

ఈ కాలమున వ్యాసరచనకు యెక్కువ ప్రాముఖ్యత కలదు. ఏ విషయమును గూర్చియైనను చక్కగా అరటి పండొలచి చేతికిచ్చినట్లు వివరించి చెప్పగల విద్యార్థులైన వ్యాసకర్తలు అనేకులు ముందుకువచ్చినారు. వీరిలో గోలకొండ సంపాదకులు శ్రీ నరోత్తమరెడ్డి, ప్రగతి సంపాదకులు చంద్రమౌళీశ్వరరావు, పులిజాల హనుమంతరావు, కేశవపంతుల నరసింహశాస్త్రి, రాపోలు లలితాదేవి, యిల్లాప్రగడ సీతాకుమారి, నందగిరి ఇందిరాదేవి, కోదాటి సోదరులు. బి. వి రమణారావు, డి. వి. జి. కృష్ణమూర్తి, గబ్బూరి రామచంద్రరావు, గొట్టుముక్కల కృష్ణమూర్తి మొదలైనవారు ముఖ్యులు.

ఉన్నతోద్యోగమునుండి ప్రభుత్వ కార్యనిర్వాహణలో తీరికలేక పోయినప్పటికి తెలుగుతల్లి కొలువును మరువనివారు శ్రీ పర్వా వేంకటేశ్వరరావుగారు. వీరు ప్రస్తుతము ఆంధ్రసారస్వతపరిషత్తు అధ్యక్షులు. యువకులు, బి. యే. యల్. యల్. బి. పట్టభద్రులు.

అనేక సారస్వత సంస్థలకు సహాయమొనర్చిన ఉదారులు; రసికులు; స్వయముగా సారస్వతోపాసకులు, నేటి తెలుగు వ్యాసరచయితలలో వీరికొక ప్రత్యేక విశిష్టస్థానముకలదు. ఇటీవల వీరు 'మనరాజ్యాంగము' అను పుస్తకమును వ్రాసినారు.

## వివిధ కళలు

నాట్యకళ, చిత్రకళ, మొదలైన రంగాలలోకూడ యీ కాలమున విశేషకృషి జరిగినది. హైదరాబాదులోని నాట్యకళాపరిషత్తు, ఓరుగల్లులోని కాకతీయ కళాసమితి, ఖమ్మం, సూర్యాపేట పట్టణాలలోని కళాసమితులు తమ ప్రదర్శనాలద్వారా కళోపాసన గావించినవి. ఈ కాలమున చిత్రకళయందు ప్రత్యేక నైపుణ్యము ప్రదర్శించిన వారిలో శ్రీమతి సంగం లక్ష్మీబాయమ్మను పేర్కొనవలసియున్నది. ఈ యమ చిత్రకారిణియేగాక మంచికథలను వ్రాయ నేర్పరి గూడ. సాహిత్యమును, చిత్రకళనువిడిచి రాజకీయాలలో యీమె ప్రవేశించుట దురదృష్టము.

కొండపల్లి శేషగిరిరావు యీనాటి చిత్రకారులలో అగ్రగణ్యుడు. గోపాలరాజుభట్టు, వినయకుమారు వంటి యువకులు, చిత్రకళను, నాట్యకళను ఉపాసించుచు వ్యంగచిత్ర రచనలో నిపుణులుగా ప్రసిద్ధిగాంచినారు. గడియారం రామకృష్ణశర్మ, కె. వి. భూపాల్‌రావు, వీరభద్రయ్య ప్రభృతులగు యువకులు, చరిత్ర పరిశోధనకు తమ అమూల్యమగు కాలమును వినియోగించుచు కాలగర్భమున దాగియున్న అనేక నూతనాంశములను వెల్లడి చేయుచున్నారు.

## రాష్ట్రేతర కవిపండితుల సేవ

తెలంగాణమువారు గాకపోయినప్పటికిని ఇక్కడనే స్థిరనివాసము కల్పించుకొని సాహిత్యసేవజేసిన విద్వాంసులను కవులను కొందరిని యిచ్చట ప్రశంసించవలసియున్నది. సుప్రసిద్ధకవులగు శ్రీ రాయప్రోలు సుబ్బారావుగారు తన సారస్వత కృషిని హైదరాబాదునుండి జరిపినారు. ఆచార్య శ్రీ కురుగంటి సీతారామయ్యగారి అనేక గ్రంథములు హైదరాబాద నుండియే ప్రకటితములైనవి. శ్రీ సన్నిధానము సూర్యనారాయణ శాస్త్రిలవారి సారస్వత కృషి యంతయు హైదరాబాదు నందే జరిగినది. నరస భూపాలీయ వివరణము, తత్సముచంద్రిక అనే ఖండ కావ్యములు, వచనరచనలను, శ్రీ సన్నిధానమువారు యిక్కడనుండియే ప్రకటించిరి. శ్రీ బిదురు శేషయ్యగారు హైదరాబాదలో అనేక సారస్వత సంస్థలకు కార్యదర్శిగా ప్రశంసనీయమగు సేవజేసిరి. శ్రీ చలమచర్ల రంగాచార్యులవారి సారస్వతకృషికి తెలంగాణమే కేంద్రమైనది. వారి ప్రతాపరుద్రీయ అనువాదము, పోతన నాటకము హైదరాబాద నుండియే ప్రకటితములైనవి. శ్రీ ఖండవల్లి లక్ష్మీరంజనము, బాలేందు శేఖరము సోదరులు, తెలంగాణ దేశీయులలో లీనమై బహుగ్రంథములను వ్రాసి ఆంధ్రభాషా దేవిని ఆరాధించుచున్నారు. కీర్తిశేషులైన అచ్యుతుని వెంకటా చలపతిరావుగారి అంపశయ్య మొదలైన నాటకాలు యిక్కడినుండియే వెలువడినవి.

పండితులు, కవులు, విమర్శకులు, కథకులు అయిన శ్రీ అంబటిపూడి వెంకటరత్నముగారు తెలంగాణమునకు పెంపుడు కొడుకు. ఆయన చందూరు ప్రాంతములో చేసిన సారస్వత సేవ ప్రశంసనీయమైనది. అనేక యువకులను సాహిత్య రంగమునకు తీసికొని వచ్చి వారిని కవులనుగాజేసిన గౌరవము శ్రీ అంబటిపూడి వారికి చెందుచున్నది. శేషాద్రి రమణ కవులలో ఒకడైన శ్రీ దూపాటి వేంకటరమణాచార్యులు వారు తమ సాహిత్య జీవనమును పూర్తిగా తెలంగాణమునకే అంకితము గావించిరి. జిల్లాలలో తాళపత్రగ్రంథములను శాసనాలను అన్వేషించి, పరిశోధించి, బహు ప్రయాసకు గురియై తెలంగాణమునకు వీరు ప్రశంసనీయమైన సేవజేసినారు.

ఈ కాలమున సాహిత్యకృషి విరివిగా జరిగినది. ఆంధ్ర సారస్వత పరిషత్తు తెలుగుతల్లి సందేశమును పల్లెపల్లెలకు వాడవాడలకు తీసుకొని పోవుచున్నది. ఈ దశాబ్దమున 'గోలకొండ' దినపత్రిక యైనది. శోభ ఓరుగల్లునుండి వెలువడి యువరచయితల రచనలకు స్వాగతమిచ్చినది- తెలంగాణ ప్రజాపోరాటమున విజయవాడనుండి వెలువడిన సారథి పోలీసు చర్య తరువాత కూడ కొంతకాలము హైదరాబాదనుండి వెలువడి సారస్వతోద్యమమునకు మంచి చేయూతనిచ్చినది. పోలీసుచర్య తరువాత కాకతీయ, ప్రగతి, భాగ్యనగర్, జనశక్తి మొదలైన పత్రికలు యువకుల సంపాదకత్వమున వెలువడుచు సాహిత్యోద్యాన వనమున క్రొత్తపాదులను నిర్మించుచున్నవి. పండితులు, పరిశోధకులు, కవులునగు, గడియారము రామకృష్ణ శర్మగారు సుజాతను పునరుద్ధరించి ప్రశంసనీయముగా భాషాసేవ జేయుచున్నారు.

## అన్యభాషాసేవ

తెలంగాణములో ఉరూ పత్రికల ద్వారా ప్రజల జాతీయాశయములను నిర్భయముగా ప్రకటించి దేశసేవ జేసినవారిని ఈ సందర్భములో స్మరించవలసి యున్నది. శ్రీ మందుముల నరసింగ రావుగారు సుప్రసిద్ధులైన ఆంధ్రనాయకులు. వీరు పేరెన్నికగన్న ఉర్దూరచయితలు రయ్యేరు, దిన వారపత్రిక సంపాదకులుగా వీరు నిర్భయ విమర్శలను జేసి ప్రజల వాంఛితాలను ప్రభుత్వము యెదుట నుంచిన ప్రఖ్యాత రచయితలు. బహుగ్రంథావలోకనము జేసిన రాజకీయ అర్థశాస్త్ర పండితులు. వాడి, వేడి యీ రెండు వీరి కలమునకు సహజగుణములు. అన్ని రంగాలలో మార్గదర్శకులైన శ్రీ మాడపాటి హనుమంత రావుగారు యీ రంగములోకూడ మార్గదర్శకులు. ఉర్దూభాషలో వీరు మంచి రచయితలు. ముషీరు దినపత్రికలో వీరికి గల సంబంధము హైదరాబాదీయు లందరికిని తెలిసినదే.

హైదరాబాదనుండి వెలువడుచున్న ఇంగ్లీషుపత్రికలగు 'హైదరాబాదబులెటిన్,' 'దక్కన్ క్రానికల్' న్యూయీరా, డైలీన్యూస్, సెంటినల్, స్ట్రిగుల్, పత్రికల నిర్వహణా సంపాదకత్వములలో ఆంధ్రులకు ప్రముఖస్థానముకలదు. దక్కన్ క్రానికల్‌కు చాలాకాలము సంపాదకులుగానుండి డెయిలీన్యూస్ పత్రికను స్థాపించి తన మరణమువరకు దానికి సంపాదకులుగా నుండిన తెలంగాణా పత్రికా సంపాదకులు శ్రీబుక్కపట్టణము రామానుజాచార్యులవారు, ఆంగ్లభాషలో ప్రత్యేకమగు శైలినికలిగిన మంచిరచయితలు.

ఈ విధముగ తెలంగాణమున అర్ధశతాబ్దమునుండియు ప్రాచీన, నవీన కావ్యపద్ధతులలో రచనలు సాగినవి. చిన్నకథలు, నాటకములు, వ్యాసములు, విమర్శలు, పరిశోధనములు వృద్ధినొందినవి. పత్రికలు, గ్రంథమాలలు, సారస్వతసంస్థలు ప్రారంభింపబడి మహోన్నత సారస్వతోద్యమమును నిర్వహించుచున్నవి. ఆలస్యముగ ప్రబుద్ధమైనను తెలంగాణము చక్కని చిక్కనినడకతో నిర్మాణాత్మకదృష్టితో ముందుకు సాగుచు సాటిసోదరులచే గౌరవింపబడు ఉత్తమస్థాయి నందుకొనుచున్నది.



# తెలంగాణము - ప్రాచీన శిల్పకళ

శ్రీ పుట్టపర్తి శ్రీనివాసాచార్యులు (M.A.P.H.D.)

ప్రాచీనాంధ్ర శిల్పమునుగూర్చి ఇప్పటికి కొన్ని శతాబ్దులుగ పరిశోధన జరుగుచునే యున్నది. కాని తెలంగాణమునకు యీ సందర్భమున ఎట్టి స్థానము నొసగవలెనో సునిశ్చితము కాలేదు. తెలంగాణము నందలి శిల్పమును సరిగ పరిశీలించిననే కాని ఈ విషయము తేలదు. ఆపని ఇంకను సమగ్రముగ జరుగనే లేదు.

'శిలాయుగ' మని పేరుగాంచిన చరిత్ర కందరాని చాలా ప్రాచీన కాలమునుండియు గూడ తెలంగాణము నందు శిల్పమును, చిత్రకళయు గాన్పించుచున్నవి. శిలాయుగమునాటి నాగరికత, సంస్కృతి ఎక్కువగ తెలంగాణము నందును దక్కను నందలి కొన్ని ఇతర ప్రాంతములందును మాత్రమే గాన్పించుచున్నవి. కాబట్టి మానవుని సృష్టికిని, నాగరికతా ప్రథమ పాఠములకును ప్రథమరంగభూమి యీ ప్రాంతమే అని నిర్ణయించుటకు కూడ తగినంత ఆధారము లేకపోలేదు.

లోహములను, వాని ఉపయోగమును ఎరుగని నాడు మానవుడు రాళ్ళతోనే తన పనిముట్లను ఇతర సామగ్రిని తయారు చేసుకొనుచుండెను. అందువలననే ఆకాలమునకు శిలాయుగమని పేరువచ్చినది. కాని రాతిముక్కలను తయారు చేయుటలోనే తమ చాకచక్యమును జూపి అందముగ వానినితీర్చి యుండుట వలన నేటికిని మనకు అవి ఆశ్చర్యము గొలుపక మానవు. పరిశోధించునపుడు శిలాయుగపు నాగరికతా చిహ్నములే ఈ కళకు పునాదిరాళ్ళని తలపవచ్చును.

చరిత్ర కందరాని శిలాయుగపు మానవుని వస్తు నిర్మాణ కౌశలమునకును చారిత్రిక ప్రథమాధ్యాయ మనదగు బౌద్ధయుగము నందు మనకు తెలియవచ్చు నాగరికతకును ఎంతయో తారతమ్యము కలదు. బౌద్ధయుగము నాటి నాగరికత ఉత్తమతరగతికి చెందినదని యనుటకు ఎట్టి సందియమును లేదు. ఇట్టి ఉత్తమస్థితికి వచ్చుటకు మానవుడు ఎన్ని తప్పటడుగులు వేసి ఎన్ని నాగరికతా సోపానముల నెక్కి శ్రమపడి సాధించెనో తెలియరాదు. భావి పరిశోధన వలనగాని ఈ మధ్య నున్న ఘట్టములను గుర్తించుటయు, క్రమపరిణామ వికాసమున శిలాయుగ నాగరికతయే బౌద్ధనాగరికతగ విన్యాసము చెందినదని విశదీకరించుటయు సాధ్యము కానిపని.

తెలంగాణమున కనతి దూరమున రాయచూరుజిల్లా కొప్పల్ గ్రామము నందును, లింగసుగూరు తాలూకా మస్కీ యందును అశోక శాసనములు గన్పించుచున్నందున ఈ ప్రాంతమంతయు అశోక చక్రవర్తి పరిపాలన క్రింద నుండెనని చెప్పవీలున్నది. కాని మౌర్యుల నాటివని నిష్కర్షగ చెప్పవీలుగల కట్టడములు కాని, శిల్పము కాని ఇతర విశేషములు కాని ఇంత వరకును తెలంగాణము నందు బయట పడలేదు.

ఇప్పటికి మనకు తెలిసినంతవరకు ప్రాచీనతము చారిత్రిక సామగ్రి యనదగు వస్తు విశేషములు క్రీ. పూ. రెండవ శతాబ్ది నాటివి. నాడు ఈ ప్రాంతము శాతవాహనుల పరిపాలన క్రింద నుండెను. వీరు సుమారు నాలుగు వందల యేబది సంవత్సరములు అఖండముగ పాలనము సాగించినందున అజంతా యందలి ప్రాచీనతము కాలమునాటి 9, 10, 12, 13. సంఖ్యలు గల గుహాలయములును, పిథల్ ఖోరా గుహాలయములును, మస్కీ, కొండాపూరు, గాజులబండ, పణిగిరి, పెద బంకూరు మొదలగు చోటులందు ఖననపరిశోధన యందు బయలు వెడలిన కుండపెంకులు, మట్టిబొమ్మలు, ఇతర వస్తువులును; అచ్చటచ్చట దొరకిన సీసపు నాణెములును ఇతర ప్రాచీనతమ నాణెములును- ఇవన్నియు ఆంధ్ర శాతవాహన యుగమునకు చెందినవే అనవచ్చును.

ఈ ప్రాచీనాధారముల పరిశీలించి గుహాలయ నిర్మాణ వాస్తుపద్ధతిని గూర్చియు, బౌద్ధస్థూప విహా

తెలంగానా శిల్పములు



పానుగల్లు కుడ్య శిల్పములు

రాది నిర్మాణ వాస్తుపద్ధతిని గూర్చియు యెన్నియో అంశములను విశదీకరింప వచ్చును. గ్రంథ విస్తర భీతిచే ఒక్క శిల్పమును గూర్చి మాత్రము కొంత ఇట పరిశీలింతము. ఇందును కూడ ఒక్క తెలంగాణమును మాత్రమే ప్రకృతము ఏకైక లక్ష్యముగ గ్రహించి నందున ఆంధ్ర శాతవాహనుల నాటి అజంతా గుహలను, అందలి శిల్పమును ఇట పరిశీలించుటకు వీలు లేదు. సమకాలికములైన అమరావతి మున్నగు ఆంధ్ర ప్రాంతములందలి వాస్తుశిల్ప వైఖరికిని, అజంటా, పిథల్ ఖోరా వైఖరికిని కల సంబంధములను, తారతమ్యములను చర్చించుటకు గాని, తెలంగాణ వాస్తు శిల్ప పద్ధతులు ఏరీతిగ వీనితో సన్నిహిత సంబంధము కలవో ఏ కారణములను బట్టి అజంతా, తెలంగాణ, అమరావతి ఇవన్నియు ఒకటేకళా సంప్రదాయమునకు చెందినవని ధృవపరుపగలమో విశదీకరించుటకును వీలులేదు. వివిధ ప్రాంతములందు నానావిధ పరిసర ప్రభావములకు లోనైనందున దేశకాలానుగుణముగ కొద్దిపాటు మార్పులు ఈ వివిధ ప్రాంతములందలి వాస్తుపద్ధతులందు గాన్పించినను ఇవన్నియు స్థూల దృష్టికి గోచరించు స్వల్పభేదములే కాని, సూక్ష్మముగ పరిశీలించిన యెడల వీనియన్నిటి యందును అంతర్వాహినిగ గాన్పించు అభిన్న లక్ష్యము, దృక్పథము, నిర్మాణవైఖరి మొదలగు అంశములన్నియు. ఇవి ఒకటే వాస్తు సంప్రదాయమునకును శిల్పసాంప్రదాయమునకును చెందినవని చాటి చెప్పునవని ఋజువు పరచుటకు గూడ ఇచ్చట అవకాశము చాలదు.

దిఙ్మాత్రముగ సూచించుటకు ఇట ఆంధ్రశాతవాహన యుగమునాటివని చెప్పదగు మట్టి బొమ్మలను మాత్రము కొంత పరిశీలింతము. ఇవి చాలవరకును మస్కి, కొండాపూరు మొదలగు ప్రదేశములందు ఖననపరిశోధనయందు బయటపడిన వస్తువులగుటవలన ప్రాచీన కాలమునాటివేయని తలపవచ్చును. వీనితో పాటు దొరకిన సీసపు నాణెములు, కుండ పెంకులు మొదలగు సామగ్రినిబట్టి ఇవి ఆంధ్రశాతవాహన యుగమునాటివని కూడ నిశ్చయింప వచ్చును.

మట్టి బొమ్మలలో కూడ మానవాకృతి యెంతస్పష్టముగ నిర్మింపబడెనో కొండాపూరునందు దొరకిన ఐదారు మట్టి బొమ్మలను చూచినచో విశదమగును. వీనిలో కొన్ని కొన్ని బోధిసత్త్వుని మట్టి విగ్రహములని చెప్పుచున్నారు. బుద్ధవిగ్రహమునకు తలపై వెంట్రుకలు కురుచగ ఉంగరములవలె చుట్టలు చుట్టలుగ నుండుట శిల్పసాంప్రదాయము. ఈ బొమ్మల యందు కూడ వెంట్రుకలు ఈ రీతిగనే ఉన్నందున ఇవి బోధిసత్త్వుని ప్రతిమలని చెప్పవచ్చునేమో. దేవతా ప్రతిమలని ఒప్పుకొనినను రూపురేఖలనుబట్టి శిల్పి నాటిజనసామాన్యపు వైఖరిని యథాతథముగ చిత్రించినట్లు గన్పడుచున్నది. దక్షిణాపథమునందును, దక్షిణదేశమునందును, నేటికిని గానవగు మానవరూపురేఖలకును, ఆర్యజాతి రూపురేఖలకును ఉన్న తేడా శిల్పమునందు కూడ అనాదిగ గన్పడుచున్నది. బుద్ధ బోధి సత్త్వులను చిత్రించునపుడు ఆర్యజన రూపురేఖలను చిత్రించుటకు బదులు దాక్షిణాత్యులకు సహజమైన కోలమొగము, లావుపాటి పెదవులు, చప్పిడిముక్కు మొదలగు శిల్ప విశేషములను చూపినందున దక్షిణ శిల్ప సాంప్రదాయము ఆనాటికే అనల్పవృద్ధిగాంచి ఒక ప్రత్యేకతను సంపాదించుకొని పామరదశకు సహజమగు అనుకరణాది లోపములను వదలివైచి స్వతస్సిద్ధమగు సమగ్రప్రభతో విరాజిల్లుచుండెననుట స్పష్టము.

మనోభావములను వ్యక్తము చేయుటలో శిల్పి ఇందు చూపిన సామర్థ్యము ప్రశంసనీయము. చిత్తవృద్ధి నిరోధమే పరమ లక్ష్యముగ పరిగణించిన ప్రశాంత భావమును, అంత దృష్టియు కల ఈ మూర్తులు తప్పక బోధిసత్త్వుని మూర్తులే యని చాటి చెప్పుచున్నవి. ఫాలభాగమున రాణించు లలాటపట్టము, పెద్దపెద్ద కుండలములు, ఉష్ణీషము వలె శిరము నధిష్ఠించిన వెంట్రుకల కొప్పు, మెడపైన వ్రేలియున్న జడలు మొదలగు అంశములన్నియు శిల్పికి అలంకారములపై నెట్టి మక్కువ కలదో ఋజువు పరచుచున్నవి. వెంట్రుకలను యెన్ని రకములుగ కొప్పులు గట్టి జడలల్లి ఆ నాడు అలంకరించు కొనుచుండిరో ఈ మట్టిబొమ్మలను చూచిన యెడల తెలియగలదు. ఏ రెంటి యందును ఒక పద్ధతి కానరాదు. కాని దేనికి అదే అందముగ కనిపించుచున్నది.

నాటి శిల్పులు అలంకార ప్రియులు అనుటకు మనకు దొరికిన వందలకొలది ఆభరణములే తార్కాణము. బంగారము తోను, రాగితోను చేసిన ఆభరణములే కాక దంతము తోను, గవ్వలతోను చేసిన ఆభరణములు కూడ చాల దొరకినవి. మట్టితో చేసిన పూసలు, హారములు, కంకణములు, వలయములు అసంఖ్యాకముగ దొరికినవి. అందచందములలో ఇవి బంగారు ఆభరణములకు గాని, దంతపు ఆభరణము

ఉ॥ కత్తికి మొక్కువేళ, వరఖడ్గముఁ దాల్చినవేళఁ జాప సం
ధత్తములైన బాణముల నాటెడివేళల రుద్రమాంబ రా
హుత్తులఁ బత్తులన్ బదములూనఁగ నీయక తెల్గుకేతనం
బెత్తిన యోరుగంటి మొదలింటి దశన్ స్మరియింపు మాంధ్రుఁడా! 6

చం॥ గణపతిదేవు మించు రిపు ఘస్మరుఁడైన ప్రతాపరుద్రు దా
రుణ మృతి తెల్గువారల కరుం తుదమౌతటి రాచకొండ భీ
షణ రణదుందుభుల్ మొరసె; జాతి సముద్ధరణైకదీక్షఁ గం
కణమును గట్టి యెల్ల తెలఁగాణము నేలిరి పద్మనాయకుల్. 7

శా॥ రేచర్లాన్వయ పద్మనాయకుల దోర్లీలా విశేషంబు తాఁ
బ్రాచిన్ రెడ్డినరేంద్ర లక్ష్మికినిఁ బంపాతీర సౌధావలీ
రోచిః పుంజము హాంపికిన్, బహమనీ రోచిష్ణుయుద్ధానలో
త్కోచ స్పర్శముఁ బాపి రాచసిరి నక్కుం జేర్చె నొక్కుమ్మడిన్. 8

సీ॥ అనుమకొండకు దొరయైనఁ గాళింగులఁ బొలయించెఁ గాకతి ప్రోలరాజు,
ఇంతియై దేవగిరీశు యాదవరాజు క్రూరత్వ మణఁగించె రుద్రమాంబ,
తుగ్లుక్కుసేనలఁ దోలె నోర్గలునుండి పాపికొండలు దాటి కాపనేఁడు,
రాచకొండను తెల్గురమకుఁ బట్టముగట్టి మురిసె రేచర్లానపోతనేఁడు,

గీ॥ అణువు మహదాకృతినిఁ దాల్చు; కుణుఁగు రేచి జటిల దావాన లచ్ఛటల్ సంతరించు
నబలయే శత్రువర్గంబు నణఁచుఁ దెల్గువాణి సిరిఁగల్గు మా తెలంగాణసీమ. 9

సీ॥ వేదపురాణోక్తి విపుల శైవాగమ మన సోమనాథ భాష్యమురచించె,
జాను తెనుంగు ముచ్చటఁగొల్పు ద్విపదల బసవపురాణంబు ప్రస్తరించె,
ప్రౌఢమై శివభక్త వర్ణనల్ గల కృతిన్ బండితారాధ్యునిఁ బ్రస్తుతించె,
ద్రవిడ కన్నడ మహారాష్ట్ర సంస్కృత వచోద్గమ వృషాధిప శతకంబు వ్రాసె,

గీ॥ మరియు రగడలు, గద్యలు, మహితసూక్తు, లష్టకములాది బహుళకావ్యముల నొడివె
నోరుగలుచెంతఁ బాల్కుర్తినుండి, సకల సుకవిజన గేయుఁడై చన్నసోమసుకవి. 10

గీ॥ "తత్వ విద్యాకలాప కవిత్వసార" "జైనమస్తక విన్యస్త శాతశూల
కలితబిజ్జల తలగుండు గండ" బిరుద శోభితుఁడు సుమ్మపాల్కుర్కి సోమసుకవి. 11

లకు గాని ఎంతమాత్రమును తీసిపోవునవి కావు. ఇక రత్నములలో కార్నలియన్, ఆమెథిస్, ఓనిక్సు, జేడ్, స్ఫటికము, లాపిస్, లజూలీ మొదలగు రత్నములును (నానా రూపములుగ తీర్చిదిద్దినవి) దొరకినవి. [ ముఖ్యముగ బాకువలె తీర్చిన అందమైన రత్నమును చూడనగును. ] కుండలములును, ఉంగరములును ఎక్కువగ రాగితో చేసినట్లుగ గన్పించుచున్నవి. దంతపు కంకణముల పైనను, వలయముల పైనను చిత్రవిచిత్రములుగ రేఖలు గీచియుండినందున ఈ రేఖల సొబగు శిల్పకౌశల్యమును చాటి చెప్పుచున్నది.

రెండుమూడు బొమ్మలలో కాననగు మందహాసము మానవాతీతమగు ఆనందపారవశ్యకతను జూపుచున్నది. యోగసమాధియందుండినట్లు చూపు బొమ్మలుకూడ కొన్ని దొరకినవి. భౌతికదేహమును సర్వాంగసౌష్ఠవముగ మట్టిలో తీర్చిదిద్ది తయారుచేయుటయే కాక మానవసహజమగు హావభావ విలాసములను రూపురేఖలనుండి వెలిబుచ్చుటయును, దుర్గమపథకములను దాటి నిర్వాణాద్యతీతావస్థను సాధించినస్థితప్రజ్ఞను, సాధన సమగ్రతను, ఆధ్యాత్మిక సంపత్తినికూడ వ్యక్తపరచుటకును శిల్పికి సాధ్యమాయెననుట స్పష్టము.

కేవల మొక్క ఆధ్యాత్మికదృష్టియందే మునిగి ఆనాటి శిల్పి సామాన్య మానవచిత్తవృత్తులను, శృంగారాది నవరసములను వదలివేయలేదు. హాస్యరసమునుజూపుట శిల్పికి దుష్కరము కాజాలదు. కాని బోధిసత్వుని ఉదాత్తలక్షణములను మూర్తింపచేసిన శిల్పియే నవ్వుపుట్టించు మట్టిబొమ్మలనుకూడ తయారుచేయకల్గుట విశేషమే. పొడుగాటి వెంట్రుకలు వ్రేలాడుచు గిరజాలవలె చివర ఉంగరములుగ తిరిగి నవ్వు లొలికించు కొన్ని మట్టిబొమ్మలు సామాన్యశిల్పి నిర్మితము లనజాలము. కుబేరుడు, హారతి యని కొందరు గుర్తించిన మట్టిబొమ్మలుకూడ ఈ తెగకు చెందినవే.

ప్రాచీన శాతవాహన శిల్పమును సమగ్రముగ చర్చించి, తరువాతి కాలమునాటి శిల్పమునకు ఈశిల్పము ఏరీతిగ పునాదివంటిదో విపులముగ చర్చించుటకు యీ వ్యాసమున సాధ్యము కాదు. శాతవాహన యుగమునకు పిదప మధ్యయుగమునాటి శిల్పమువరకును మనకు తగినంతసామగ్రి దొరకనందున శిల్పచరిత్ర సమగ్రముగ నిర్ణయించుటకు వీలులేదు. కాని సూక్ష్మముగ పరిశీలించినచో ప్రాచీనయుగము నాటి శిల్పవైఖరియే మధ్యయుగమునాటి శిల్పవైఖరిగ పరిణమించినదని నిస్సందేహముగ చెప్పవచ్చును.

మధ్యయుగమునందలి శిల్పముచాలవరకు హైందవ శిల్పమే. బౌద్ధము, జైనముకూడ అచ్చటచ్చట విలసిల్లినట్లు చరిత్రకాధారములున్నను హైందవమతము పునరుజ్జీవనము నొందినందున బౌద్ధ, జైనములకు ప్రజాదరణ తగ్గి జీర్ణదశయందుండెను.

హైందవమతము పునర్విజృంభణము నొందిన ప్రారంభదశలో శిల్పమునందు ఉద్వేగతయు, విప్లవతయు. కొంచె మధికముగ గాన్పించుచున్నది. ఎల్లోరా గుహల యందలి శిల్పమునందు ఈ అంశము సుబోధమగుచున్నది. క్రీ. శ. 8, 9 శతాబ్దుల నాటి ఎల్లోరా యందలి హైందవ శిల్పము బౌద్ధ, జైన శిల్పములతో స్పర్థవహించి విజిగీషువునకుండు సహజ బౌద్ధత్యమును, ఉద్వేగతయును, ఒకవిధమగు ధిక్కారపూరిత విప్లవభావమును వెలిబుచ్చుచున్నట్లు గాన్పించుచున్నవి. కాని క్రీ. శ. 10-13 శతాబ్దులనాటి శిల్పమున ఈ చిత్తక్షోభ నశించి, రాగద్వేషములు శమించి, అఖండ విజయము నొందిన విజేత యందు గాన్పించు గాంభీర్యత, సంపూర్ణతమాత్రము గాన్పించుచున్నది.

ఉత్తమదశ నొందిన కళాస్వరూపము సంపూర్ణత్వమును శాశ్వతస్థాయిగ జేసికొనజాలక కాలక్రమమున పతనమొంది, గతానుగతికముగ వచ్చు నిర్జీవానుకరణములతోను, శిల్ప సమయములతోను నిండి పేలవముగ మారిపోవును. కాని మధ్యయుగము నాటి శిల్పమును ముఖ్యముగ కాకతీయ శిల్పము- ఇట్టిది కాదు. చైతన్య శక్తియు, ఉత్తమ శిల్పలక్షణమగు ప్రగతియు ఈ శిల్పమున క్రీ. శ. పదవ శతాబ్దమునుండి సుమారు మూడు నాలుగు శతాబ్దుల కాలము కన్పించుచునే యున్నది.

సౌందర్య పిపాసియగు మధ్యయుగ శిల్పికి సౌష్ఠవావయవ నిర్మాణమును, లయానుసారి యగు అంగవిన్యాస వైఖరియు మాత్రమే సంతృప్తి నొసగజాలక పోయెను. అతని దృష్టి కేవలము సుందరాంగముల సంకుచిత ప్రపంచమును దాటిపోయి జీవితమునందున్న బిగి, పరిపూర్ణత మొదలగు విశాలభావములను జీర్ణించుకొని, సౌందర్యమునొక విశాల దృక్పథముతో అవగాహన చేసికొన యత్నించినట్లు తోచుచున్నది.

మధ్యయుగమునాటి శిల్పరాజములు అసంఖ్యాక

ములు. మచ్చునకు ఐదారుదాహరణములను మాత్రము ఇక్కడ చూపవచ్చును. అగ్రస్థానము రామప్ప దేవాలయమునందలి నాల్గుప్రతిమలకు ఒసగవచ్చును. ఈ ప్రతిమలు ఇంచుమించుగ మానవ పరిమాణమున పెద్ద పెద్ద విశాలఫలకములపైన నిర్మింపబడినవి. ఇవి సాంచీ తోరణముల మీదను వరంగలు తోరణద్వారముల మీదను ఉన్న యక్షప్రతిమలవలె స్తంభాగ్రమునుండి ఏటవాలుగ నిలబడి పైనున్న దూలములను మోయుచున్నట్లు అమర్చబడిన బ్రాకెట్ ఫిగర్స్ అను పార్శ్వ ప్రతిమలు వాస్తు సాంప్రదాయానుసరముగ ఏర్పరుప బడినను ఇవి కేవలము ఆలంకారికములే గాని వీనినుండి వాస్తు రీత్యా ఏట్టి ప్రయోజనములేదు. ఫొటో చిత్రములకును యవనశిల్పమునకును అలవాటు పడిన వారికి ఈ ప్రతిమల యందలి అంగసౌష్ఠవము కొంతవరకు స్వభావోక్తి నతిక్రమించి పోయినదనియు, ముఖవైఖరి వాస్తవికత ననుసరించుట లేదనియు తోపవచ్చును. కాని అంగ భంగిమయు, హస్తముద్రలును ప్రస్ఫుటముగ చైతన్య విన్యాసమును స్ఫురించు చున్న జీవకళను అభివ్యక్తము చేయుచున్నవి. ఈ ప్రతిమలు స్ఫురింపజేయు యవ్వనోద్వేగతయు,లయ స్వరూపమును, ఉత్తమ కళ యొక్క లక్షణములే. దేహ స్వరూపమునందు సరళ రేఖలు, కోణములు కానరాక వంపులు, మలుపులు, సమ్మేళనముచెంది చిత్తవృత్తి యొక్క లావణ్యమును ఆనందాతిశయ పారవశ్యతయును స్ఫురింప చేయుచున్నవి. ఈ అంశములు ఇంతకు పూర్వపు శిల్పమున కానరావు.

యావనోద్ధత్యమును, అనిరుద్ధ చిత్తవృత్తియు ఈ పార్శ్వ ప్రతిమలయందే కాక ఈ దేవాలయములందు మరియొక భాగమున కల 'నాగిని' ప్రతిమ యందును గాన్పించును. ఈ మూర్తిని నగ్నముగ చూపి శిల్పి ఎట్టి ఆభరణములును, వేషభూషాదులును చూపజాలని సౌందర్యమును ఒక్క అంగవైఖరి యందే చూపగల్గినాడు. ఇంద్రియ నిగ్రహమును, అహంభావ రాహిత్యమును మానవునికి ఏకైక లక్ష్యముగ శాసించినను హైందవ సంఘము నాగ కన్యకలకును, అప్సరో భామినులకును, గంధర్వాంగనలకును, సమగ్ర సౌందర్య విన్యాసమును, శృంగార భావ పరిపూర్ణతయును ఆపాదించి యున్నది. చిత్తోద్రిక్తతయు, సుఖానుభూతిని నిరవరోధముగ వెలిబుచ్చు అంగవైఖరియు ఈనాగిని ప్రతిమయందు కననగును. ఆ ఒయ్యారంపు నిలుకు సంపూర్ణ స్వేచ్ఛతో చాచి యుంచిన ఆ కాళ్లు, చేతులు కొంచెము పైకెత్తి తన పీనయోధరములను సంపూర్ణ వికసితములుగ జేసిన ఆ సుందరాంగి భంగిమయు శిల్పి కౌశల్యమును చెప్పకయే చాటుచున్నది. చిత్తోద్వేగతయే ప్రధానలక్ష్యముగ నున్న యీ శిల్పమునందు వక్షోభాగమునుండియు నితంబ ప్రదేశమువరకును తీర్చి దిద్దిన అవయవ భంగిమ వలన ఒక వినూత్న చైతన్యము స్పందించుచున్నట్లు స్ఫురింపచేసియావనౌద్ధత్యమును ఇతోధికముగ రాణింపజేయుచున్నది. ఇందు కేవలము ఇంద్రియచాపల్యమును స్ఫురింపచేయు కామోద్రిక్తత ఎంత మాత్రమును కానరాదు. ఈ వ్యక్తి మానవభిన్నయైన నాగనికయను నంశ మెటుండ ఈ నాగనిక చేతనున్న పడగవిప్పిన పామును, మెడచుట్టును మెలివేసిన పాములును ఈ శిల్పమునకు సామాన్యకాముకి జనసంబంధమైన వాతావరణమునకు భిన్నమైన ఒకవిశిష్ట, ప్రాతికాతీత వాతావరణమును సృష్టించి ప్రేక్షకుని చిత్తవికారమును కళాప్రపంచమునకు సంచాలితముచేసి రక్తికట్టించుచున్నది. సుఖసాగరమున మునిగియున్న ఈ సౌందర్యరాసి నాగ సాంగత్యమును గోరుచున్నదేమో! తన సుకుమార కోమల గాత్రములచే మానవాతీత స్థితియందుమాత్రమే గంధాదులవలె పరిష్వంగమొనర్చు నేమో? అభినవుకౌశలమొప్ప వేశ్యమధ్యన అంత ఒయ్యారముగ ఫణిరాజును పట్టుకొనియున్న ఈ నాగనిక సామాన్యమానవునిపై దృష్టినిన బరపునా? ఎంతో సూక్ష్మముగ పరిశీలించి, రచించినగాని కామాంధకారమునకు ఎడమీయు ఈనగ్న స్త్రీరూపము ఇట్టి ఉత్తమ శిల్ప నిదర్శనముగ పరిణమించియుండదు.

స్త్రీమూర్తిని చిత్రించుటలో భారతీయ శిల్పికి ఎందున సాటి గానరాదు. అధునాతన పాశ్చాత్య శిల్పమునందు - ముఖ్యముగ సాంకేతిక వాదమనియు, చిత్తాంకిత వాదమనియు చర్చింపబడుచున్న పాశ్చాత్య సంప్రదాయములందు-ప్రాచీన భారతీయ శిల్పప్రభావము కొంతవరకు ప్రసరించియుండుటవలన కాబోలు ప్రకృతి యనుకరణమున కీనాటివరకు ఒసగిన అత్యధిక ప్రాధాన్యత తగ్గి, జీవచైతన్యమును, భావోద్వేగతను ప్రస్ఫుటము చేయగల శిల్పచిత్రపద్ధతులు-అవి వాస్తవికతా నిరూపణకు వేరు దారిత్రొక్కినను సరే-అనుసరింపబడుచున్నవి. 'ఎత్తుకొనివచ్చు కటి కుచోద్వృత్తి చూచి, తరుణి తనుమధ్యమెచటికో తరలిపోయె,' నని ప్రశస్తిగాంచిన స్త్రీమూర్తి తెలంగాణ శిల్పమునం

దెందుజూచినను గాంచనగును. ఈ పద్ధతి నిన్నటిమొన్నటివరకును ప్రాచ్యమాధ్యమునను, సత్యేతరమగు అతిశయోక్తికిని నిదర్శనమని పాశ్చాత్యులచే నిగసింపబడుచుండెను. కాని భావస్ఫురణకు కవివలెశిల్పియు కూడ కొన్నిఅంశములను ఉత్ప్రేక్ష చేసియో, అతిశయముగ జెప్పియో; మరకొన్నిఅంశములను సంకుచితపరచియో, భావద్యోతకమునకు యేంతయో శ్రమపడిన కాని తన అమోఘ సందేశమును అందజేయజాలడను అంశము ఇప్పటికి క్రమముగ బోధపడుచున్నది.

పానుగల్లునందలి శిల్పములను రెంటిని ఇందు పరిశీలింపక తప్పదు. గణపతిమూర్తియు, నటరాజమూర్తియు కానరాని దేవాలయమే లేదని చెప్పవచ్చును. కాని పానుగల్లునందున్న ఈ శిల్పములు రెండును సాటిలేనివని చెప్పవచ్చును. మూషక వాహనుడైన ఈ ప్రసన్న గణపతి, ధ్యానశ్లోకములందును లక్షణ గ్రంథములందును నిర్వచించిన రీతిగ నిర్మించబడినను, ఇతని లంబోదరత్వము కాని, కడకు మూషక వాహనత్వము కూడ, హాస్యమును బుట్టించుటలేదు. ఇతని ఆకారాది విశేషములన్నియు విపరీతసగణివని కూడ తోచుటలేదు. వాహనమునకు క్రిందనున్న రేఖాచిత్రమును, దక్షిణపార్శ్వముననున్న కదళీ ఖండమును ప్రధానలయను అనుసరించుచు జీవకళ ఉట్టిపడు ఈ చిత్రమునకు ఒక విశిష్టస్థానమును ఒసగుచున్నవి. రేఖల సొబగు, గతియుతముగ ఒక ప్రధానలయ ననుసరించి నిర్మితము చేయబడియున్నదని ఈ వంపులు తీరియుండు పద్ధతిని బట్టిచే నిరూపింపవచ్చును. గజాననుని తొండము వామభాగమునకు తిరిగి యున్నందున కదళీఖండము దక్షిణభాగమున ప్రారంభమై చక్కగ నిలువున పైవరకు నిలచి,ప్రభావళివలె అతని కిరీటము పైన ఒక భాగము క్రిందకు వంగి చుట్టినను రెండవ భాగము పైకెగసి లయానుబద్ధముగ వామహస్తము నందలి చక్రరూపముననున్న అక్షమాలతో శృతిగలయుచున్నది. గణపతి స్థూలదేహమును, తదనురూపమగు మూషకమును చిత్రమునందు దిగువభాగము నాక్రమించియున్నను తీగెలవలె పైనున్న ఈ వంపుల రేఖలు చిత్రమునకు ఒక సమష్టిత భావమును కల్పించుచున్నది. పునాది ప్రాయముగ మూషికమునకు క్రిందనున్న రేఖా రచన చిత్రమున కంతటికిని ఒక ప్రధాన భూమిక నేర్పరచుచున్నది.

శివమూర్తి ఎన్నిరూపములంగనో యున్నను నటరాజమూర్తి యందున్న సౌందర్యము, చైతన్యము, లయావిన్యాసము ఏ ఇతర ఉత్తమ కళానిదర్శనములందును కానరాదు. నటరాజమూర్తి పల్లవ లోహమయ మూర్తుల యందును, ఎల్లోరా గుహాలయందలి అర్ధాభాన చిత్రములందును జగత్ప్రసిద్ధి గాంచినది. పల్లవ శిల్పమును గూర్చిన ప్రస్తావన ఇటఅప్రసక్తము. కాని ఎల్లోరా శిల్పమునందుగల నటరాజమూర్తి యందు గాన్పించు క్రోధముగాని, క్రౌర్యముగాని. ప్రతీకారవాంఛగాని పానుగల్లు శిల్పమునందు కానరావు. ఇచట కూడ శివపాదముల క్రింద ఒక వ్యక్తి చిత్రింపబడి యున్నది. కాని ఈ శివమూర్తి అసుర సంహారము చేయుచు, శత్రువును కాలిక్రింద నలిపివేయుచున్నాడనుటకన్న ప్రళయతాండవ మొనరించుచు పాదకమలముల క్రిందనున్న పుణ్యవ్యక్తిని తన్మయత నొందించి పవిత్రీకృతము చేయుచున్నాడన వచ్చును. అంగభంగిమయు, బాహువు లధికమైనను భారమనిపించక, సుళువుగ అటునిటు ప్రసరించు వైశిష్ట్యతయు, సుకుమారములైన చేతివ్రేళ్లును, కాలివ్రేళ్లును ఈ మూర్తికి క్రోధోద్వేగము నాపాదించుటకు బదులుగ ఆత్మసంతృప్తి నొసగు అసమాన నాట్యవైఖరియందు అఖండానుభూతిని గడించిన పరమపురుషుని, పరాశక్తిని స్ఫురింపజేయుచున్నవి. ౦

భంగిమా వైఖరియందు ఒక విశిష్టతయును, వివిధాగముల స్వేచ్ఛా ప్రవృత్తియందు వర్ణనాతీతమైన ఒక అనుకూల్యతయు; చైతన్యస్ఫూర్తిని జూపుటయందు ఒక ప్రస్ఫుటతయు, అలంకారములను, ఆభరణములను రచించునపుడు ఒక వినూత్న శోభయు, లావణ్యమును యువియే మధ్యయుగమునాటి తెలంగాణా శిల్పము యొక్క విశిష్టలక్షణములు.

### ప్రాచీన వాస్తు, శిల్ప సామగ్రి గల ప్రదేశములు.

## హైద్రాబాదు జిల్లా

మైసారం హైద్రాబాదు జిల్లా హైద్రాబాదు నగరమునకు 10 మైళ్ళలో యున్నది. ఇక్కడ యెన్నియో శిథిలములైన శిల్పములు గాన్పించుచున్నవి. గోలకొండ పతనానంతరము ఔరంగజేబు నాశనము గావించిన హిందూదేవాలయముల శిథిలములే ఈ రూపమున గాన్పించుచున్నవని ఒక వాదము.

గోలకొండ:— హైద్రాబాదు జిల్లా హైద్రాబాదు నగరమునకు సుమారు 5 మైళ్ళు పశ్చిమమున

గలదు. ఈకోట కుతుబుశాహి వంశీయులకు ముఖ్య పట్టణమైనందున చాల వృద్ధినొందెను. బహమనీ కుతుబ్ శాహీ సుల్తానుల పరిపాలన క్రింద చాల మార్పులుగాంచిన పిదప ఈ కోట నేడున్నరూపము దాల్చినది. కాని ప్రథమమున ఈ కోటనుగట్టిన వారు కాకతీయ రాజులే. క్రీ. శ. 1346 నందు అనగా కాకతీయ ప్రతాపరుద్రుని తరువాత సుమారు 40 సంవత్సరములకు తరువాత ఈ కోట వరంగలు రాజ్యమునుండి, నాడు గుల్బర్గాసుల్తానుగా రాజ్యమేలుచున్న మహమ్మద్ షా బహ్మనీసుల్తానుకు దత్తమాయెను. అతడీ కోటయొక్క ముఖ్య ప్రయోజనమును గురించి తగు రీతి వృద్ధిచేసి మహమ్మద్ నగర్ అని తనపేరిట యీ కోటకు ప్రతినామమిడెను.

## నిజామాబాదు జిల్లా

బాల్కొండ-

జాగీరు గ్రామము. ఆర్మూర్ తాలూకా నైజామాబాదు జిల్లా (18°53'ఉ—78°21'తూ) లో ఆర్మూర్ పట్టణమునకు 6 మైళ్ళ దూరమునను, ఇందూరు రైలు స్టేషనుకు 24 మైళ్లు దూరమునను గలదు. ఈ పట్టణము చుట్టును కోట గోడయు, బురుజులదర్వాజాలు కలవు. ఒక చక్కని దేవాలయము కూడ కలదు. తరువాతి కాలమునాటి మహమ్మదీయ గోరీలు, మసీదులు, ఇత్యాది ప్రాచీన శిథిలావశేషములను కనుమరుగు చేసినను ఇది ప్రాచీన నగరములలో నొకటి యనుటకు సందియము లేదు.

యల్లారెడ్డిపేట:- ఇది తాలూకా గ్రామము. ఇచట రెండు గొప్ప ప్రాచీన దేవాలయములు కలవు. ఈ దేవాలయములందలి శిల్పము చాల మనోహరముగ నున్నది. ముఖ్యముగా ఇందలి మూర్తి శిల్పము ప్రశస్తనీయము. మానవాకృతిని సర్వతో సమగ్ర సౌష్టవముగ నిర్మించిన స్థలములలో నిది యొకటి.

నిజామాబాదు:- అసలు నిజామాబాదు నందు నేడు జైలుఖానా ఉన్నది. ఇది ఇందూరు కోటయని ప్రసిద్ధి చెందిన ఒక పెద్ద దేవాలయభాగము. ఈ దేవాలయమును, అనతి దూరమునగల గొప్ప తటాకమును రఘునాథదాసు అనునతడు కట్టించెనని ప్రతీతి. ఇతనిని గూర్చి మనకేమియు తెలియదు.

## మెదకు జిల్లా

మెదకు:- ఇచటి కోట కాకతీయుల నాటిదే అనవచ్చును. ఇది ప్రథమమున వరంగలు రాజుచే నిర్మింపబడెనని ప్రతీతి. నేడున్న కోట భాగము సుమారు 16 వ శతాబ్దము నాటిదని తోచుట వలన బహుశః ప్రాత కోటను చాలవరకు వృద్ధిచేసి 16 వ శతాబ్దమున నేడున్న కోటను నిర్మించిరని తోచుచున్నది. కోటల కన్న యీ జిల్లాయందు మధ్యయుగము నాటి దేవాలయము లెక్కువగ కాన్పించుచున్నవి. చాట్కూరు, కలబూగు, కంది, నంది, వెంకటాపూర్ ఇవన్నియు సుప్రసిద్ధ దేవాలయముల కల గ్రామములే. అన్నిటికన్న ముఖ్యమైనది పటాన్‌చెర్వు. ఇందు భూగర్భమున ఎన్నియో దేవాలయములు కలవని నానుడి. ఇప్పటికిని త్రవ్వినపుడెల్ల దేవాలయ శిథిలములు గనబడుట సర్వ విదితమే.

## మహబూబునగరం జిల్లా

ప్రతాపరుద్రకోట.—ఇది మహబూబునగరం జిల్లా అమ్రాబాదు తాలూకాలో యున్నది. దీనిలో ఒక పెద్ద సేన సురక్షితముగ నేటికిని ఉండగలదు.

చంద్రగుప్త:- ఈ గ్రామము అమ్రాబాదునకు దక్షిణమున సుమారు 32 మైళ్ళదూరమున కృష్ణానది వామతీరమున గలదు. నేడిది శిథిలమైనపట్టణము. కాని కాకతీయ ప్రతాపరుద్రుని కాలములోన జనసమ్మర్దముతో నిండియుండినట్లు తోచుచున్నది.

ఇదే తాలూకాలోనే నాలుగు ప్రశస్తములైన దేవాలయములు కలవు. వీనిలో ముఖ్యమైనది మహేశ్వర దేవాలయము. ఇది ఒక పర్వతశిఖరముపైన గట్టబడియున్నది. దేవాలయమును చేరుకొనుటకు సుమారు 900 మెట్లు ఎక్కవలెను.

పానుగల్లు:—ఇది నాగర కర్నూలుతాలూకాలో కలదు. ఇది ప్రశస్తిగాంచిన పెద్ద పర్వతదుర్గము. ఈ దుర్గము సుమారు 1½ మైళ్లు పొడవును, 1 మైలు వెడల్పును కలదు. ఈ కోటకు ఏడు బురుజులును ఏడు ప్రాకారములును (ఒకటిలోనొకటి) కలవు. మధ్యన కేంద్రము దుర్భేద్యముగానున్నది. ఈ కోట మూలముగ ఇదిగొప్ప రణభూమిగ నేర్పడెను. విజయనగర, వరంగలు సేనలుకలసి బహమనిసుల్తాను ఫీరోజిషాహను ఎదుర్కొని ఓడించినది ఇచటనే. తరువాత క్రీ. శ. 1513 ప్రాంతమున విజయనగరసేనలకును,

సుల్తాన్ మహమ్మద్ కూలీ కుతుబ్ షాకును ఘోరరణము సంభవిల్లినదికూడ ఇచ్చటనే. మహమ్మదీయ యుగమునకూడ ఈ రణమున విజయనగరసేన ఓడిపోయెనని మహమ్మదీయచరిత్రకారులు వ్రాసియున్నారు కాని, ఇవి అతిశయోక్తులేమో అనియు విజయనగరసేన పరాజితమగుటకు బదులు కృష్ణదేవరాయల నాయకత్వమున విజయనగరము అఖండవిజయముగాంచి రాయలకు "యవన రాజ్యస్థాపనాచార్య," అను బిరుదము దెచ్చుటకును ఈ రణము కారణమాయెనని శ్రీ డాక్టరు నేలటూరి వెంకటరమణయ్యగారు చక్కగ చర్చించి విశదీకరించియున్నారు.

ఈ కోట చాల ముఖ్యమైనదిగ పరిగణింపబడె ననుటకు యెన్నియో నిదర్శనములు కలవు. నవాబ్ నైజాం అలీఖాన్ ప్రభువుకూడ క్రీ. శ. 1786 నుండి సుమారు 3 సంవత్సరముల కాలము ఇందు నివసించుచుండెను.

# నల్లగొండ జిల్లా

## ఈ జిల్లాయందు 4 సుప్రసిద్ధమైన కోటలు కలవు

1. నల్లగొండ 2. దేవరకొండ 3. బర్లకొండ (సూర్యాపేట తాలూక) 4. భోంగీర్. ఈ నాలుగు ప్రదేశము లందును కల కోటలు చారిత్రిక సుప్రసిద్ధములు. వాసికెక్కిన దేవాలయములు 1. పానుగల్లు (నల్లగొండ తాలూకా) 2. నాగులపాడు. (దేవలపల్లి వద్ద సూర్యాపేట తాలూకా) 3. పిల్లల మర్రి (సూర్యాపేట తాలూక) మున్నగు చోట్ల కలవు. మధ్యయుగము నాటి వాస్తుశిల్ప వైభవమునకు ఇవి ఉత్తమ నిదర్శనమని చెప్ప వచ్చును. నీలగిరి యను పేర బరగి సుల్తాన్ అలావుదీన్ బహమన్ షా విజయమునకు పిదప నల్గొండ యని ప్రతి నామమును పొందిన ఈ పట్టణము నందలి దేవాలయమును కూడ ఈ సందర్భమున పేర్కొన వచ్చును.

# వరంగల్ జిల్లా

వరంగల్లు, హనుమకొండ, మట్వాడా ప్రాంతములందలి ప్రాచీన వాస్తు శిల్ప విశేషములు జగద్విదితములు. హనుమకొండ యందలి సహస్ర స్తంభ దేవాలయమే కాక కోటయందు ప్రభుత్వ ఖనన శాఖవారు త్రవ్వి తీసిన దేవాలయ శిథిలావశేషములును, గుట్టలమీద అచ్చటచ్చట గాన్పించు పెద్దపెద్ద జైన విగ్రహములు, సాటిలేని కోట ఇవన్నియు చాల వరకు తెలిసినవే: ఇచటికి కొన్ని మైళ్ళ దూరమున పర్కాల తాలూకా యందుగల రామప్ప గుడియు కూడ సర్వ విదితమే. అగ్ని పర్వతజన్యమని నుతిగాంచిన దుర్భేద్యమగు నల్లరాతిని మైనమువలె తీర్చిదిద్ది అసమానమైన వాస్తు విశేషములను ముద్దులొలుకు శిల్పమును తీర్చిన తెలంగాణా శిల్పికి శాశ్వత చిహ్నములు ఈ దేవాలయములే! కొలనుపాక, కూల్పాక్ దేవాలయములు ఇంతకన్న ప్రాచీనములైనవి. కాని వాస్తు వైఖరి యందును, శిల్ప సౌష్టవము నందును కూడ తీసిపోవునవికావు.

ఖమ్మంమెట్టు కోటకూడ నాటిదే అని తోచుచున్నది. వర్ధన్నపేట తాలూకాలోనున్న వలబ్‌గొండ యను ప్రతి నామముగల జాఫర్‌గడ్ కోట బహుశః కాకతీయుల నాటిదేయై యుండును ఇప్పటికిని ఇందు రెండు ప్రాకారములును, 7 బురుజులును కనుపించుచున్నవి. కాని ఇందున్న ఫిరంగులును, ఖమ్మం, మెట్టువద్దనున్న ఫిరంగులును కూడ, తరువాతి కాలము నాటివని అనుటకు సందియములేదు.

హసనపర్తి (వరంగలు తాలూకా) (18° 5' ఉ; 79° 31' తూ) ఇందున్న వెంకటేశ్వర స్వామి ఆలయము చుట్టుముట్టు ప్రాంతముల నుండి జాత్రకాలమున చాలమంది యాత్రికుల నాకర్షించుచున్నది, కాని ఏమంత గొప్పప్రాముఖ్య మున్నట్లు కన్పించుట లేదు.

# కరీంనగరం జిల్లా

ఈ జిల్లాయందు వినుతికెక్కిన దుర్గములు కలవు-

1. ఎల్‌గండల్ (కరీంనగరం తాలూక)- తరువాత కాలమున యీ కోటను బహమనీ సుల్తానులు వృద్ధి పరచినను ఇది అనాదిగ ప్రాచీన హిందూ రాజుల కాలమునుండి వెలసిన కోటయే.

2. జాఫ్‌గూర్ 3. మలంగూరు- ఈ కోటలు రెండును జమ్మికుంటతాలూకాయందు కలవు. ఇవియు కాకతీయుల యుగమునాటివే యని తోచుచున్నది.

4. అనంతగిరికోట (సిరిసిల్లా తాలూక) పర్వత దుర్గము- నేడు శిథిలావస్థలో యున్నది!

5. ప్రతాపగిరి కోట (మహదేవపూరుతాలూకా)- పేరును బట్టియే తెలియుచున్నట్లు ప్రతాపరుద్ర నిర్మితమని ఐతిహ్యము కలదు. భావి పరిశోధన వలన నిజము తెలియు వరకును కోట వైఖరిని బట్టి కాక

సీ॥ ఎవని బాల్యక్రీడ నెసఁగు మాహాత్మ్యంబుఁ బ్రకటింతుర్ నేటి కప్పాలవారు,
ఎవని దిగ్విజయయాత్ర లీనాఁడు కథలుగా వచియింతుర్ వేములవాడ జనులు,
ఎవని శాపాక్షర ప్రవణతఁ దలపోసి భయపడుఁ గవుల కిప్పటికి జగము,
ఎవని ఛందః కావ్యకృతి పతి రేచనన్ స్మరియించెదరు నేడు జైనవైశ్యు,

గీ॥ లట్టి వేములవాడ భీమన్న సుకవి పుట్టువునఁ బూతమై యొప్పి పురుడు లేని
వైభవముఁ గాంచు వెలిగందలాభిధాన మండలంబు తెలంగాణ మండనంబు. 12

ఉ॥ కమ్మని కైతలన్ బడుపుకత్తెలఁ జేయు కవీంద్రకోటి డెం
దమ్ములు లజ్జలంగ నరనాథుల నెల్లఁ దృణీకరించి మా
బమ్మెర పోతరాజు మృదుబంధము భాగవతమ్ము వ్రాసె నాం
ధ్రమ్ము మహాపురాణ మహితమ్మయి మేటి యశమ్ముఁ గాంచఁగన్. 13

గీ॥ దక్షిణాధీశ రచిత ముత్యాలశాలఁ బసిఁడి వానలఁ దడిసిన ప్రౌఢకవికి,
రావు సింగన్న భూపాలు రాచకొండ జంకుఁ గలిగించి పైఁగప్పె రాంకవంబు. 14

గీ॥ కాళిదాసాది కవుల సత్కావ్యములకు మహితటీకలు వ్రాసిన మల్లినాథ
సూరి "కొలిచర" మనియెడు నూరఁ బుట్టి కాంచె నాసేతుశీత విఖ్యాత యశము. 15

కం॥ విద్యానాథుఁడు నాతని, హృద్యాలంకార కావ్య హృదయా విష్కా
రోద్యమ ధన్యుఁడు స్వామియు, సద్యశమిట నుండి దెసలఁ జాటెను సుమ్మా! 16

కం॥ వెలిగందల నారయ మొద, లలయప్పకవి ప్రకాండు నందాకను మా
తెలఁగాణమందు వెలసిన, తెలుఁగుం గైసరుల సంఖ్యఁ దెల్పఁగవశమే? 17

గీ॥ తలఁప శ్రీశైల పశ్చిమ ద్వారమగుచు, వరలి బ్రహ్మేశ్వరాఖ్యాన పరమశివుని,
కాపురంబున దక్షిణకాశి యగుచుఁ, బొలుపుమీరును మా యలంపురము సతము. 18

గీ॥ శస్తవాతాపి చాళుక్య శాసనముల, స్థలపురాణాలఁ గావ్యాల దక్షిణాశఁ
గాశియై తుంగభద్రోప కంఠసీమ భూషయై వెల్గు మా యలంపూరు పురము. 19

గీ॥ బిజ్జలాన్వయ పాథోధి బిసరుహాప్తుఁడైన చిన తిమ్మభూపాలు డచట నేలి
తెనుఁగుఁ గావించె మధురధారను మురారి రమ్యపద గుంభితానర్ఘ రాఘవంబు. 20

గీ॥ మత్స్యనగరాభిధానసంపత్తి వెలసి, కళల నెలవైన నేఁటి గంగాపురంబు
రెడ్డిరెడ్డి మల్లారెడ్డి మృదులకావ్య కలితమాహాత్మ్యమగుచు వేడ్కల ఘటించు. 21

తీయులనాటిదే యని తీర్మానింప వచ్చును. జగత్యాల కోటను క్రీ. శ. 1747 నాడు ఫ్రెంచివారు జాఫర్ ఉద్ దౌలా కోసము నిర్మించిరి. ఇందు తరువాతి కాలము నాటి విశేషము ఒకటి కలదు. క్రీ. శ. 1754 నందు జాఫర్ ఉద్ దౌలా ఇందొక మసీదును నిర్మించెను. ఈ మసీదునకు ఒక చివరనున్న ఎత్తైన మినరెట్ స్థంభమును ఊపిన యడల ఊగులాడును. ఇన్ని సంవత్సరములు ఇంత చిత్రముగ ఎట్లు నిలబడి యున్నదో ?

రాకపోకల సౌకర్యములు తక్కువైనందునకాబోలు యీ జిల్లాయందలి వాస్తు శిల్ప విశేషము అంతగా తెలియుట లేదు. కాని 1. గుర్రాల్ నందున్న దేవాలయము క్రీ. శ. 1229 నందు కాకతీయుల కాలమున నిర్మింప బడినట్లు ఆధారముకూడ కలదట. 2. కాకట్యూరు నందున్న దేవాలయము కూడ ఈ నాటిదే యని తోచుచున్నది. చాలవరకు శిథిలమై యున్నను ఇప్పటికిని ఇందు గాన్పించు శిల్పము చాల ఉత్తమ తరగతికి చెందినది. ఈ దేవాలయమునకు వెలుపల ఒక శిలస్థంభము పైన ఒక ఓరియా శాసనము కలదట. గజపతిరాజులు తమ దండయాత్రలను ఇంత దూరము వరకు సాగించిరనుటకు ఇంతకన్న తార్కాణము అవసరము లేదు. 3. ధర్మపురి (జగత్యాల తాలూక) ఇది యీతాలూకాలో గోదావరినది దక్షిణ తీరమునకలదు. ఇందున్న ప్రాచీనదేవాలయముకూడ ప్రశంసనీయమైనదే. 4. **లేములవాడ** (సిరిసిల్లా తాలూక) 18 o28' ఉ.–78o53' తూ. సిరిసిళ్ళకు సుమారు 8 మైళ్లదూరమున కలదు. ఇక్కడ ఒక ప్రశస్తమైన దేవాలయము పుష్కరిణి కలవు. పుష్కరిణి ఆవరణమునందే ఒక మహమ్మదీయగురువుయొక్క గోరీ కలదు. మతభేదములేక హిందువులును మహమ్మదీయులునుకూడ యిందు పూజింతురట.

## ఆదిలాబాదు జిల్లా

**మాక్కరు:**–(ఆదిలాబాద తాలూక). ఇందొక పర్వతదుర్గముకలదు. ఈదుర్గమునకలమసీదు కొన్నికొన్ని కట్టడములును మధ్యయుగము నాటి మహమ్మదీయ సుల్తానుల నిర్మితములైనను యీ కోట చాల ప్రాచీనమైనదని తోచుచున్నది. మాణిక్ గర్హ్ కోటను కొండవంశపురాజులు నిర్మించిరని ప్రతీతి. ఇదియును చాల కాలమునాటిదే.

మాక్కరుకొండ దిగువభాగమున పాండోలేనా అనుపేరుగల ఒక గుహాలయము కలదు. దీనియందు రెండు విశాలమైన గదులున్నవి. ఒక గదిలో చిన్న దేవాలయమే నిర్మింపబడియున్నది. కొండ పై భాగమున ఒక ప్రాచీనదేవాలయము కలదు. ఈ ఆలయము సుమారు 180 చదరపుఅడుగుల వైశాల్యము సుమారు 54 అడుగుల ఎత్తునుకలదు. ఈ ఆలయము ప్రకృతము 400మందిగోసాయీలు వారిమహంతు ఆధీనమునందుకలదు. ఇందలిశిల్ప మేమాత్రము చెప్పతగినదికాదు.

ఆదిలాబాదపట్టణమునందుకూడ ఒక దేవాలయము కలదు. సాంవత్సరిక తిరునాళ్లలోతప్ప యీ ఆలయమున కెక్కువ ప్రాముఖ్యములేదు కాని ప్రాచీన తెలంగాణాలయములలో నిదియు నొకటి.

## రాయచూరు జిల్లా

**రాయచూరు కోటలు:**—ఈ జిల్లాయందు తెలంగాణమునకు సంబంధించినవి కొప్పల్, జలదుర్గ్, షాహాపూర్, దేవదుర్గ్, యాద్గిర్, ముద్గలు, మల్లయాబాద్, ఆనెగొంది, అలంపూరుకోటలు కర్నాటక ప్రాంతమునకు చెందినవైనప్పటికిని సాహచర్యమువలన తెలంగాణచరిత్రకు సన్నిహితసంబంధము కలదు.

కొప్పల్, కుక్కనూరు, కల్లూరునందు గల సుప్రసిద్ధ దేవాలయములు కర్నాటకప్రాంతమునకు చెందినవికాని అలంపూరునందలి చాళుక్య దేవాలయములునూ, ఆనెగొందిలోని కట్టడములును, గంగావతియందలి రెండు దేవాలయములును, మాన్వియందలి మూడుదేవాలయములును తెలంగాణమునకు చెందినవే!



# నేటి హైదరాబాదు - కొన్ని అంకెలతో

శ్రీ కొమ్మవరపు సుబ్బారావు

బ్రిటిషుప్రభుత్వమునకు విశ్వాసపాత్రుడై వారి ఛత్రచ్ఛాయక్రింద తన ఇష్టమువచ్చినటుల మెలగిన నవాబు నిజాము మీరుస్మానలీఖాన్‌గారి పాలనలోనుండిన హైదరాబాదు రాష్ట్రమునుగురించి యిదివరకు వ్రాసిన రచయిత మరల 'నేటి హైదరాబాదు' ను గురించి వ్రాయవలసివచ్చినపుడు విస్మయమొందక మానడు.

ఈ నైజాము 1911 సం॥లో రాజ్యమునకు వచ్చినప్పటినుండి పోలీసుచర్య జరుగువరకు హైదరాబాదు ఇస్లాము రాజ్యమనియు, రాజభాష ఉర్దూ అనియు ఉద్ఘాటించుచు ప్రపంచ ముస్లింరాజులందరిలో తాను మేటికావలయునని ఉవ్విళ్ళూరుచుండెను. వారి అనుయాయులగు సర్ అక్బర్ హైదరీ మొదలగువారు శ్రీవారి ఉద్దేశములను సఫలముచేయుటకై 1918 సం॥లో ఉస్మానియా విశ్వవిద్యాలయమును స్థాపించి, ప్రజల మాతృభాషలను అణగద్రొక్కి ఉరుదూభాషకు ప్రాధాన్యత నొసగిరి. మహమ్మదీయులందరును ఈ అవకాశముచే డిగ్రీలుపొంది ప్రభుత్వోద్యోగాలను, వ్యాపారసంస్థలను స్వాధీనపరచుకొనిరి.

బ్రిటిషు ఇండియాలోనుండిన ముస్లింలీగుకు ప్రతిగా ఇక్కడ 'ఇత్తెహాదుల్ ముసల్మీన్' సంస్థను 'ఖాక్సార్లు' అను స్వచ్ఛందసేవకులను నవాబ్ బహద్దర్ యార్జంగ్ సాపించెను. మహమ్మదీయులు రెచ్చగొట్టబడి హిందూమతమును రూపుమాపుటకు దీక్షవహించిరి. బహద్దర్ యారుజంగు ఆకస్మికమరణముచే మహామహుడు సయ్యద్ కాసింరజ్వీ నాయకత్వమువహించి రజాకారు సైన్యము నేర్పరచి నవాబును అటుండుమని రజాకారుప్రభుత్వమును సాగించెను. ఇతనికి జిన్నా ఆదర్శపురుషుడు. పాకిస్తాన్ వీరికి భూతలస్వర్గము. ఈరజాకారులచర్యలు సుప్రసిద్ధములు. పోలీసుచర్య జరుగకపోయినచో పాకిస్తానులోవలెనే హైదరాబాదులో ఒక హిందూపురుగుకూడ మిగిలి యుండక పోయెడిదని చెప్పినచాలును.

1948 సెప్టెంబరు 13 వ తేదీ రాష్ట్రీయులకు మంగళదివసము. ఈశుభదినమున భారత సైన్యములు నలువైపుల విజృంభించి రజాకారు గర్వసముద్రమును అగస్త్యునివలె ఆపోశనము పట్టిసవి. మొట్టమొదట సైన్యములతో హైదరాబాదు చేరుకొనిన మేజర్ జనరల్ జయంతనాథచౌదరీ ప్రభుత్వమును వశపరచుకొనెను. కల్లోలములణచబడి పరిస్థితి అదుపులోనికి తీసికొనిరాబడెను.

కాని అదివరకు దేశశ్రేయమే లక్ష్యముగ నిడికొని అనంతత్యాగములుచేసిన కాంగ్రెసు నాయకులు అధికారమును చేజిక్కించుకొనుటకై పరస్పరానుమానములతో ఈర్ష్యాసూయలతో శునకసంగ్రామమును మించి పోరాడసాగిరి. ఈ దుర్విధిచే వెంటనే రాష్ట్ర

ములో బాధ్యతాయుతప్రభుత్వ మేర్పడక మిలిటరీపాలన యేర్పడెను. చౌదరీగారికి సహాయకులుగా- డి. యస్. బాక్లే. ఎం. శేషాద్రి, సి. వి. యస్. రావు. పి. హెచ్. కృష్ణారావుగార్లు పంపబడిరి. ఒకటిన్నర సంవత్సరముతరువాత ప్రజల ఘోష ననుసరించి భారతప్రభుత్వము ఇక్కడ మిలిటరీ పాలనను అంతమొందించి ఒక అర్ధాంతరపు ప్రభుత్వమును ప్రారంభించెను. శ్రీ వెల్లోడి ప్రధానమంత్రిగా ఈ క్రొత్త పరిపాలన మొదలైనది.

దేశకాలములను గమనింపక స్వార్థమునకై పెనగులాడుచుండిన కాంగ్రెసువారిని చీవాట్లుపెట్టి సర్దారువల్లభభాయిపటేల్ బెదరించి తమలోతాము రాజీపడునట్లు చేసిపోయిరి. దాని ఫలితముగా నలుగురు కాంగ్రెసు మంత్రులు ప్రభుత్వమున చేరిరి.

## ఇప్పటి మంత్రి మండలి

శ్రీ యం. కె. వెల్లోడి ప్రధానమంత్రి (1-12-49)

నవాబ్ జైన్ యార్జంగు బహద్దర్ నిర్మాణ శాఖ (18-10-48)

శ్రీ ఎం. శేషాద్రి హోంశాఖ (9-2-49)

శ్రీ సి. వి. యస్. రావు ఆర్థిక పారిశ్రామిక శాఖలు (13-4-49)

శ్రీ బూర్గుల రామకృష్ణరావు రెవిన్యూ, విద్యా, ఆబ్కారీ శాఖలు (12-6-50)

శ్రీ పూల్‌చంద్ గాంధీ ఆరోగ్య, స్థానిక పరిపాలన శాఖలు (12-6-50)

శ్రీ వినాయకరావు విద్యాలంకార్ ఆహార, వ్యవసాయ శాఖలు (12-6-50)

శ్రీ వల్లూరు బసవరాజు కార్మిక, అటవీ, కరోడ్గిరీ శాఖలు (12-6-50)

శ్రీ శేషాద్రి గారు రెవిన్యూమంత్రిగానున్నప్పుడు కొన్ని ప్రజోపయోగములగు శాసనములు చేయబడెను. జాగీరులు పాయగాలు రద్దుచేయబడెను. కౌలుదారీశాసనము చేయబడెను. కొత్త తాలూకాలు జిల్లాల నిర్మాణము జరిగెను. ప్రస్తుతము హైదరాబాదు రాష్ట్రమునుండి 16 సభ్యులు భారత పార్లమెంటుకు సభ్యులుగా తీసుకొనబడినారు.

నేటి హైదరాబాదులో జిల్లాలు, తాలూకాలు, పట్టణములు, గ్రామాలు క్రింది విధముగ నున్నవి. ఇందలి జనసంఖ్య 1951 మార్చిలో జరిగిన జనగణనము వారి తాత్కాలిక నివేదికనుబట్టి ఇచ్చుచున్నాను. ఇప్పటికి జనగణనము జరిగి నాలుగునెలలే యగుటచే సరియైన అంకెలు దృఢముగ ప్రకటింపబడలేదు. తాత్కాలికముగ జనసంఖ్యను మాత్రము ఒక విధముగ తెల్పినారు. తరువాత సంపూర్ణ నివేదిక ప్రకటింపబడునాటికి ఈ అంకెలలో కొద్దిమార్పులు రావచ్చునని గూడ సర్కారువారి తాత్కాలిక నివేదిక చెప్పుచున్నది. తక్కిన వివరములేవియు తెల్పబడలేదు. సమగ్ర నివేదిక సిద్ధమైనచో తెలంగాణము నందలి జనులు- స్త్రీలు, పురుషులు, బాలురు, వృద్ధులు - భాషలు, కులములు, వృత్తులు, అక్షరాస్యులు, నిరక్షరులు, ఉద్యోగులు, నిరుద్యోగులు, నిమ్నజాతుల అంతశ్శాఖలు మొదలైన వివరములన్నియు తెలియగలవు. ప్రస్తుతము తెలియ వచ్చినంతవరకు కొన్ని అంకెలనుమాత్రము మొసగుచున్నాను.

## ప్రస్తుత రాష్ట్రవిభజన - జనసంఖ్య

(1) హైదరాబాదుజిల్లా-జనసంఖ్య 4,15,739.

| తాలూకాలు | గ్రామములు |
|---|---|
| 1 హైద్రాబాదు (పడమట) | 168 |
| 2 ,, (తూర్పు) | 140 |
| 3 షాబాదు | 142 |
| 4 మేడిచల్ | 100 |
| 5 ఇబ్రహీంపట్నం | 148 |
| | 698 |

(2) మహబూబ్‌నగరంజిల్లా- జనసంఖ్య 11,74,312

| | |
|---|---|
| 1 మహబూబ్ నగరం | 135 |
| 2 వనపర్తి | 146 |
| 3 ఆత్మకూరు | 122 |
| 4 మఖ్తల్ | 129 |
| 5 పరిగి | 150 |
| 6 షాద్‌నగర్ | 143 |
| 7 కల్వకుర్తి | 151 |
| 8 అచ్చంపేట | 94 |
| 9 నాగర కర్నూలు | 136 |
| 10 కొల్లాపురం | 119 |
| | 1325 |

(3) రాయచూరుజిల్లా-జనసంఖ్య 10,84,226

| | |
|---|---|
| 1 రాయచూరు | 160 |
| 2 మాన్వి | 171 |
| 3 సింధునూరు | 172 |
| 4 గంగావతి | 157 |
| 5 కొప్పల్ | 163 |
| 6 ఎల్‌బర్గా | 144 |
| 7 కుష్టగి | 179 |
| 8 లింగసుగూరు | 192 |
| 9 దేవదుర్గ | 188 |
| 10 గద్వాల | 102 |
| 11 అలంపూరు | 100 |
| | 1733 |

(4) గుల్బర్గాజిల్లా జనసంఖ్య 13,91,960

| | |
|---|---|
| 1 గుల్బర్గా | 150 |
| 2 చితాపూరు | 122 |
| 3 యాదగిరి | 142 |
| 4 షాపూరు | 159 |
| 5 షోరాపూరు | 187 |
| 6 ఆందోలా | 158 |
| 7 అఫ్జల్ పూర్ | 90 |
| 8 అలందు | 129 |
| 9 చించోలి | 142 |
| 10 తాండూరు | 133 |
| 11 కొడంగల్ | 155 |
| 12 సేడం | 113 |
| | 1680 |

(5) బీదరుజిల్లా — జనసంఖ్య 11,13,840

| | |
|---|---|
| 1 బీదరు | 190 |
| 2 జహీరాబాదు | 158 |
| 3 ఉమ్నాబాదు | 145 |
| 4 భాల్కి | 158 |
| 5 నిలంగా | 197 |
| 6 అహమద్‌పూర్ | 191 |
| 7 ఉద్గీర్ | 17 |
| 8 సంతాపూర్ (ఔరాద్) | 152 |
| 9 నారాయణఖేడ్ | 134 |
| | 1500 |

(6) ఉస్మానాబాదుజిల్లా-జనసంఖ్య 7,26,554

| | |
|---|---|
| 1 ఉస్మానాబాదు | 107 |
| 2 తులజాపూర్ | 108 |

3 పరేండా 112
4 భూం 80
5 కలం 108
6 లాతూరు 116
7 ఔసా 119
8 ఉమరా 114

864

(7) భీడుజిల్లా — జనసంఖ్య 7,17,764

1 భీడు 171
2 పాటోదా 91
3 అస్టి 123
4 గేవురాయి 158
5 మజలేగాంవు 165
6 మోమినాబాదు 171
7 ఖయిజ్ 165

1044

(8) ఔరంగాబాదుజిల్లా-జనసంఖ్య 10,94,916

1 ఔరంగాబాదు 233
2 పైఠాన్ 184
3 గంగాపూరు 224
4 వైజాపూరు 53
5 కన్నడ్ 49
6 ఖుల్తాబాదు 78
7 సిల్లోడు 202
8 భోకర్దన 165
9 జఫరాబాదు 99
10 జాల్నా 213
11 అంబాద 127

1627

(9) పర్భినీజిల్లా — జనసంఖ్య 8,94,862

1 పర్భని 174
2 గంగాఖేడ్ 81
3 పథ్రి 169
4 పార్తూరు 189
5 జింతూరు 227
6 హింగోలి 226
7 కలమనూరు 226
8 బస్మత్ 226

1518

(10) నాందేడుజిలా- జనసంఖ్య 9,27,860

1 నాందేడు 200
2 బిలోలి 204
3 దేగులూరు 213
4 ముదఖేడు 127
5 కంధార్ 201
6 హాడ్‌గాం 200
7 భోకర్ 125
8 ముధోల్ 200

1470

(11) ఆదిలాబాదుజిల్లా --జనసంఖ్య 8,17,704

1 ఆదిలాబాదు 210
2 ఉట్నూరు 166
3 ఖానాపూరు 76
4 నిర్మల 192
5 బోద్ 202
6 కిన్వట్ 171
7 రాజూరా 280
8 సిరిపూరు 204
9 చెన్నూరు 174
10 లక్సెట్టిపేట 174
11 ఆసిఫాబాదు 174

2023

(12) నిజామాబాదుజిలా-జనసంఖ్య 7,55,990

1 నిజామాబాదు 171

| | |
|---|---|
| 2 కామారెడ్డి | 137 |
| 3 బాసవాడ | 125 |
| 4 బోధన్ | 113 |
| 5 ఆరుమూరు | 185 |
| 6 యల్లారెడ్డి | 1[illegible]0 |
| | 851 |

(13) మెదక్ జిల్లా — జనసంఖ్య 9,49,120

| | |
|---|---|
| 1 సంగారెడ్డి | 157 |
| 2 వికారాబాదు | 206 |
| 3 ఆందోలు | 173 |
| 4 మెదకు | 151 |
| 5 సిద్దిపేట | 152 |
| 6 గజవేలు | 170 |
| 7 నరసాపూరు | 166 |
| | 1175 |

(14) కరీంనగరముజిల్లా-జనసంఖ్య 15,34,764

| | |
|---|---|
| 1 కరీంనగరము | 179 |
| 2 సిరిసిల్ల | 175 |
| 3 మెట్టపల్లి | 160 |
| 4 జగత్యాల | 155 |
| 5 సుల్తానాబాదు | 188 |
| 6 మహాదేవపురం(మంథెన) | 170 |
| 7 పరకాల | 13[illegible] |
| 8 హుజూరాబాదు | 132 |
| | 1230 |

(15) వరంగలుజిల్లా — జనసంఖ్య 13,85,856

| | |
|---|---|
| 1 వరంగల్లు | 213 |
| 2 పాఖాల | 195 |
| 3 ములుగు | 218 |
| 4 బూర్గుంపాడు | 76 |
| 5 పాలవంచ | 157 |
| 6 మథిర | 174 |
| 7 యల్లందు | 103 |
| 8 ఖమ్మము | 165 |
| 9 మానుకోట(మహబూబాబాద్) | 152 |
| | 1453 |

(16) నల్లగొండజిల్లా-జనసంఖ్య 13,61,118

| | |
|---|---|
| 1 నల్లగొండ | 231 |
| 2 మిర్యాలగూడెము | 155 |
| 3 దేవరకొండ | 215 |
| 4 రామన్నపేట | 163 |
| 5 భువనగిరి | 183 |
| 6 జనగామ | 189 |
| 7 సూర్యాపేట | 163 |
| 8 హుజూరునగరము | 93 |
| | 1392 |

ఈ విధముగ విభజించి కొన్నిటినిచీల్చి, కొన్నిటినిమార్చి క్రొత్తతాలూకాల నిర్మించి ప్రక్కజిల్లాలతో కలిపినారు. ఆ చేయుటలో భాషాదృష్టిని గమనింపక ఒకభాష మాట్లాడు గ్రామమును ఇంకొక భాష తాలూకాలోను, ఒక భాషతాలూకాను ఇంకొక భాష జిల్లాలోను చేర్చి పూర్వప్రభుత్వము చేసిన గజిబిజనే ఈ ప్రభుత్వముగూడ చేసినది. అందుపై జరిగిన ప్రజలఆక్షేపణలను పురస్కరించుకొని 7 గురు సభ్యులుకల ఒక "బౌండరీకమిటీ"ని ప్రభుత్వము ఏర్పాటు చేసినట్లు ప్రకటింపబడినది. కాని ఆ కమిటీకి భాషాదృష్టితో గ్రామాలను, తాలూకాలను మార్చుటకుగాని, క్రొత్తజిల్లాలను నిర్మించుటకుగాని అధికారములేక అది కేవలము లాంఛనప్రాయముగా నున్నది.

| నగరములు: 3 | జనసంఖ్య |
|---|---|
| 1 హైదరాబాదు<br>2 సికిందరాబాదు<br>కంటోన్మెంటుతో | 10,85,074 |
| 3 వరంగల్లు | 1,30,080 |

| పట్టణములు. (తెలంగాణాలోమాత్రమే) | | 77 |
|---|---|---|
| (౧) హైదాబాదుజిల్లాలో | | 7 |
| (౨) మహబూబునగరంజిల్లాలో | | 10 |
| (3) ఆదిలాబాదు జిల్లాలో | | 8 |
| (౪) నిజామాబాదు జిల్లాలో | | 6 |
| (౫) మెదకు | ,, | 6 |
| (౬) కరీంనగరము | ,, | 14 |
| (౭) వరంగల్లు | ,, | 15 |
| (౮) నల్లగొండ | ,, | 11 |
| | | 77 |

పల్లెలు 10,147 (తెలంగాణములో)

త్వరలోనే ఈ పల్లెలలో గ్రామపంచాయితీలకు. చిన్న పట్టణాలలో టౌను కమిటీలకు, పెద్ద పట్టణాలలో మ్యునిసిపాలిటీలకు ఎన్నికలు వయోజన ఓటుపై జరుపబడి, స్థానిక స్వపరిపాలన యేర్పాటగును.

హైద్రాబాదు సికింద్రాబాదు నగరాలలో వయోజన పద్ధతిపై యెన్నికలు జరిగి రెండు కార్పొరేషన్లు యేర్పడి పని చేయుచున్నవి.

(1) హైదరాబాదు నగరము కార్పొరేషనుకు 65 మంది సభ్యులున్నారు. మేయరుగా శ్రీ మాడపాటి హనుమంతరావు పంతులుగారు ఎన్నుకోబడినారు.

(2) సికిందరాబాదు కార్పొరేషనులో 35 గురు సభ్యులు కలరు. మేయరు శ్రీ వాసుదేవ మొదలియారు గారు.

రాబోవు నవంబరు లేక జనవరి నెలలో భారతదేశ మంతటితోబాటు హైదరాబాదులో గూడ జనరల్ యలక్షనులు జరుపబడి మన రాష్ట్రమునకు శాసనసభ యేర్పాటు కావింపబడును. మనశాసనసభకు జనసంఖ్యను బట్టి 175 స్థానములున్నవి. అందులో తెలంగాణమునకు 95 సీట్లు, కర్నాటకమునకు 36 సీట్లు, మరాట్వాడాకు 44 స్థానము లుండును. వివరములు క్రింద చూపబడుచున్నవి.

| తెలంగాణము 95 సీట్లు | | | |
|---|---|---|---|
| హైద్రాబాదు నగరము | | 10 | స్థానములు |
| ,, | జిల్లా | 4 | ,, |
| ఆదిలాబాదు | ,, | 9 | ,, |
| మహబూబ్ నగరము | ,, | 11 | ,, |
| నల్లగొండ | ,, | 14 | ,, |
| వరంగలు | ,, | 14 | ,, |
| కరీం నగరము | ,, | 15 | ,, |
| మెదకు | ,, | 10 | ,, |
| నిజామాబాదు | ,, | 8 | ,, |
| | | 95 | |

| కర్నాటకము 36 | | | |
|---|---|---|---|
| బీదరు | జిల్లా | 11 | ,, |
| రాయచూరు | ,, | 11 | ,, |
| గుల్బర్గా | ,, | 14 | ,, |
| | | 36 | |

| మరాట్వాడా 44 | | | |
|---|---|---|---|
| నాందేడు జిల్లా | | 9 | ,, |
| పర్భనీ | ,, | 9 | ,, |
| ఔరంగాబాదు | ,, | 11 | ,, |
| భీడు | ,, | 8 | ,, |
| ఉస్మానాబాదు | ,, | 7 | ,, |
| | | 44 | |

ప్రభుత్వము వారి సమగ్ర నివేదిక ప్రకటింపబడిన తర్వాత పూర్ణ వివరములతో తెలంగాణా జనాభాను గురించి తెలుపగలను. ఈ అసమగ్రమై అసంతృప్తికరమైన ఈ నివేదికలోని అంకెలు తాత్కాలిక మైనవిగా భావింపవలయునని ఇంకొకసారి తెలుపుకొను చున్నాను.

# మా రచయితలు



శ్రీ దాశరథి కృష్ణమాచార్యులు.

వయస్సు 25 సంవత్సరములు.

సంస్కృతాంధ్రములను సంప్రదాయసిద్ధముగ అధ్యయనముచేసిన అభ్యుదయకవి. తెలంగాణా రాష్ట్రీయవిప్లవములను జీర్ణించుకొన్న సాహిత్యవిప్లవకారుడు.

నిరర్గళ కవితాధారగలవారు. బాల్యమునుండి ప్రాచీన నవీన కావ్యమర్యాదలనాకళించుకొని తన కావ్యకళద్వారా సామ్యవాదమును నిర్భయముగచాటుచున్న **యువకవి.**

రచనలు:- (ముద్రి) 1 అగ్నిధార, 2 రుద్రవీణ.

వయస్సు 32 సంవత్సరములు.

సంస్కృతాంధ్ర సాహిత్యములలో చక్కని వైదుష్యముకలవారు. భావపూరితమై ధారాశుద్ధిగల మధుర కవిత్వమును వ్రాయగలరు. చక్కని నాటికలను, ప్రహసనములను వ్రాసినారు.

హైదరాబాదులోని విజ్ఞానవర్ధినీ పరిషత్తునకు కార్యదర్శిగా, ఆంధ్ర సారస్వతపరిషత్తు ముఖ్య కార్యకర్తగా సేవచేయుచున్నారు. హైదరాబాదు రేడియో కార్యాలయమున నుద్యోగిగానున్నారు.

రచనలు:-(ముద్రి) త్యాగధనులు, రత్నలక్ష్మీశతకము.
(అ.ము.) మధుర నిశీథము, ఉదయసుందరి, సందేశము, మంగళసూత్రము, సూర్యనారాయణ శతకము, నాటికలు.



శ్రీ కేశవపంతుల నరసింహాశాస్త్రి.
విద్వాన్, శిరోమణి.



శ్రీ ఆదిరాజు వీరభద్రరావు

వయస్సు 50 సంవత్సరములు.

ఆంధ్ర ఆంగ్లభాషలలో విశేషకృషిచేసిన పండితులు. తెలంగాణమునకు జీవితమునుధారవోయుచున్న ఉత్తమ పరిశోధకులు.

విజ్ఞానచంద్రికా గ్రంథమాలకు కార్యదర్శిగా నుండిరి లక్ష్మణరాయేతిహాస పరిశోధకమండలి (హైదరాబాదు) ప్రధాన కార్యదర్శులై సేవచేయుచున్నారు. ఆంధ్రసారస్వతపరిషత్తు, ఆంధ్ర చంద్రికా గ్రంథ మాలల లో బాధ్యతగల కార్యకర్తలు. గోలకొండ కవుల సంచిక, కృష్ణ దేవ రాయాంధ్ర భాషానిలయ రజతోత్సవ సంచిక, హనుమంతరాయ షష్టి పూర్తి సంచికలకు సంపాదకులై సమర్థతతో నిర్వహించినారు. ఆరితేరిన అధ్యాపకులు.

రచనలు:-(ముద్రి) 1 ప్రాచీనాంధ్రనగరములు, 2 లలిత కథావళి, 3 జీవితచరితావళి, 4 రత్నప్రభ.

(అ. ము.) గ్రీకుపురాణ కథావళి, జేమ్సుఅబ్రహాం గారి ఫీల్డుజీవితము, జీవిత సాఫల్యము, పరశ్శతచారిత్రికవ్యాసములు.

